# అభ్యుదయ వివాహ వేదిక పిలుపు

## యువతీ యువకుల్లారా !

## పెండ్లి చేసుకునే ముందు ఆలోచించండి.

1. కట్నం తీసుకోవడం, ఇవ్వడం సబబేనా ? స్త్రీ పురుషులు సమానులనుకుంటే, స్త్రీ తల్లిదండ్రులకు కట్నం అనే జరిమానా ఎందుకు ? మరోరకంగా చూస్తే కట్నం పేరుతో మగాడు అమ్ముడుపోవడం నీచం కాదా ? సంస్కారియైన ఇల్లాలు కావాలో లేక కేవలం తుచ్ఛమైన డబ్బే కావాలో తేల్చుకోండి.

2. ఒకే కులంలోనే, మతంలోనే వివాహమాడాలనడం పొరపాటు కాదా ? హిందువులలో, ముసల్మానులలో, క్రైస్తవులలో ఒకే రకపు రక్తం ప్రవహించడం లేదా ? ఏ వ్యక్తీ మతంతో పుట్టడంలేదు కదా !

3. మత తంతులేకుండా ప్రత్యేక వివాహ శాసనం క్రింద పెండ్లి చేసుకుంటే మంచిది కాదా ? పెండ్లి అనేది లౌకిక వ్యవహారం. దానిని పరలోకంతో, పున్నామనరకంతో, కేవలం సంతానోత్పత్తికి సాధనంగా మత తంతుతో ముడివేయటం అవివేకం. మతానికో పెండ్లి పద్ధతి అనుచితం.

కట్నంలేని, మత తంతులేని, కుల మత ప్రసక్తిలేని వివాహాలను ప్రోత్సహించే సంస్థ **అభ్యుదయ వివాహ వేదిక.**


పి. సత్యనారాయణ<br>అధ్యక్షులు

మల్లాది సుబ్బమ్మ<br>కార్యదర్శి & డైరెక్టరు

వికాస కేంద్రం, 9 ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం,
హైదరాబాద్ – 500 028 ఫోను 31453.

# మహిళా వికాసం

## శ్రమ - ఉద్యోగం



**SOUVENIR**

సంకలనకర్త :

మల్లాది సుబ్బమ్మ

పబ్లిషర్సు :

మహిళా అభ్యుదయ సంస్థ

(INSTITUTE FOR ADVANCEMENT OF WOMEN)

9, ఎం.ఐ.జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం

హైదరాబాద్ - 500 028

# ఇందులో........

# సింహావలోకనం

మానవజాతి ప్రకృతి పరిణామక్రమంలో ఉద్భవించింది. అది ప్రకృతిలో భాగం కాగా ప్రకృతిని అధిగమించగల శక్తి చాలవరకు మానవులకు వుంది. ప్రకృతిలో భాగంగా ఉన్న మానవులలో అజీవపదార్థాల లక్షణం కొంత, జంతు వారసత్వం మరికొంత ఉండగా మానవ విశిష్టత ఎంతో ఉంది. మానవ మెదడు నిర్మాణం జంతుజా :పు మెదడు నిర్మాణం కన్న విశిష్టమైనది పరిసరాలను గుర్తించగలగడమే కాక మానవవ్యక్తి తనను తాను గుర్తించగలదు. ఇది మనిషి ప్రత్యేకత. ఆలోచనాశక్తి, భావనాబలం, జ్ఞాపకశక్తి, కల్పనాధోరణి, భావాలను ఇతడులకు అందజేయటానికి పదజాలం, భాషాపటుత్వం, సహకారభావం, సానుభూతి, ప్రేమానురాగాలు ఇవన్నీ మనిషియొక్క విలక్షణ లక్షణాలు; స్వభావాలు.

మానవ వ్యక్తి సహజంగా నైతిక జీవి. కాగా నైతికతకు ధ్యేయం లక్ష్యం ఏమిటి అనేది మీమాంస. విద్యుక్తధర్మ నిర్వహణ అని నైతికశాస్త్ర కోవిదులలో ఒక తెగవారంటే, మరొక తెగవారు మానవుని జీవితార్థమూ, పరమార్థమూ ఆనందప్రాప్తియని అంటారు. ప్రకృతికి అనుగుణంగా జీవితం కొనసాగించడమే లక్ష్యంగా ఉండాలని ఒక 'గ్రూపు' వారు వాదిస్తుంటే మరొక 'గ్రూపు'వారు 'వ్యక్తివికాసమే' లేక "ఆత్మసాక్షాత్కారమే" ధ్యేయమని ప్రతివాదన చేస్తారు. ఇందులో వ్యక్తివికాసాన్ని సమర్థించి వాదన యుక్తియుక్తంగా కన్పడుతున్నది. కాగా "ఆత్మసాక్షాత్కారం" అనే పదజాలంలో "ఆత్మ" అనేదానికి పారమార్థిక లేక అలౌకిక భావన లేదు. వ్యక్తిత్వంయొక్క సమగ్ర స్వరూపానికే "ఆత్మ" అని అక్కడ వాడడం జరిగింది.

ప్రతి మానవ వ్యక్తిలో అనేక శక్తియుక్తులు అంతర్గర్భితంగా ఉంటున్నాయి. వాటి వికసనమే మానవ పరిణామ లక్ష్యం. ఇక్కడ ఒక్క అంశాన్ని మరచిపోరాదు. ఏ శక్తి వికసించాలన్నా దాని ప్రకటనకు

అంటే బహిర్గతం కావడానికి అవకాశాలు కావాలి. మానవ వ్యక్తి క్రియా శీలి. కేవలం బుద్ధిజీవి మాత్రమే కాదు. బుద్ధియొక్క వినియోగం కార్య శీలతకు దారితీస్తుంది. ఇలా మానవ వ్యక్తి సోమరిపోతుగా ఉండజాలడు. అదీగాక మానవ వ్యక్తి సామాజిక జీవి. ఒంటరిగా మానవ వ్యక్తి జీవి తాన్ని సాగించటం అనూహ్యం. మానవ వ్యక్తిలో సంఘ స్వరూపం ఉంటున్నది. అలాగే సమాజంలో వ్యక్తుల స్వభావాలు, లక్షణాలు, గుణాలు ప్రతిఫలిస్తాయి. సమాజం వినా మనిషిలేడు. మనిషి వినా సమాజం లేదు. ఈ రెంటి అవినాభావ సంబంధాన్ని గుర్తిస్తే మానవ జీవిత సమస్యలకు పరిష్కారమార్గం సగం సుగమవుతుంది.

సమాజం మనుగడ సాగించాలంటే, వ్యక్తులు మనగల్గాలంటే వారికి అహారం, గాలి, వెలుతురు, నిద్ర, విశ్రాంతి, ఆరోగ్యం, విద్య ముఖ్యంగా అవసరం. వీటిని సంపాదించుకోవటానికి మానవులు కృషి చేయాలి. మానవ జాతి అలాంటి శ్రమను చేసింది; చేస్తూ ఉంది. వేట, పశుపాలన, వ్యవసాయం, వస్తూత్పత్తి మొదలైనవి అలాంటి ప్రయత్నాలు వీటిని సమాజం సాగించాలి. అందుకే మానవులు శ్రమించవలసి వస్తున్నది.

శ్రమకూ పనికీ తేడా ఉంటున్నది. శ్రమ మౌలిక భావన. ఫలి తాన్ని ఆశించి చేసే శ్రమను పని అనవచ్చు. కాగా జీవనోపాధి నిమిత్తం మానవ వ్యక్తి ఉద్యోగాన్ని చేయవచ్చు. ఇతర వ్యక్తులవద్ద ఉద్యోగం చేయవచ్చును లేక తనకు తానే ఉద్యోగాన్ని కల్పించుకొని ఆ పని ఫలి తంగా వచ్చే వరుమానంతో, ఆర్జనతో జీవితాన్ని కొనసాగించవచ్చు. రెండవదానిని చేపట్టినవారిని స్వయం ఉపాధిని అవలంబించేవారని పిలుస్తాం.

ఇక ప్రతి మానవ వ్యక్తీ స్వయం వికాసానికి శ్రమించవలసి వున్నపుడు, జీవితం సాగించడానికి ఉద్యోగాన్ని ఆశ్రయించవలసి వచ్చి నపుడు పని మానవాళియొక్క ఆవశ్యక అంశాలలో ఒకటవుతుంది. అందు వలననే పనిచేయడానికి ప్రతి మానవునికీ హక్కున్నదని ఐక్యరాజ్యసమితి రూపొందించిన మానవ హక్కుల ప్రణాళికలో ఉటంకించబడింది. అంతేగాక

ప్రతి మనిషికి మనిషిగా బ్రతకడానికి అవసరమైన తగుమాత్రపు వేతనం లేక తవింలేక ఆర్జన ఉండాలనికూడ మానవ హక్కుల ప్రణాళిక ఉద్ఘాటించింది. ఈ భావాలను ప్రపంచంలోని మేధావులు పెక్కుమంది అంగీకరించారు; వెలిబుస్తున్నారు. వాటికి ఆచరణలో అస్తిత్వం రావడానికి కృషిచేస్తున్నారు.

ప్రతి మనిషీ తనకోసం, సమాజంకోసం శ్రమించటానికి, తత్ఫలితతంలో తనకు అవసరమైన వాటా పొందటానికి (ఇతరుల హక్కులకు భంగకరం కానివిధంగా) హక్కు కలిగి ఉన్నట్లు స్పష్టీకరించబడింది. కాగా మానవ సమాజంలో స్త్రీ పురుష లిద్దరూ ఉన్నారు. స్త్రీలు సమాజంలో ఇంచుమించుగా సగంమందిదాకా ఉన్నారు. కనుక స్త్రీలను సామాజిక శ్రమలో భాగస్వామ్యం వహించకుండా నివారించడం మానవ సామాజిక నిర్మాణ సూత్రాలకు భిన్నమేకాక సమాజానికి నష్టదాయకం కూడా. నిజానికి స్త్రీలు శ్రమించకతప్పటం లేదు. పురుషులతోపాటు వారూ పనిచేస్తున్నారు. సమాజం అనేక దశలలో ఉన్నపుడు, అంటే వేటాడి ఆహారాన్ని సంపాదించుకున్నప్పుడు, అరణ్యాలలో కందమూలాదులను ఫల ధాన్యాలను సేకరించుకున్నప్పుడు, వ్యవసాయంచేసి ఆహారం సముపార్జన చేసినపుడు స్త్రీలు శ్రమ చేశారు. ఈనాడు యంత్రాలద్వారా వస్తూత్పత్తి సాగిస్తున్నపుడుకూడా వారు తమవంతు శ్రమను సమాజానికి ధారపోస్తూనే యున్నారు. కాగా ఇంకా అదనంగా వారు సమాజానికి ఎనలేని సేవచేస్తున్నారు. సంతానాన్ని కని, పెంచి మానవజాతి నశించకుండా పరిపుష్టంగా సంపూర్ణంగా మనకలగడానికి ఇతోధికంగా పాటుపడుతున్నారు. ఈ అదనపు బాధ్యతవల్ల కొన్ని సందర్భాలలో, కొన్ని సమయాలలో స్త్రీలు శ్రమకు కొంతగా కొంత దూరంగా ఉండవలసిన అవసరం కలిగింది. దీనిని సాకుగా తీసుకొని, దీనిని అవకాశంగా మార్చుకొని స్త్రీని వస్తువుగా, బానిసగా, ద్వితీయశ్రేణి వ్యక్తిగా మార్చాడు పురుషుడు. ఆమెను ఉత్పత్తి క్రమానికి, రంగానికి కొంతవరకు దూరంగా ఉంచాడు. అంటే ఆమె శ్రమవల్ల ఉత్పన్నమయ్యే ఫలితాన్ని ఆమెకు చెందకుండా ఆ శ్రమ ఫలితంపై ఆమెకు

అదుపు, అజమాయిషీ, యాజమాన్యం లేకుండా జాగ్రత్తపడ్డాడు. ఆమె సంపాదనను తన సంపాదనగా మార్చుకున్నాడు. విధిలేక ఆమె సంపాదనపై ఆమెకు హక్కు నిచ్చినా ఆ సంపాదన చాల తక్కువ స్థాయిలో ఉండేలా చూచాడు. సంతానం విషయంలో ఆమె చేస్తున్న సామాజిక సేవను తనకు అనుకూలంగా భాష్యం చెప్పుకొని సంతానాన్ని పెంచి పోషించే పనిని ఆమెకు కేటాయించాడు. దాంతోబాటు గృహ నిర్వహణ బాధ్యతను ఆమెకు కేటాయించాడు. "గృహలక్ష్మి" యని ఆమెను అభివర్ణించి, ఆమెను పొగిడినట్లు మాటలుచెప్పి ఆమె చేసే ఇంటి పనికి విలువలేకుండా చేశాడు. "కుటుంబ పోషణ కర్త" అనే బిరుదును తనకుతానే తగిలించుకున్నాడు. తను ఇంటి వెలుపల చేసే పనికి విలువ కట్టుకొని, తన హోదాను చూచుకొని తానే మురిసిపోయాడు. ఫలితం స్త్రీల అణచివేత; వారు పురుషులకు లొంగివుండాలనే భావం వారి నర నరాన జీర్ణించటానికి విశేష కృషిచేసింది పురుషజాతి. "లొంగివుండడమే" మంచి స్త్రీల లక్షణమని స్త్రీలు నమ్మేలా చేయడం జరిగింది. స్త్రీలు అలా విశ్వసింపసాగారు. ఇలా తాము మోసపోయి లొంగిపోయింది స్త్రీ జాతి.

సమాజంలో సామాజిక ఆర్థిక మార్పులు వస్తాయి. నూతన భావ వీచికలు వీస్తాయి. ఈ రెంటికీ అవినాభావ సంబంధం ఉంటున్నది. ఒకదానిని మరొకటి ప్రభావితం చేస్తున్నాయి. కనుక భూస్వామ్య సమాజపు విలువలు పారిశ్రామిక సమాజంలో మనజాలవు. అలాగే వ్యక్తి గత వ్యాపారం లక్షణంగా కల పెట్టుబడిదారీ సమాజపు విలువలు సమిష్టి ఆర్థిక లక్షణం కాగల సోషలిస్టు సమాజంలో ఉండరాదు. కాని వచ్చిన చిక్కేమిటంటే సామాజిక ఆర్థిక రంగాలలో వచ్చినంత వేగంగా మార్పు సాంస్కృతిక రంగంలో రావటంలేదు. భావాలు వెనుకబడి ఉంటున్నాయి. అందువల్లె పెట్టుబడిదారీ సమాజపు విలువలు సోషలిస్టు సమాజంలో కూడ కన్పడుతున్నాయి. పురుష దురంహకార భావాలు సోషలిస్టు, కమ్యూని నిస్టు సమాజాలలో కూడ పూర్తిగా నశింపు కాలేదు. అలా పితృస్వామ్య వ్యవస్థ లక్షణాలు ఆర్థికంగా పురోగతి చెందిన దేశాలలోకూడ కన్పడు తున్నాయి.

వర్గ పోరాటమే అభ్యుదయ మార్గంగా భావించే మార్క్సు భావ పరంపరలో స్త్రీ పురుష వివక్ష సమస్యకు పరిష్కారం దొరకటం లేదు. కేవలం ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీలకు లభించినంత మాత్రాన సమస్యకు పరిష్కారం లభ్యం కావటం లేదు. అంటే స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం అక్కరలేదనే అపోహలో ఎవరూ ఉండవలసిన అవసరం లేదు. ఆర్థిక స్వాతంత్ర్యంతోపాటు మనిషిగా తన హుందాను ప్రతిపత్తిని నిర్ధారించుకునే ప్రయత్నాన్ని స్త్రీ లోకం చేపట్టవలసియున్నది. ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీకి తొలిమెట్టు. ఈ విషయాన్ని ఎంత స్పష్టంగా, ఎంత గాఢంగా గ్రహిస్తే అంత స్త్రీ లోకానికి—ఆ మాటకువస్తే—సమాజానికీ అంత మంచిది.

ఈ భావాలను మనం స్థూలంగా దర్శనం చేసుకున్న తర్వాత, పని యొక్క విలువను స్త్రీల పరంగా సమాజపరంగా గుర్తించిన తదుపరి స్త్రీలకు సమాజంలో గల ఉద్యోగావకాశాలు, ఆమె శ్రమకు అసలు విలువ ఇస్తున్నారా లేదా అనే అంశం, ఇచ్చినా తగిన విలువ ఇస్తున్నారా అనే ప్రశ్న, స్త్రీలను ఏయే పనులలో కృషి చేయనిస్తున్నారనే విషయం, వేతనాలు, జీతాలు కూలీరేట్లు వీటి విషయంగా స్త్రీలపట్ల వివక్ష ఉన్నదా? ఉంటే, ఏమేరకు వుంటోంది? అనేమీమాంస ఇవన్నీ మహిళాభ్యుదయాన్ని కాంక్షించే స్త్రీ పురుషులకు అధ్యయన విషయాలు అవుతున్నాయి. ఆ కారణంగానే వివిధ మహిళాసంస్థలు, స్త్రీ విమోచన ఉద్యమ సంఘాలు, మహిళాసమస్యల పరిశోధనా సంస్థలు వీటిపై దృష్టి సారించాయి. సెమినార్ల ద్వారా అభిప్రాయ వేదికల మూలంగా, చర్చావేదికలు, ఉపన్యాసాలు నిర్వహించి ఈ సమస్యలను ముఖ్యంగా స్త్రీల దృష్టికి, సమాజం దృష్టికి తేవడానికి కృషి సాగుతోంది. ఈ సందర్భంగా మహిళా దశాబ్దంలో జరిగిన కార్యక్రమాలు, కృషి, సాహిత్యం కొంత అవగాహనకు తోడ్పడ్డాయి. ఈ విషయాలను, భావాలను ప్రజల దృష్టికి తెచ్చే నిమిత్తం మహిళాభ్యుదయ సంస్థ ఈ గ్రంథాన్ని వెలువరిస్తోంది. దీనికి మహిళా వికాసం-శ్రమ-ఉద్యోగం అని నామకరణంచేయడం జరిగింది.

ఈ వ్యాసాల ప్రచురణలో ఒక క్రమం వున్నది. స్త్రీ ఇంట్లో చేసే

పనికి విలువ లేకుండా పోయిందని నేను వ్యథ వెలిబుచ్చాను. స్త్రీని "ఇల్లాలు"గా పేర్కొంటున్నా ఇల్లు ఆమెది కాకుండా పోయిందనే బాధ కలిగింది. ఇల్లు ఆలుమగ లిద్దరిదీ అయినప్పుడే, ఇంటిపనిని వారిరువురూ అరమరలేకుండా సమాన బాధ్యత వహించి సమానంగా భారం వహించవలసి యుంటుందని నేను పరిష్కారమార్గం సూచించాను. వాసిరెడ్డి సీతాదేవిగారు ఉద్యోగాలలో స్త్రీలపట్ల జరుగుతున్న వివక్షను నిశితంగా నిరసించారు. స్త్రీలకు తక్కువ వేతనాలు ముట్టున్నాయని విశ్లేషణాత్మకంగా రుజువుచేశారు. ఎం. వనమాల స్త్రీలు ఉద్యోగం చేయ డానికీ వారు సంతానాన్ని తక్కువగా కనడానికి ఉన్న సంబంధాన్ని వివ రించారు మమతా లక్ష్మన్న. స్వయం ఉపాధి రంగంలోని స్త్రీల సమస్య లను చర్చించారు ఎం.వి. రామమూర్తి. స్త్రీలు ఉన్నత వృత్తులను ఎందుకు చేపట్టలేకపోతున్నారనే అంశాన్ని విడమరిచి శక్తివంతంగా వెలికి తీశారు ఎం.ఎల్. శారద. అసంఘటిత రంగంలో స్త్రీల సమస్యలను, ఇబ్బం దులను గురించి వ్రాశారు ఎ.కె. రాజులాదేవి. మధ్యతరగతి స్త్రీలు ఉద్యోగంపట్ల కలిగి ఉంటున్న వైఖరిని విశదీకరించారు మల్లాది సుబ్బమ్మ. పని స్థలంలో అమలులో ఉంటున్న వివక్షను ఉటంకించి దాని నివారణకు జరిగిన కొన్ని ప్రయత్నాలను, కోర్టు కేసులను తెలియ జెప్పారు విమల్ బాలసుబ్రహ్మణ్యన్. సమాజంలోని అధికారానికి, మహి ళోద్యమానికి కల సంబంధాన్ని పరిశీలించారు ఆచార్య శిశిర్ భట్టా భార్య. సిద్ధాంత చర్చను చేశారు. పితృస్వామ్య భావపరిధినుండి బయటపడాలని ఉద్బోధించారు. ఆర్థిక దోపిడీలేని సమాజంలోకూడ లైంగిక వివక్షతో కూడిన దోపిడీ కొనసాగే ప్రమాదం ఉందని హెచ్చరించారు.

మానవ వ్యక్తి శ్రమించటం సహజం. అయితే కేవలం తన ఆనందంకోసం శ్రమించటం ఒక రకం. అలాకాక పొట్ట నింపుకోవడంకోసం కావలసిన ధనంకోసం శ్రమించటం మరోరకం. మొదటిది సృజనాత్మక కృషి. అయితే ఈ కృషివల్లకూడా ఒకానొక సందర్భంలో సంపాదనకు అవకాశం ఉంది. అంతమాత్రాన ఆ శ్రమయొక్క సృజనాత్మక స్వభావం నమసిపోదు. అలా సృజనాత్మక కృషిచేసేవారు కళాకారులు, సాహితీ

వేత్తలు మొదలగువారు, వారి సమస్యలను గురించి స్పృశిస్తూ సృజ నాత్మక కృషిచేసే స్త్రీల ఆశయాలనూ ఇబ్బందులనూ వివరించారు ఎం.వి. రామమూర్తి. సృజనాత్మకత కళారూపాన్ని సంతరించు కుంటుంది. కళా స్వరూపాన్ని నిర్దేశించి దానిని దర్శనం చేయించారు డా॥ సంజీవదేవ్. సాహిత్యం ఒక కళారూపం. సాహిత్యంలో పనిని గురించి ఎలాంటి భావన ఉన్నదో సోదాహరణంగా, విశ్లేషణాత్మకంగా ఎరుకపరిచారు కాత్యాయిని విద్మహే. సాహిత్యంలో స్త్రీల ఆశయాలకు ప్రతిబింబంగా ఉండే స్త్రీ పాత్రలకు ఎలా వాస్తవచిత్రణ జరిగిందో సుజాత విమర్శనాయుతంగా చదువరుల దృష్టికి తెచ్చారు.

ఇలా శ్రమ, ఉద్యోగం, స్థితిగతుల పరిశీలన, వివక్ష, దానిని తొల గించడానికి అవసరమైన సిద్ధాంతం, సృజనాత్మకత, కళ, సాహిత్యం స్త్రీలపరంగా ఈ గ్రంథంలో పరిశీలింపబడ్డాయి. ఇది కొంతగా కొంత ఉప యోగకరమని చదువరులు భావిస్తే ప్రచురణకర్తల కృషి ఫలించినట్లే.

ఈ వ్యాసాలను గ్రంథస్థం చేయటానికి అనుమతి ఇచ్చి మహిళోద్య మానికి ప్రోత్సాహం ఇచ్చిన వ్యాసకర్తలకు నా ధన్యవాదాలు; నా కృతజ్ఞతలు.

–మల్లాది సుబ్బమ్మ
సంకలనకర్త

---

ద్వితీయ శ్రేణి మధ్య తరగతి కుటుంబాలలోను శ్రామిక కుటుంబాల లోను గృహిణి ఇంట్లో అనేక విధులను నిర్వర్తిస్తున్నది. ఇంట్లో ఆమె యే వంటగత్తె, పనికత్తె, చాకలి, దాసి, ఇంకా ఇతర గృహకృత్యాలను కూడా ఆమే చేస్తుంది. అంటే నలుగురు, ఐదుగురు చేసేపనిని ఆమె ఒక్కతే చేస్తుంది. కాని విచిత్రమైన విషయమేమంటే ఇంతపని ఆమె చేసినా, ఇందరి పని ఆమె ఒక్కతే చేసినా ఆమె చేసిన పనికి ఆమెకు పారితోషికం రాదు. వేతనం అసలే వుండదు. అభినందనలకూ, పొగడ్త లకు ఆమె నోచుకోదు. పైగా ఈసడింపులు, ఛీత్కారాలు మాత్రమె ఆమెకు దక్కుతాయి. ఆమె శ్రమకు పరిహారం లేదు. అత్తమామల దృష్టిలో, భర్త దృష్టిలో ఆమె పనికి విలువ శూన్యం. కాకపోతే ప్రాణా లతో జీవితం కొనసాగించటానికి మాత్రం కావల్సిన ఆహారాన్ని, వస్త్రా లను, ఆశ్రయాన్ని మాత్రం కల్పిస్తాడు గృహ యజమాని. ఆమె స్వీక రించే ఆహారం, ఆ మాటకొస్తే, ఆమెను తిననిచ్చే తిండి పోషక గుణరీత్యా అత్యల్పమని శాస్త్రకారులు ఘోషిస్తున్నారు. అందువల్లనే బాలింత మరణాలు, శిశు మరణాలు అధికంగా వుంటున్నాయి. ఇంత ఘోరం జరుగుతున్నా గృహిణుల చేత ఇంటిపని ఉచితంగా చేయించుకోవటం తమ జన్మహక్కుగా భావిస్తోంది పురుష జాతి. ఈ పరిస్థితి తగదని స్త్రీలు పేచీ పెడితే అదేదో మహా పాపకార్యమని, నికృష్ట చర్య అని భావిస్తున్నారు పురుషపుంగవులు. పదేళ్ళనాడు ఇంటిపనికి వేతనాలు కావాలని నినాదా లిస్తూ వీధుల వెంట లండను మహానగర స్త్రీలు ప్రదర్శన చేస్తే ప్రపంచ మంతా ఘోషించింది. వారిచ్చిన నినాదం, వారి పొలికేక సమంజస మైనా, కాకపోయినా సమస్యను ప్రజల దృష్టికి తెచ్చిన గౌరవం వారికి దక్కింది.

కుటుంబానికి స్త్రీ చేస్తున్న శ్రమకు కాలనిర్ణయం లేనేలేదు. ఎప్పుడు అవసరమైతే అప్పుడల్లా చేయాలి. ఎన్ని గంటలైనా ఆమె పనిచేస్తూనే వుండాలి. ఆమె అలసటతో ఇతర్లకు ప్రమేయం లేదు. నిస్సత్తువగా వున్నా, వ్యాధి గ్రస్తురాలైనా, వృద్ధురాలైనా, మానసికంగా అస్వస్థు రాలైనా ఆమె పనిని ఆమె ఆపటానికి వీలులేదు. ఆమెను పంజాయిషీ

ద్వితీయ శ్రేణి మధ్య తరగతి కుటుంబాలలోను శ్రామిక కుటుంబాల లోను గృహిణి ఇంట్లో అనేక విధులను నిర్వర్తిస్తున్నది. ఇంట్లో ఆమె యే వంటగత్తె, పనికత్తె, చాకలి, దాసి, ఇంకా ఇతర గృహకృత్యాలను కూడా ఆమే చేస్తుంది. అంటే నలుగురు, ఐదుగురు చేసేపనిని ఆమె ఒక్కతే చేస్తుంది. కాని విచిత్రమైన విషయమేమంటే ఇంతపని ఆమె చేసినా, ఇందరి పని ఆమె ఒక్కతే చేసినా ఆమె చేసిన పనికి ఆమెకు పారితోషికం రాదు. వేతనం అసలే వుండదు. అభినందనలకూ, పొగడ్త లకు ఆమె నోచుకోదు. పైగా ఈసడింపులు, ఛీత్కారాలు మాత్రమే ఆమెకు దక్కుతాయి. ఆమె శ్రమకు పరిహారం లేదు. అత్తమామల దృష్టిలో, భర్త దృష్టిలో ఆమె పనికి విలువ శూన్యం. కాకపోతే ప్రాణా లతో జీవితం కొనసాగించటానికి మాత్రం కావల్సిన ఆహారాన్ని, వస్త్రా లను, ఆశ్రయాన్ని మాత్రం కల్పిస్తాడు గృహ యజమాని. ఆమె స్వీక రించే ఆహారం, ఆ మాటకొస్తే, ఆమెను తిననిచ్చే తిండి పోషక గుణరీత్యా అత్యల్పమని శాస్త్రకారులు ఘోషిస్తున్నారు. అందువల్లనే బాలింత మరణాలు, శిశు మరణాలు అధికంగా వుంటున్నాయి. ఇంత ఘోరం జరుగుతున్నా గృహిణుల చేత ఇంటిపని ఉచితంగా చేయించుకోవటం తమ జన్మహక్కుగా భావిస్తోంది పురుష జాతి. ఈ పరిస్థితి తగదని స్త్రీలు పేచీ పెడితే అదేదో మహా పాపకార్యమని, నికృష్ట చర్య అని భావిస్తున్నారు పురుషపుంగవులు. పదేళ్ళనాడు ఇంటిపనికి వేతనాలు కావాలని నినాదా లిస్తూ వీధుల వెంట లండను మహానగర స్త్రీలు ప్రదర్శన చేస్తే ప్రపంచ మంతా ఘోషించింది. వారిచ్చిన నినాదం, వారి కోరిక సమంజస మైనా, కాకపోయినా సమస్యను ప్రజల దృష్టికి తెచ్చిన గౌరవం వారికి దక్కింది.

కుటుంబానికి స్త్రీ చేస్తున్న శ్రమకు కాలనిర్ణయం లేనేలేదు. ఎప్పుడు అవసరమైతే అప్పుడల్లా చేయాలి. ఎన్ని గంటలైనా ఆమె పనిచేస్తూనే వుండాలి. ఆమె అలసటతో ఇతర్లకు ప్రమేయం లేదు. నిస్సత్తువగా వున్నా, వ్యాధి గ్రస్తురాలైనా, వృద్ధురాలైనా, మానసికంగా అస్వస్థు రాలైనా ఆమె పనిని ఆమె ఆపటానికి వీలులేదు. ఆమెను పంజాయిషీ

అడిగే హక్కు అందరికీ వుంది. అంటే అత్తమామలకు, భర్తకూ, బిడ్డలకు కూడా ఆమె సంజాయిషీ చెప్పుకోవాలి. ఆమె తిన్నదో లేదో ఎవ్వరూ పట్టించుకోరు. ఎవరికి కావాల్సిన సదుపాయాలను వారికి వేళకు ఆమె సమకూర్చాల్సిందే. ఇందులో వీసమెత్తు వ్యత్యాసం వచ్చినా వారు ఆమెను మన్నించరు. శూలాల్లాంటి మాటలతో ఆమె మనస్సును గాయపరుస్తారు. ఆమె ఏనాడు మెప్పును ఆశించరాదు. ఆమె ఎంతో శ్రమపడి రుచిగా వంటకాలు తయారుచేసినా, ఇంట్లో సామాను అమర్చినా, ఇల్లు కళకళలాడేటట్లు చేసినా ఆమె నెవ్వరూ అభినందించరు. వారి దృష్టిలో "అదంతా ఆమె విధి, బాధ్యత కూడాను" విధి నిర్వహణ చేస్తే మెప్పు వుండదు; చేయకపోతే తప్పు. పైగా దండనకూడాను. ఆమెకు ఏ పరిస్థితుల్లోను సెలవు అనే మాట లేదు. వయస్సు మళ్ళినా, అనారోగ్యంతో అలమటిస్తున్నా అశాంతితో ఆందోళనతో మునిగివున్నా విశ్రాంతి ఇమ్మని ఆమె కోరరాదు; ఆమె అడిగినా ఇచ్చేవారు లేరు. ఇదే పనిని ఆమె ఇతర కుటుంబాలలో (వంట వగైరా) జీతానికి చేస్తే ఆమెకు చాలా సౌకర్యాలు వుంటాయి. కార్యాలయాల్లో పనిచేస్తే సెలవలు, జీతంమీది సెలవలూ, ఇంక్రిమెంట్లు, పింఛను లభిస్తాయి. అవీగాక వేతనం చాలా పెద్ద ఎత్తున ముడుతుంది. వీటికి నోచుకోక కండలు కరిగించుకుంటూ, కన్నీరు కారుస్తూ నోరు మెదపకుండా, లేని సంతోషాన్ని ముఖంమీద తాండవింపజేస్తూ ఆ యిల్లాలు బండెడు ఇంటి చాకిరీ ఒక్కతే చేస్తూ అందరికీ అన్నీ అమరుస్తూ కాలం దొర్లించుకుంటుంది. ఈ శోచనీయ పరిస్థితి నుండి ఆమె బైటపడటానికి తనకు పరిష్కారమార్గం లేదా అని ఆక్రోశిస్తున్నది ఆ మహాతల్లి.

ఇల్లాలు చేసే పనిని చేయడానికి స్వల్పకాలం మాత్రమే పనిచేసే మనుష్యులను అంటే వంట మనిషిని, పని మనిషిని, చాకలిని, బజారు పనులకు మరో మనిషిని నియమిస్తే వారికి ఇవ్వవలసిన వేతనాల విలువను ఆమె శ్రమ విలువగా పరిగణించవచ్చును. కాని ఆ విలువలో వీసమెత్తు కూడా-తిండీతిప్పలుకాక-ఆమెకు చేరటం లేదు. గతిలేక, విధిలేక, ప్రతిమాలితే పదోపరకో ఆమె ముఖాన విసరివేస్తాడు ఆ గృహ యజమాని

అయిన ఆ భర్త మహాశయుడు. ఈ విషయాన్ని అలావుంచి భర్త పరంగా ఆలోచించినా అతడు ఆమె శ్రమకు తగిన మూల్యాన్ని చెల్లించ లేడు; అతని సంపాదన దానికి చాలదు. ఇది ఒక విచిత్ర పరిస్థితి; ఇదొక దుర్భరమైన అవమానకరమైన పరిస్థితి. ఈ భయంకర పరిస్థితికి పరిష్కార మార్గం ఏది? ఇదీ ప్రస్తుత చర్చనీయాంశం.

ఇతర దేశాల కుటుంబ జీవితంలో స్త్రీ ఎలాంటిపాత్ర వహిస్తున్నదో, ఎలాంటి పరిస్థితుల్లో ఆమె శ్రమిస్తున్నదో తెలిసికోవడం కొంత ఉప యుక్తం అవుతుంది. స్త్రీ పురుషు లిద్దరూ ఇంటి వెలుపల కార్యాలయాల్లో, ఫ్యాక్టరీలలో, ఇతర వ్యాపార, పరిశ్రమల్లో సర్వసాధారణంగా ఉద్యోగాలు చేస్తూ వుంటారు. ఇంచుమించుగా ఇద్దరికీ సమాన వేతనం లభిస్తుంది. అభివృద్ధి చెందిన అమెరికా లాంటి పెట్టుబడిదారి దేశాలలో సామాజిక స్వేచ్ఛ చాలావరకు స్త్రీకి ఒనకూడింది. రాజకీయ, ఆర్థిక రంగాలలో ఆమె ఎంతో వెనుకబడివున్నా సామాజిక రంగంలో ఆమె పురోగమనం గణనీయం. తత్ఫలితంగా ఇంటి పనిని భార్యాభర్త లిద్దరూ చేసు కోవడం, సంతానంకూడా సాయం చేయడమూ జరుగుతూ వున్నది. అందువలన బండెడు చాకిరీతో ఇల్లాలు కృంగిపోయే స్థితిరాదు. శారీర కంగా, మానసికంగా ఆమె ఆరోగ్యంగా వుంటుంది. ఇవి దరహంమీద చెప్పే మాటలు. ప్రతి అమెరికన్ కుటుంబంలోనూ శ్రమ విషయంగా భాగస్వామ్యం, సఖ్యతా, సామరస్యాలు, సుఖశాంతులు వెల్లివిరుస్తాయని చెప్పడంలేదు. అధిక సంఖ్యాకులనుబట్టి సమాజ పురోగమనాన్ని అంచనా వేస్తాం. మరో అగ్రరాజ్యమైన సోవియట్ రష్యాలో ఇటీవల విడాకుల రేటు విపరీతంగా పెరిగిపోతోంది. గ్రామాలలో 30% నగరాలలో 40 శాతానికి చేరుకున్నది. ఈ ఆందోళనకరమైన పరిస్థితిని గమనించి కల వరపడి దర్యాప్తు సాగించారు. రష్యన్ పురుషులు, హెచ్చు సంఖ్యలో ఇంటి పనిలో ఇల్లాలికి ఏ మాత్రం సాయపడడం లేదు. తమ క్లబ్బులకో, వినోద ప్రదర్శనలకో, సాహిత్య సభలకో వెళ్ళిపోవడం తరచుగా సంభ విస్తోంది. దాంతో ఒంటరిగా గృహిణి ఇంటి పనిని రెక్కలు ముక్కలు చేసుకుంటూ చేయాల్సి రావడమేకాక ఆమె సాహిత్యానికి, వినోదానికి

దూరమౌతోంది. అందువల్ల ఆమె మానసికవికాసాభివృద్ధి కుంటుపడుతోంది. మన దేశంలో లాగానే భార్యాభర్తల మేధోస్థాయిపరంగా, సాంస్కృతిక పరంగా అత్యధికమైన వ్యత్యాసం ఉద్భవిల్లుతోంది. అంతేకాక సమానమైన పనిని ఇంటి వెలుపల చేస్తూ, సమానమైన వేతనాన్ని ఆర్జిస్తూ తక్కువస్థాయి వ్యక్తిగా పరిగణింపబడడాన్ని రష్యన్ స్త్రీ సహించలేకుండా వుంది. అందువల్లనే గృహ కలహాలు, కుటుంబాల విచ్ఛిత్తి అవిచ్ఛిన్నంగా సాగిపోతున్నాయి. ఇది దేశదేశాల పరిస్థితి. స్త్రీల శ్రమకు దోపిడీ జరుగుతున్నా ఆమె పనికి విలువే లేదు అనేది పచ్చి నిజం.

ఇంటిపనికి విలువ కట్టమని ఇల్లాలు పరిహాసానికి అడిగినా, కోపంగా కోరినా, ఉలిక్కిపడుతుంది పురుషాధిక్యతా సమాజం. తన అధికారానికి ముప్పు వచ్చిందని వణికిపోతుంది. వెంటనే ఆప్యాయత కురిపిస్తూ అనునయ వాక్యాలు వల్లెవేస్తుంది. "ఇది నీ ఇల్లు, ఇది నీ కుటుంబం నీ భర్తా, నీ పిల్లలూ. కుటుంబంలో పనిని భార్యాభర్తలిద్దరూ చేసుకోవాలి; అతడు బైటపని (ఉద్యోగం) చేసి సంపాదిస్తున్నాడు. నీవూ కుటుంబం కోసం బైటపనిచేసి సంపాదిస్తున్నావనుకో; కాదనం. కాకపోతే, ఇంటిపనిలో నేర్పు, చేయగల ఓర్పు, ఓపిక నీకు మాత్రమే వున్నాయి కనుక నీవు చేస్తున్నావు. అది నీవు సంతోషంగా త్యాగబుద్ధితో చేసేపని; చేయాల్సిన పని. కనుక నీవు దానికి మూల్యంలేదా అని ప్రశ్నించడం న్యాయం కాదు" అని భర్తలు, తండ్రులు, మామలూ, అన్నదమ్ములూ, బిడ్డలూ - అంటే యావత్ పురుష ప్రపంచమూ ఆమెను దోషిగా నిలబెట్టి ప్రశ్నిస్తుంది. అప్పటికే బండచాకిరీలో బ్రతుకు భారం భరించలేక సతమత మవుతున్న ఇల్లాలు వెల్లుబికిన దుఃఖానికి, క్రోధావేశానికి లోనవుతుంది. ఆమెకు ధైర్యం వస్తుంది. "నా సంతానానికి రక్షకులు మీరు, సంరక్షకులు మీరు, కుటుంబ యజమాని మీరు, మనిద్దరి సంపాదనమీద పెత్తనంమీది, ఆస్తిపాస్తుల సంపాదన విషయంతో తుది నిర్ణయం మీది. నేనెంత సంపాదించినా చివరకు కొద్దిపాటి ఖర్చులకుకూడా నేను మిమ్మల్ని బిచ్చం కోరాల్సిన పరిస్థితి నాది. కుటుంబంలో సహకారం ఎక్కడ వున్నది ?" అని ఇల్లాలు ధీమాగా ఈనాడు ప్రశ్నిస్తోంది. పురుషుడు

ఆమె వాదనా బలాన్ని కాదనలేక, ఆ నిజాన్ని అంగీకరించలేక తడబడుతున్నాడు. తన పెత్తందారీతనం బీటలు వారుతుందని వణికిపోతున్నాడు. నిజానికి స్త్రీ పురుషుల మధ్య సమానత్వంలేనినాడు సహకారం అనే మాటకు అర్థమే లేకుండా పోతుంది. అప్పుడు మిగిలేది యజమాని - దాసి సంబంధం మాత్రమే. నేటి శాసనాలు ఇంకా సమాజంలోని పురుషాధిక్యానికి ప్రతీకలు. పురుషాధిక్యతను నిలబెడుతున్నాయి. స్త్రీ పురుషులమధ్య సమానత్వాన్ని ప్రతిపాదించే పద్ధతిలో శాసనాలను సంస్కరిస్తే తప్ప కుటుంబంలో సహకార భావన ఏర్పడదు. పైకి కనపడే సహకార భావన ఐచ్ఛికం కాదు. పరిస్థితుల ప్రాబల్యానికి లొంగిపోయి స్త్రీలు ప్రదర్శిస్తున్న వైఖరి మాత్రమే అది. కనుక స్త్రీ పురుషుల సమానత్వం సిద్ధించిన నాడు బహుశ స్త్రీ తన శ్రమకు విలువకట్టమని కోరదు. ఆనాడు కుటుంబం వాస్తవంగా ఆమె దవుతుంది. ఇంటిపనిలో పురుషులు పాలుపంచుకుంటారు. ఆమె చెసే పనిని హీనంగా చూడరు. ఎందుకంటే, వారూ చేస్తున్నారుకదా! వారు చేసేపనిని వారు ఎలా నీచంగా చూస్తారు? దాంతో ఇల్లాలికి శారీరక కష్టం, మానసిక వ్యధ తొలగుతాయి. ఇది సమస్యకు ఒక పరిష్కార మార్గం.

మరొక మార్గం లేకపోలేదు. అయితే, అది ఎంతవరకు సమంజసం, ఎంతవరకు న్యాయం అనేది విచారణీయాంశం. అంతేగాక ఏమేరకు అది ఆచరణ యోగ్యమనేది కూడా చర్చనీయాంశం. ఇపుడు కుటుంబంలో అమలులోవున్న పురుషాధిక్యతను అలాగే ఉంచి, స్త్రీకి పురుషుడు జీతం ఏర్పాటుచేశాడనుకుందాం. ఈ ఏర్పాటును స్త్రీలు ఆమోదిస్తారా అనేది ప్రప్రథమంగా పరిగణనలోకి తీసుకోవాలి. దీనిని ఈ పద్ధతిని స్త్రీలు ఆమోదించరు. కారణాలు అనేకం. మనిషికి కావలసింది ప్రేమ, ఆప్యాయత, అనురాగం. అది కరువైనప్పుడు ఎంత పైకం ఆమె సంపాదిస్తే ఏమి లాభం? భార్యకు ఇంటిపనికి జీతం ఇస్తున్నప్పుడు భార్యాభర్తల అనుబంధంలో ప్రేమ నశిస్తుంది; అనురాగం అడుగంటుతుంది. కనుక ఈ పద్ధతిని ఇల్లాలు అంగీకరించదు. మరొక ముఖ్యాంశం దృష్టికి రావాలి. ఇంటిపనికి జీతం ఇస్తే అపుడు ఇల్లాలు బయట సంపాదించ

టానికి పనిచేసే ఎనిమిధి గంటలుకాక అదనంగా ఇంట్లో ఇపుడు చేస్తున్న విధంగానే ఇంట్లో నాలుగు గంటలు కాక అదనంగా ఇంట్లో ఇపుడుచేస్తున్న విధంగానే ఇంట్లో నాలుగు గంటలు పనిచేయాలి. జీతం పుచ్చుకోంటిస్తే అదనపు పని చేయాల్సి వచ్చిందని నసగటానికి వీలులేదు. అంటే ఆమె పన్నెండు గంటలు ప్రతిరోజూ ఇంటా బయటా పనిచేయాలి. ఇది ఆమెపై విపరీతమైన భారాన్ని మోపి సమాజంలోని వినోద కార్యక్రమాలకు, సాహిత్య వ్యాసంగాలకు, సాంస్కృతిక ప్రదర్శనలకు ఆమె పోలేని పరిస్థితి ఏర్పడుతుంది. ఇప్పుడూ అదే స్థితి ఉంది. కాగా, అపుడు జీతం తీసుకుంటున్నందున అది ఐచ్ఛిక మవుతుంది. అధంగా ఆమె ఇష్ట పూర్వకంగా బానిసత్వంలోకి జొరబడుతున్నదన్నమాట. అంతేకాక మరో కారణంకూడా వుంది. ఆమె యీ యేర్పాటును కాదనటానికి జీతం పుచ్చుకోగానే ఆమె ఉద్యోగిని, అతడు యజమాని అవుతాడు. ఆమె పని పరిస్థితులను పరిశీలించి ఆమెకు న్యాయం చేకూర్చడం అసాధ్యం. కార్యాలయాల్లో, వ్యాపార పరిశ్రమలలో పని పరిస్థితులు, జీతాల చెల్లింపు, సెలవులు, మొదలగువాటిని నియంత్రణ చేసే శాసనాలు, వాటిని అమలు జరిపే అధికారులూ ఉంటారు. అలాకాక 68 కోట్ల జనాభాకల దేశంలో కనీసం పదికోట్ల కుటుంబాలన్నా ఉంటాయి. పదికోట్ల కుటుంబాలతో పని పరిస్థితులు పరిశీలించి పర్యవేక్షణ చేయగల సిబ్బందిని సమాజం నియమించలేదు; భరించలేదు. చివరగా మరొక కారణాన్ని పేర్కొనటం అవసరం. భార్యాభర్తలు ఇద్దరూ సంపాదిస్తుంటేనే కుటుంబంలో అందరికీ తగిన తిండి వగైరాలు దొరకటంలేదు. అర్ధాకలితో, వస్తులతో పెరుగు డే జనం కోట్ల సంఖ్యలో ఉన్నారు. ఆ కుటుంబాలలో భర్త భార్యకు జీతం ఇవ్వకలగడం అసంభవం. ఇన్ని కారణాలవల్ల యీ పద్ధతి పనికిరాదు.

ఇలా వివిధ పరిష్కార మార్గాలను అన్వేషించిన మీదట తేలిన విషయం ఒక్కటే ఒకటి. స్త్రీ పురుషుల మధ్య సంపూర్ణ సామాజిక సమానత్వం ఏర్పడాలి. రాజకీయార్ధిక రంగాలలో స్వేచ్ఛా సమానత్వాలు వెల్లివిరియాలి. కుటుంబంలో స్త్రీ పురుషుల స్వేచ్ఛపై అక్రమ పరిమితులుండరాదు. ఇక్కడ ఒక అంశాన్ని స్పష్టీకరించుకోవాలి.

ఎవరికీ నిర్నిబంధమైన స్వేచ్ఛ పనికిరాదు. ఇతరుల స్వేచ్ఛకు భంగం రానంతవరకే ప్రతి వ్యక్తీ తన స్వేచ్ఛను అనుభవించగలగాలి.

ఇంటా, బయటా స్త్రీ పురుషులు శ్రమించాలి. బయట పనులు చేసి ఇరువురూ సంపాదించుకోవాలి. ఇప్పటికే సమాజంలోని శ్రామిక కుటుంబాలలో స్త్రీ పురుషు లిద్దరూ బయట పనిచేస్తున్నారు. అలా కష్టం చేసి సంపాదించుకుంటున్నారు. ఈ పద్ధతి సర్వే సర్వత్రా అమలులోకి రావాలి. అలాగే ఇంటిపనిలో స్త్రీ పురుషులు ఇద్దరూ పాలుపంచుకోవాలి. ఇంటిపని కేవలం స్త్రీ బాధ్యత అనే భావం పోవాలి. దానికి అవసరమైన భావ వికాసం, సామాజిక మార్పు అత్యంత వేగంగా రావాలి. అంతేకాక అన్ని రంగాలలోను స్త్రీ యొక్క సమానత్వాన్ని గుర్తించే శాసనాలను రూపొందించి అమలుపరచాలి. కేవలం శాసనాలు ఉన్నంత మాత్రాన చాలదు. వాటి అమలుకు అనువైన సామాజిక వాతావరణాన్ని సృష్టించాలి. ఇవన్నీ జరిగిననాడు ఇల్లాలి ఇంటిచాకిరీ సమస్య శాశ్వతంగా పరిష్కార మవుతుంది. అంతవరకూ ఆందోళనలద్వారా ఒక్కొక్క మెట్టు పైకి ఎగబ్రాకి మహిళా లోకం సమాజంలో పురోగమించాల్సి ఉంటుంది. అంటే ఇంటిచాకిరీకి విలువను ఇచ్చే సమాజం ఆవిర్భవిస్తుందన్నమాట. స్త్రీ పురుషు లిరువురూ సమిష్టిగా, సహకార భావంతో, సమానత్వ భావంతో, సాదరంగా, ప్రేమాభిమానాలతో ఆధిక్యతా న్యూనతా భావాలు లేకుండా పరస్పర గౌరవంతో సంయుక్తంగా కృషిచేసుకుంటారు. అప్పుడు అది ఎవరికీ భారంగా పరిణమించదు. ఇద్దరికీ సంతోషం, సంతృప్తి కలుగుతుంది.

ఇంటిచాకిరీతో స్త్రీ జీవిత కాలమంతా వ్యర్థమయిపోతోంది. ఆమెకు ఆలోచనా శక్తి సృజనాత్మకత నశిస్తున్నాయి. విజ్ఞానానికి బదులు అజ్ఞానం ఆవరిస్తోంది. బండరాయిగా బ్రతుకు భారాన్ని మోస్తోంది. గౌరవ, హోదాలకు దూరమవుతోంది. వ్యక్తి వికాసం మృగ్యమవుతోంది. పోషింపబడుతున్నాననే కించలో మూగ జీవిలా బ్రతుకుతోంది. కనుక స్త్రీ తాను గృహిణిగా గుర్తింపు పొందాలనే మానసిక దాస్యభావం

నుండి బైటపడాలి. ఇంటా బైటా శ్రమిస్తే నీవు అలసిపోతావనే కల్లబొల్లి కబుర్లను నమ్మరాదు. "ఇంటిచాకిరీ ఇద్దరం చేద్దాం; బైటిపనికికూడా భాగస్వామ్యం వహిద్దాం" అని ఆదేశించే ధైర్యం స్త్రీలలో కలిగిననాడే ఆమెకు నిజమైన విముక్తి సిద్ధిస్తుంది. ఆమె ఉద్యోగినిగా వుంటేనే అవమానాలకు, నిరాదరణకు లోనుకాదు. ఆనాడే తాను ఉత్పత్తిలోను, సామాజిక సేవారంగంలోనూ తన కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటుంది. ఇంటిచాకిరీ అనే "బాండెడ్ లేబర్" నుండి బైటపడి తన దాస్య శృంఖలాలను త్రెంచుకొని తన భవిష్యత్తుకు బాటలు నిర్మించుకుంటుంది. మరి ఆ రోజు ఎప్పుడొస్తుందో!

(మహిళాభ్యుదయ సంస్థ వారి "స్త్రీలు-ఉద్యోగం" అనే చర్చావేదికలో చదవబడినది. "ఉదయం దినపత్రిక సౌజన్యంతో)



# ఉద్యోగాలలో వివక్ష

వాసిరెడ్డి సీతాదేవి

స్త్రీలు ఉద్యోగం చేయడం సహించలేని వర్గాలు, మనుజులు ఇంకా ఉన్నారు. ఆస్థి, హోదా, కుల ఔన్నత్యం కల కుటుంబాలలో, వర్గాలలో కులాలలోని స్త్రీ ఇంటిబయట పనిచేయటం న్యూనతగా భావిస్తున్నారు. ఒకనాడు బీదరికంలో ఉండి తరువాత సంపదను పొందిన కుటుంబాలలో స్త్రీలను వెంటనే పని మాన్పిస్తున్నారు. కష్టము చేయక పోవటానికి, గొప్పతనానికి తీసిపోనిసంబంధాన్ని ఊహించుకొని, కల్పించుకొని ఇలా వ్యవహరిస్తున్నారు. ఇది జమిందారీ సమాజపు భావపంచయు అవశేషం. మన యీ దేశాన్ని, భారతదేశాన్ని, అభ్యుదయ పథంలో నడిపించాలని, కనీసం సాంకేతికంగా ముందుకు తీసుకొని వెళ్లాలని భావించే ఈ తరుణంలో మనం పాత భావాలను, పాత సంప్రదాయాలను విడనాడాలి.

తెలుగు నుడికారం విశిష్టమైనది. స్వయం ఉపాధి పద్ధతిని కూడా

ఉద్యోగమని పిలవడం కద్దు. ఒక రజకుని "నీవు ఏమి చేస్తున్నావు?" అని అడిగామనుకోండి "ఉద్యోగం" అని జవాబు చెప్తాడు. ఒకనాడు కులవృత్తిని అవలంబించడం ఉద్యోగం చేయుడంగా తలపోసేవారు.

ఉద్యోగ సందర్భంగా స్త్రీ పురుషుల మధ్య వివక్ష ఉంటున్నదా? ఉంటే ఏమేరకు? దానికి కారణాలు ఏవి? వివక్షను తొలగించటానికి అన్వేషించవలసిన మార్గాలు ఏమిటి? ఈ అంశాలన్నింటినీ కూలంకషంగా, గాఢంగా నిశితంగా ఈ సెమినారులో పాల్గొనేవారు ఆలోచిస్తారని, చర్చిస్తారని నేను ఆశిస్తున్నాను.

మున్ముందుగా ఒక విషయాన్ని మీ దృష్టికి తీసుకొని రావడం అవశ్య కర్తవ్యం. విసుగు జనించే పనులు, మళ్ళీమళ్ళీ అదే పనిచేయవలసిన పనులు, ఓర్మి ఓపికలను ప్రదర్శించాల్సిన పనులు ఎక్కువగా స్త్రీలకు ఇస్తున్నారు. ఎంతసేపటికీ టైపిస్టులు, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినులు, స్టెనోలు, నర్సులు, ఆయాలు ఇలాంటి ఉద్యోగాలు వారికి ఇవ్వటం జరుగుతోంది. వాటికి వారే తగుదురట. స్త్రీలలో, సౌజన్యం, మార్దవం, మాతృ హృదయం ఇవన్నీ ఆ ఉద్యోగాలకు వారినే తగిన వారినిగా చేస్తాయట. చూస్తుంటే రెండు భావాలు ఉద్భవిస్తాయి. ఒకటి, అవతలవారిని పొగిడి, బుజ్జగించి తమ పబ్బం గడుపుకొనే పురుష దురహంకార పద్ధతైనా కావాలి, లేక పాతకాలపు భావావశేషాలకు తాముకూడా బలి అయి వాటిని పట్టుకొని వ్రేళ్ళాడుతూ "పురుషులు చేయతగిన పనులు, స్త్రీలు నిర్వహించగల ఉద్యోగాలు," అనే విభజనను మనస్ఫూర్తిగా నమ్ముతుండాలి. నిజానికి ఈ రెండు రకాల పురుషపుంగవులూ ఉన్నారు. ఫలితం మాత్రం ఒకటే. స్త్రీ పురుషుల స్వభావాలలో తేడాలున్నాయని, అందువలన వారివారి కార్యరంగాలు విడివిడిగా విధిగా ఉండాలని అనుకోవటం. ఈ భావం మన దేశస్థులను కొన్ని వేల తరాలనుండి వెన్నాడుతున్నది. దీనిని ఎంత త్వరగా వదిలించుకుంటే అంతత్వరగా భారతదేశం ముందగుడు వేయ కలుగుతుంది.

పైన ఉటంకించిన "పని విభజన" సిద్ధాంతాన్ని సమర్థించటం

కొన్ని వర్గాలకు, కొంతమంది స్వప్రయోజనపరులకు లాభదాయకం. స్త్రీ పురుషుల మధ్య వైషమ్యాన్ని పెంచి కష్టజీవులు తమపై దాడిచేయకుండా "విభజించి పాలించు" అనే సూత్రాన్ని జీవితంలో అమలుపరచడం ఒక పద్ధతి. అంతేకాక పాతకాలపు భూస్వామ్య వ్యవస్థ పాటిస్తున్న అసమాన తలను, వీలయినంతకాలం కొనసాగించ పూనటం రెండవది. ఒక వ్యక్తినో లేక ఒక వర్గాన్నో, లేక కులాన్నో న్యూనతగా చూస్తే తప్ప తమ అధికృత రుజువుకాదని, నిలబడదని ఆలోచించటం మూడవది. ఇలా కారణాలు వేరువేరైనా ఫలితం ఒక్కటే. స్త్రీలను తక్కువగా చూడటం, వారి శ్రమ ఫలితానికి తగిన విలువ యివ్వకపోవటం, ఒకవేళ కాస్తో కూస్తో విలువ యిచ్చినా వారిని తక్కువ స్థాయి ఉద్యోగస్థులనుగా పరిగణించడం ఇవన్నీ సర్వసాధారణంగా పురుషదురంహంకార మనస్తత్వమూ ఈ నాటి ఫ్యూడల్ సామాజిక వ్యవస్థ ప్రదర్శిస్తున్న పైఖరులు.

మనది అభివృద్ధి చెందుతున్న దేశంగా చెప్పుకుంటున్నారు. కొంత వరకు ఈ మాట వాస్తవమే. కాగా, మన దేశం సువిశాలమవటంతో దేశంలో తెగలనాటి సంస్కృతి, భూస్వామ్య వ్యవస్థ, పెట్టుబడిదారీ విధానమూ సహజీవనం చేస్తున్నాయి. దేశంలోవున్న 5 లక్షల గ్రామాలలో యిప్పటికీ నూటికి 75 మంది దాకా ప్రజలు నివశిస్తున్నారు. గ్రామాలలో వ్యవసాయమూ, కుటీర పరిశ్రమలు ఇంకా మూడువేల ఏళ్ళనాటి పద్ధతిలోనే సాగుతున్నాయి. శ్రమ చేసే పని తీరులో నైపుణ్యం, పెద్దగా చెప్పుకోతగిన స్థాయిలో పెరగలేదు. ఇప్పుడిప్పుడే ధనిక భూస్వాములు పెట్టుబడి దారులుగా మారుతున్నారు. కాని వారికి సహజమైన భూస్వామ్య సంస్కృతిని విడనాడలేక పోతున్నారు. కాగా ఈ సమాజంలో ఫ్యూడల్ పెట్టుబడిదారీ వర్గాల ఆధిపత్యం కొనసాగుతున్నదని చెప్పటం సత్యదూరం కాదు.

స్త్రీల ఉద్యోగం విషయం ఆలోచించేటప్పుడు ప్రభుత్వ కార్యాలయాలను, ప్రజారంగాన్ని, ప్రయివేటు రంగాన్ని విడమరచి పరిశీలించటం అవసరమేమో! రాజకీయ పరిణామ ఫలితంగా ప్రభుత్వ రంగమూ కొంత వరకు ప్రజారంగమూ ప్రభావితమవుతాయి. భారత రాజ్యాంగంలో

మౌలిక హక్కులు పొందుపరచబడుతుంటే స్త్రీ పురుష వివక్షలేమి సూత్ర ప్రాయంగా ప్రభుత్వ కార్యాలయాల్లో అంగీకరించబడింది. ఆమోదం వేరు, ఆచరణ వేరు. రెండింటి మధ్య తేడా ఉండటానికి అవకాశం ఉంది, ఉన్నదికూడా. స్త్రీలను ఉద్యోగాలకు ఎంపికచేయటంలోనే వివక్ష చోటుచేసుకుంటున్నది. పర్యవేక్షణ బాధ్యత ఉండే ఉద్యోగాలకు, నిర్వహణ బాధ్యతను చేపట్టవలసిన ఉద్యోగాలకు సర్వసాధారణంగా స్త్రీలను ఎంపికచేయటం లేదు. ఇది చాల శోచనీయం.

ఒకసారి ఉద్యోగం యిచ్చిన తరువాత ఆ ఉద్యోగానికి ఆ వ్యక్తిని తయారుచేయటానికి శిక్షణ యిస్తారు. ఆ శిక్షణ విషయంలో కొట్టవచ్చి నంత తేడా కన్పడటం లేదేమో !

ఉద్యోగం యిచ్చిన తరువాత ప్రత్యేక శిక్షణ యిస్తారుకదా! ఆ సందర్భంగా శిక్షణ కోసం ఎంపికచేయుటలో వివక్ష కన్పిస్తున్నది. దాని గాఢత, వ్యాప్తి వీటిని గురించి కొంత పరిశీలన చేయవలసి వుంటుంది.

ఇక ప్రమోషను విషయం వచ్చేటప్పటికి ఉద్యోగానికి వచ్చే యిబ్బందులు ప్రారంభమవుతాయి. పురుషులమధ్య స్నేహ సంబంధా లకు ఆస్కారం ఎక్కువ.

స్త్రీ పురుషుల మధ్య స్నేహాన్ని సరిగా అవగాహన చేసుకోగల సాంస్కృతిక స్థాయికి సమాజం చేరుకోలేదు. ఎంత నిజాయితీపరులైనా తమకు తెలిసినవారిని ఉన్నత పదవులకు ఎంపికచేయటం సహజం. అలా జరుగుతున్నప్పుడు స్త్రీకి ప్రమోషను అవకాశాలు సన్నగిల్లుతున్నాయి. ఇది సామాజిక వ్యవస్థ ఫలితం కావచ్చును. స్త్రీ పురుషులమధ్య సామా జిక సంబంధాలు స్వేచ్ఛగా, నిర్భయంగా, నిస్సంకోచంగా వుండటానికి వీలులేని పరిస్థితుల్లో స్త్రీకి అన్యాయం జరగడం ఆశ్చర్యకరం కాదు. ప్రభుత్వ కార్యాలయాల విషయమే తీసుకోండి. పై ఆఫీసర్ల రహస్య నివేదికలకు యింకా విలువవుంటున్నది. అవి సామాన్యంగా సక్రమంగా రాయబడతాయనే నమ్మకం లేదు. రాగద్వేషాలకు అతీతంగా, అభిమాన

దురక్షిమానాలను అవతలకు త్రోసి వాటిని పై అధికారులు రాస్తారని ఆశించటం పొరపాటేమో అలాంటప్పుడు పురుషులకన్నా స్త్రీలే నష్టపోతారనే విషయము సర్వజనాంగీకారం అవుతుంది. శీలరహితులైన ఉద్యోగినుల విషయం వేరు, వారి సంఖ్య అత్యల్పం. వారిని పరిగణనలోనికి తీసు కోవలసిన అవసరంలేదు.

స్త్రీ సంక్షేమము, సాంఘిక సంక్షేమం శిశురక్షణలాంటి శాఖలు నిర్వహించటానికి మాత్రమే స్త్రీలు తగుదురని తతిమ్మ శాఖల నిర్వహణ వారికి అలవికాదనే భావం మెలుగుతున్నట్లు కన్పడుతున్నది. ఆ శాఖలనుండి వారిని దూరంగా ఉంచటం మంచిదనే అభిప్రాయం పైకి ప్రకటించక పోయినా చాలమంది ఉన్నతాధికారుల మనస్సులలో భావపు ఛాయలు ఎంత దాచుకున్నా అందరికి కళ్లకూ గోచరమవుతాయి. ఈ అసంబద్ధ ఆలోచనలు ఎంత త్వరగా నశిస్తే అంత త్వరగా జాతి పురోగమిస్తుంది.

ఏ కార్యాలయంలోకాని, ఏ పరిశ్రమలోకాని వాణిజ్యరంగంలోకాని కొంతమంది ఉద్యోగులకు ఉన్నతశిక్షణ, ప్రత్యేక శిక్షణ యిప్పించటం సర్వసాధారణంగా జరుగుతున్నది. కాని ఆ విషయంగా స్త్రీ ఉద్యోగులను ఎంపికచేయటం జరగటంలేదు. శక్తిసామర్ధ్యాలలో సమదీటుగా ఉన్నా- కొన్ని కేసులలో అత్యధిక శక్తి సంపన్నతతో ఉన్నా-వారు నిరాదరణకు గురి అవుతున్నారు. ఇతర దేశాలకు పంపబడే ఉద్యోగుల సంఖ్యను పరిశీలించి వారిలో స్త్రీల సంఖ్యను లెక్కలోకి తీసుకుంటే ఈ అభియోగం వాస్తవమని తేలుతుంది.

ఇక సౌకర్యాల విషయం. సమాజంలో స్త్రీలు పురుషులు సమాన హోదాగల సభ్యులు. పైగా సమాజ పురోభివృద్ధికోసం స్త్రీలు ప్రత్యేకంగా మాతృత్వ బాధ్యతను స్వీకరిస్తున్నారు. కనుక ఉద్యోగినులకు ప్రత్యేకంగా అదనంగా సౌకర్యాలను అందివ్వవలసి ఉంది. ఉద్యోగం చేసేచోట విశ్రాంతి, గృహవసతి, పసిపిల్లలను చూచుకోవటానికి అవకాశము, ఇతోధికంగా ప్రసవకాలపు సెలవులు యివ్వాలి. అంతేకాక ఉద్యోగిని ప్రసవ

సందర్భంగా భర్తకు రెండునెలల జీతముతో సెలవు యివ్వాలి. ఇలా
చెప్తుంటే కుటుంబ నియంత్రణ కార్యక్రమం కుంటుపడుతుందేమోనని
కొందరు భయపడవచ్చు. సంతానోత్పాదనను నిరుత్సాహపరిచే ప్రభుత్వ
చర్యలు ఆ ప్రమాదాన్ని అరికట్టగలవు. ఇలా ఎన్నైనా చెప్పవచ్చు.
ఉద్యోగినులకు అదనపు సౌకర్యాలు కల్గించాలన్న సూత్రాన్ని ముమ్మందుగా
ఆమోదించాలి.

స్త్రీలను పురుషులతో సమానంగా అన్ని రంగాలలోను పరిగణించి
సమానావకాశాలను కల్పించగల సమాజం, కొంతకాలం స్త్రీలకు ప్రత్యేక
అవకాశాలు వెసులుబాట్లు, రక్షణ కల్పించే సంఘం ఉద్భవిల్లిననాడు
ఈనాటి ఉద్యోగినుల సమస్యలు చాలవరకు పరిష్కారమవుతాయి. ఈ పరి
ణామాన్ని ఎలా సాధించగలం? సామాజిక పరిణామ ప్రక్రియతో
ఈ సమస్య ముడిపడి ఉందికదా! కనుక ద్వివిధంగా దీనిని సాధించ
వచ్చును. మరో మనిషి శ్రమశక్తిని దోచుకోవడం, వాడుకోవడంలాంటి
దోపిడీ పద్ధతులు లేని సమాజంకోసం కృషిచెయ్యడం ఒక్కటి. పాతకాలపు
అంటే కాలంచెల్లిన వ్యవస్థయొక్క భావనారీతులపై నిర్ద్వంద్వంగా
సాంస్కృతిక తాత్త్వికపోరాటం సాగించటం రెండవది. ఈ రెండూ ఏక
కాలంలో సాగాలి. ఈ సెమినారు చర్చాఫలితాలు అందుకు దారితీస్తాయని
ఆశిస్తున్నాను.

“స్త్రీలు : ఉద్యోగం” అనే అంశంపై తేది 17-3-85న జరిగిన
సెమినారులో అధ్యక్షోపన్యాసం

# వేతనాల సందర్భంగా ఉద్యోగంలో వివక్ష

ఎం. వనమాల

స్త్రీలకు సంబంధించి ఉద్యోగం విషయంగా వివక్ష విస్తృతంగా ఉన్నదనేది సర్వజన విదితం; పచ్చినిజం. వాస్తవానికి ఇది ప్రపంచ వ్యాప్తంగా ఉండే సంఘటన. వివక్షయొక్క పరిమాణాన్ని, స్వభావాన్ని తెలుసుకోవటానికి ఇతోధికమైన గాఢ పరిశీలన అవసరం. అనేక స్థాయిలలో స్త్రీ ఉద్యోగినుల సంఖ్యాపరంగా వివక్షను సాధారణంగా విశ్లేషించవచ్చును. ఇలాంటి విశ్లేషణ ఉద్యోగంయొక్క స్వభావాన్ని విశదపరుస్తుంది. కాని ఆ సంఘటనను సంపూర్ణంగా వివరించదు. కేవలం సంఖ్యాపరమైన విశ్లేషణ వివక్షను మరుగుపరుస్తుంది. ఆదాయం జీవన స్థాయిని నిర్ణయిస్తుంది; అంతేగాక స్త్రీ యొక్క "ఆర్థిక స్వాతంత్ర్యపు" స్థాయినికూడా నియంత్రణం చేస్తుంది. కాగా అట్టి ఆదాయాన్ని సంపాదించటానికి ఉద్యోగం సాధనం. ఉద్యోగంయొక్క ముఖ్య లక్షణాలను ఈ వ్యాసం వెలికితీస్తుంది; (పరిపాలనా ప్రపంచంతో విలయతాండవం ఆడే వివక్షను బహిర్గతం చేస్తుంది,

సంఘటిత రంగంలో రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు 80 లక్షల మందికి జీతాలు చెల్లిస్తున్నాయి. కేంద్ర ఉద్యోగుల వేతనాలకు రాష్ట్ర ఉద్యోగుల వేతనాలకు మధ్య విస్తృతమైన తేడా ఉన్నది. అంతటితో ఆగక రాష్ట్ర ప్రభుత్వాల వుద్యోగులలో అనేక తరగతుల మధ్య వ్యత్యాసాలు వున్నాయి. అనేక తరగతులవారు చేసేపని స్వభావం ఒకటిగావున్నా ఇలా జరుగుతున్నది. 1973వ సంవత్సరపు ఆర్థిక కమిషనువారు ఈ సమస్య యెడల తమ ఆసక్తిని కనుపించారు. "తక్కువస్థాయి వుద్యోగుల మధ్య వ్యత్యాసం అసంతృప్తిని కలిగిస్తుంది. పరిపాలనలో తగినంత సామర్థ్యపు ప్రమాణాన్ని కుంటుపరుస్తుంది. అని ఆ కమిషను వ్యాఖ్యానించింది. వుద్యోగ విధానంలోనేగాక వుద్యోగినుల పరంగా ఈ తేడాలు వాస్తవరూపం తాల్చాయి.

## ప ట్టి క — 1

### అనేక శాఖలలో స్త్రీ పురుషుల

| శాఖ | పురుషులు | | |
|---|---|---|---|
| | సంఖ్య | జీతాల మొత్తం | శాతం |
| న్యాయ పరిపాలన | 8,891 | 5,669-42 | 1.23 |
| రాష్ట్ర ప్రభుత్వం | 3,04,935 | 2,15,640-12 | 46.65 |
| రాష్ట్ర ప్రభుత్వపు ప్రజాసంస్థలు | 1,80,995 | 1,19,810-40 | 25.9 |
| జిల్లా పరిషత్తులు | 39,511 | 29,100-78 | 6.30 |
| పంచాయితీ సమితులు | 90,169 | 57,967-12 | 12.54 |
| పంచాయితీలు | 13,217 | 4,485-66 | 0.97 |
| మునిసిపాలిటీలు | 19,483 | 10,907-93 | 2.36 |
| మునిసిపలు కార్పొరేషన్లు | 10,999 | 6,559-39 | 1.37 |
| స్థానిక సంస్థలు, తదితరాలు | 5,568 | 3,044-55 | 0.66 |
| విశ్వవిద్యాలయాలు | 12,402 | 9,293-53 | 2.00 |
| మొత్తం | 6,86,170 | 4,62,278-90 | 100.00 |

జీతాల మొత్తం (వేలల్లో)

| స్త్రీలు | | | అందరు ఉద్యోగులు | | | |
|---|---|---|---|---|---|---|
| సంఖ్య | జీతాల మొత్తం | శాతం | ఉద్యోగుల సంఖ్య | జీతాల మొత్తం | పురుషులు | స్త్రీలు |
| 727 | 463-58 | 0.79 | 9,618 | 6135 | 92.4 | 7.6 |
| 38,490 | 27,218-88 | 46.16 | 3,43,425 | 2,42,859 | 88.8 | 11.2 |
| 4,045 | 2,677-80 | 4.54 | 1,85,040 | 1,22,488 | 97.8 | 2.2 |
| 5,252 | 3,868-22 | 6.56 | 44,763 | 32,969 | 88.2 | 11.8 |
| 2,172 | 13,610-88 | 23.08 | 1,11,341 | 71,578 | 81.0 | 19.0 |
| 2,370 | 804-34 | 1.36 | 15,587 | 5,210 | 84.8 | 15.2 |
| 9,856 | 5,518-07 | 9.36 | 29,339 | 16,426 | 66.4 | 33.6 |
| 5,847 | 3,380-61 | 5.73 | 16,846 | 9,740 | 65.3 | 34.7 |
| 405 | 221-45 | 0.38 | 5,877 | 3,266 | 93.2 | 6.9 |
| 1,606 | 1,200-47 | 2.04 | 14,008 | 10,497 | 88.5 | 11.5 |
| 89,770 | 58,967-10 | 100.00 | 7,75,840 | 5,21,246 | 88.7 | 11.3 |

1 వ పట్టికలోని జీతాల బిల్లును పరిశీలిస్తే కొన్ని ధోరణులు కన్పడతాయి. అన్ని సంస్థలలోను ఉద్యోగులజీతాలబిల్లు ఉద్యోగినులజీతాలబిల్లు కంటె చాల అధికమనేది మొదటిది. మునిసిపాలిటీలలో, మునిసిపలు కార్పోరేషనులలో స్త్రీల జీతాల బిల్లు వరుసగా 33, 34 శాతం ఉంటున్నది. పంచాయితీ సమితులలో 19 శాతం, పంచాయితీలలో 15 శాతంగా ఉన్నది. జిల్లా పరిషత్తులు, విశ్వవిద్యాలయాలు, రాష్ట్ర ప్రభుత్వం-వీటిలోకి వచ్చేటప్పటికి 11 శాతానికి దిగజారింది. తతిమ్మా సంస్థలలో 8 శాతానికి మించటంలేదు. రాష్ట్ర ప్రజా, వ్యాపార, పారిశ్రామిక సంస్థలలో మరీ తక్కువగా వచ్చింది. అది 2 శాతం మాత్రమే. అంటే ప్రజారంగమూ అందులో ముఖ్యంగా ప్రజారంగ వ్యాపార పారిశ్రామిక సంస్థలూ ఉద్యోగినుల ప్రయోజనాలను పరిరక్షించటం లేదని తెలుతుంది.

ప్రజారంగ వ్యాపార పారిశ్రామిక సంస్థలు కొన్ని స్పష్టమైన సామాజిక ఆర్థిక లక్ష్యాలతో నెలకొల్పబడ్డాయి. ప్రజలకూ, అందులో ప్రత్యేకంగా బలహీన వర్గాలకు ఉద్యోగావకాశాలు పెంపొందింప చేయటం మొదటిది. ఆదాయాన్ని న్యాయంగా పంపిణీచేయటం రెండవది. సామాజిక ఆర్థిక పరివర్తనంలో పాత్ర వహించటం మూడవది. ఇలా ఎన్నింటినో పేర్కొనవచ్చును. ఉద్యోగులలో స్త్రీల జీతాల బిల్లు 2 వ శాతం ఉన్నదంటే ఆ సంసలు ఏ స్పష్టమైన సామాజిక ఆర్థిక లక్ష్యాలసాధన కొరకు స్థాపించబడినవో, వాటిని సాధించటం లేదన్న విషయం తేటతెల్లం అవుతున్నది.

పట్టిక – 2

ప్రజారంగంలో స్త్రీ పురుషుల జీతాల బిల్లు (రు. వేలసంఖ్యలో నెలకు)

| ఉద్యోగపు తరగతి | పురుషుల జీతాలబిల్లు | స్త్రీల జీతాలబిల్లు | మొత్తం | శాతం తరగతులవారిగా పురు. | శ్రీలు |
|---|---|---|---|---|---|
| గెజిటెడ్ | 49,560 | 4,013 | 53,574 | 92.4 | 7.6 |
| | (14.77) | (7.6) | | | |
| నాన్-గెజిటెడ్ | 2,01,778 | 32,604 | 2,34,382 | 86.0 | 14 0 |
| 4-వ తరగతి | 70,537 | 13,429 | 83,966 | 84.0 | 16 0 |
| తాత్కాలిక పనివారు | 6,733 | 2,150 | 8,883 | 76.0 | 24.0 |
| పనిఉన్నంతకాలం పనివారు | 6,493 | 963 | 7.456 | 87.1 | 12.9 |
| మొత్తం | 3,35,043 | 53,218 | 3,88,261 | 86.3 | 13.7 |

ఈ వేతనాల బిల్లు పద్ధతిని గమనిస్తే అన్ని తరగతులలోను ఉద్యోగినుల జీతాల బిల్లు తక్కువగా ఉన్నదని గ్రహించవచ్చును. కాకపోతే తక్కువ స్థాయి ఉద్యోగాలలో కొద్దిగా ఎక్కువ శాతంగా ఉన్నది. అంటే స్త్రీలు తక్కువ జీతాలున్న ఉద్యోగాలలోనే నియమింపబడు తున్నారన్నమాట. "పర్మనెంటు" కాని ఉద్యోగాలుకూడా పై చెప్పిన వర్గీకరణ క్రిందికి వస్తుంది. పై పట్టికలో క్రిందినుండి పైకి ఉన్న 3 తరగతుల శాతం ఈ విషయాన్ని స్పష్టపరుస్తున్నది. తక్కువ తరగతి ఉద్యోగాలలో స్త్రీల జీతాల బిల్లు 51 శాతానికి వస్తుంది. తక్కువ జీతాలున్న ఉద్యోగాలలో స్త్రీలు ఎక్కువగా నియమింపబడు తున్నారని విశదమవుతున్నది.

సమానమైన పని మొత్తానికి సమానమైన జీతం ఇవాల్సిందేనని వివక్ష కూడదని రాజ్యవిధానం ప్రత్యేకించి ప్రకటిస్తున్నా పైన వివరింప బడినట్లుగా ఉన్న వేతనాల చెల్లింపు విధానం ఆదాయాన్ని అసమానంగా పంపిణీ చేయటానికి దోహదం చేస్తున్నది.

1948 సంవత్సరపు న్యాయవేతనాలకమిటీ వేతనాలలో మూడు స్థాయిలను నిర్దేశించింది. అవి "జీవనానికి సరిపడిన వేతనాలు", "న్యాయమైన వేతనాలు", "కనీస వేతనాలు". ఆరోగ్యం, సభ్యతా మర్యాదలు తగు మాత్రపు సౌఖ్యం, పిల్లలకు విద్య మొదలగువాటిని నిలబెట్టుకోవటానికి, సామాజిక అవసరాలు తీర్చుకోటానికి, అపాయాలు ఆపదలు సంభవిస్తే వాటిని తట్టుకోడానికి అవసరమైన జీవితస్థాయిని కలిగియుండటానికి చాలిన వేతనాన్ని "జీవనానికి తగిన వేతనం" (LIVING Wage) అంటారు. కేవలం జీవయాత్ర సాగించటానికి తగినది మాత్రమేకాక, కార్మికునిగా సమర్థతతో వ్యవహరించటానికి అవసరమైన తగుమాత్రపు విద్య, వైద్యావసరాలు, ఇతర సౌకర్యాలు - వీటిని ఏర్పరచునది "న్యాయమైన వేతనం" (FAIR Wage). న్యాయమైన వేతనాన్ని నిర్ణయించుటకు ముగ్గురు పెద్ద వాళ్ళున్న ప్రమాణిత కుటుంబాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. సంఘటిత రంగంలో ఉన్న అనేక పరిశ్రమలలో, వ్యాపార-పారిశ్రామిక సంస్థలలో వేతనాల విషయంగా, చెల్లించే అదనపు మొత్తాలు (అలవెన్సులు) పరంగా

చెప్పుకోతగినంత వ్యత్యాసాలు ఉన్నాయి; వైద్యం చేయించుకొనుట, ప్రయాణాలకు సెలవు, ఇంటి అద్దె విషయంలో సహాయం, ఇవి స్త్రీ పురుష ఉద్యోగుల మధ్య తేడాను తెలియజేస్తున్నాయి. స్త్రీలు ఎక్కువగా తాత్కాలికమైన కొద్దిస్థాయి ఉద్యోగాలలో నియమింపబడు తున్నందున వారికి అదనపు సౌకర్యాలు లభించవు. తతిమ్మా రకాల వేతనాలవలెకాక "కనీస వేతనం" కేవలం మనిషి జీవించడానికి మాత్రం సరిపోతుంది. వేతనాలద్వారా ఆదాయాన్ని పంపిణీ చేయటమనేది లెక్కలోకి తీసుకుంటే ఎక్కువమంది వుద్యోగ్యులు కనీస వేతనపు పరిధిలోకి వస్తారు. సంఘటిత రంగంలో వేతనాలపరంగా స్త్రీ యెడల అమలుజరిగే వివక్షను ఇది సూచిస్తున్నది.

## ముగింపు :

స్త్రీలను ఉద్యోగాలలో నియమించటంలో వివక్ష ఉందని పై విశ్లేషణ సూచిస్తున్నది. వ్యక్తిగత వ్యాపార పారిశ్రామిక రంగంవలెకాక, ప్రజారంగం సంక్షేమదృక్పథంతో పనిచేయవలసి వుంటుంది; స్త్రీలు కూడా చేరివున్న బలహీన వర్గాలను రక్షించవలసియున్నది. లెక్కలు చూస్తే వేతనాల సందర్భంగా పురుషులకు చెందే వేతనాల బిల్లు మొత్తం స్త్రీల వేతనాల బిల్లు మొత్తంకన్నా అత్యధికంగా ఉంది. పట్టణాలలోని స్థానిక సంస్థలలో స్త్రీలను తక్కువ జీతపు ఉద్యోగాలలో, నీచకార్యాలను చేయవలసిన ఉద్యోగాలలో నియమిస్తున్నారు. అందువలన స్త్రీల వేతనాల బిల్లు పురుషుల వేతనాల బిల్లులో మూడవ వంతుగా మాత్రమే వున్నది. గ్రామీణ పంచాయితీ వ్యవస్థలో వారి దామాషా అయిదవ వంతు. రాష్ట్ర ప్రభుత్వ వ్యవస్థలో, విశ్వవిద్యాలయాలలో అది పదవ వంతు. ప్రజారంగ వ్యాపారాలలో, పరిశ్రమలలో అది రెండు శాతం మాత్రమే. దీనివల్ల ఆదాయ పంపిణీ స్త్రీలపట్ల వివక్షతో అసమానంగా, అన్యాయంగా వుందని తెలిపోయింది. తక్కువ జీతపు వుద్యోగాలలో స్త్రీలు అత్యధిక సంఖ్యలో వున్నారని లెక్కలు మనకు తెలియజేస్తున్నాయి. తాత్కాలిక వుద్యోగాలు కూడా ఈ కోవక్రిందికి వస్తాయి. వీటిలో కేవలం శ్రమయొక్క మార్కెటు

విలువ ఇవ్వబడుతున్నది. శ్రమశక్తిని ఇచ్చే మనిషిని పోషించటానికి అవసరమైన ఖర్చు లెక్కలోకి రావటంలేదు. అలా స్త్రీలు "న్యాయమైన వేతనం", "జీవన ప్రమాణానికి తగిన వేతనం" అనే తరగతుల వేతనాల పరిధిలోకి రాకుండా "కనీస వేతనపు" పరిధిలోకి వస్తున్నారు. వుద్యోగం చేయటం ఆర్థిక స్వాతంత్ర్య సాధన నిమిత్తమే కదా! కాని, అట్టి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఈ పద్ధతినసాగే వుద్యోగ నియామకం లభ్యంచేయటం లేదు. స్త్రీలు కేవలం జీవించాలని, అర్థవంతమైన హుందా గల జీవితాన్ని గడపనక్కరలేదని ఈ రకపు వేతనాల విధానం వుద్దేశిస్తున్నదని పైన వివరింపబడిన ధోరణులు రుజువుచేస్తున్నాయి. ❋

(మహిళాభ్యుదయ సంస్థ తే 31-3-85 దిన హైదరాబాద్‌లో జరిపిన "స్త్రీలు ; వుద్యోగం" అనే సెమినారులో సమర్పింపబడిన చర్చాపత్రం)

# కుటుంబంమీద స్త్రీల ఉద్యోగ ప్రభావం

మమతా లక్ష్మన్న

స్త్రీలు ఉద్యోగాలను చేయడం గురించి ప్రజలలో-ముఖ్యంగా ఎగువ తరగతి, మధ్యతరగతి కుటుంబాలలో ఉన్న అపోహలు మెల్ల మెల్లగా అదృశ్యమవుతున్నాయి. స్త్రీల విముక్తికోసం జరిగిన సంఘటిత ఉద్యమ కృషి ఫలితంగా కాక ద్రవ్యోల్బణంవల్ల, ఆర్థిక అవసరం దృష్ట్యా ఈ ఫలితం వచ్చివుండవచ్చును. అందువలననే సంప్రదాయక వృత్తుల లోను, అసంప్రదాయక వృత్తులలోను అత్యధిక సంఖ్యలో స్త్రీలు ఉద్యో గాలను అన్వేషించటం జరుగుతున్నది. అనేక వృత్తులలో, అందులో ప్రత్యేకంగా నిర్ణాయక శక్తిని, నైపుణ్యాన్ని విధిగా ప్రదర్శించవలసిన ఉద్యోగాలలో స్త్రీలను నియమించడానికి చాలమంది యజమానులు తట పటాయిస్తున్నారు. పర్యవేక్షణ బాధ్యతను నిర్వర్తించవలసిన పదవులకు స్త్రీలను ఎంపికచేయటంలేదు. కనుక స్త్రీల నియామకం విషయంగా రెండు 'మార్కెట్లు' అమలులో ఉన్నాయి. ఒకదానిలో ఉద్యోగాలకు స్త్రీలు తగి

వున్నారని భావించడం, పైగా వారినేఆ ఉద్యోగాలకు వీలయినంతవరకు నియామకంచేయడం జరుగుతున్నది. రెండవరకపు 'మార్కెటు'లో ఉద్యోగాలు పురుషులకే పరిమితం. అంటే దానిలో పురుషాధిక్యత ఉన్నదన్న మాట. వరుమానం తక్కువగా ఉన్న ఉద్యోగాలు మాత్రమే స్త్రీలకు లభిస్తున్నాయి. పైగా ఉన్నత పదవులకు పోవటానికి అవకాశంలేని ఉద్యోగాలు అవి. వారు ఏ ఉద్యోగాన్ని చేపట్టినా ఎక్కడో ఒకచోట వారి అభివృద్ధి నిలిచిపోతుంది. స్త్రీలకు ఇలా కేటాయించబడిన పాత్ర, స్థానమూ స్త్రీల దృక్పథంలో మార్పు తెస్తున్నది. పురుషులలో ఆ సందర్భంగా మార్పు రాకపోవటంతో స్త్రీలు ఇంటా, పనిచేసేచోటా సమస్యలను ఎదుర్కోవలసి వస్తున్నది.

భారతదేశంలోని 22.5 కోట్ల కష్టజీవులలో స్త్రీలు 8.7 కోట్ల మందిగా ఉన్నారు. ఈ సంఖ్యలో 22.19 శాతం మంది సంఘటిత రంగంలో పని చేస్తున్నారు. మిగతావారు అసంఘటిత రంగంలో పనిచేస్తున్నారు: వ్యవసాయ కూలీలు, కర్షకులు, భవన నిర్మాణంలో కార్మికులు, చేపలు పట్టువారు మొదలైనవారు అసంఘటిత రంగంలోని శ్రమజీవులు. ఇటీవల చాల సంవత్సరాలుగా స్త్రీలు సంప్రదాయంగా చేస్తున్న పనులను పురుషులు చేపట్టటం జరిగింది. అనేక కారణాలవల్ల ఇలా జరిగింది. కూలీరేట్లు, పని పరిస్థితులు కొంత మెరుగుకాగానే స్త్రీల బదులు పురుషులు ఆ పనులలో జొరబడతారు. ఉదాహరణకు జవుళి పరిశ్రమలోను, జనపనార పరిశ్రమలోనూ ఇదే జరిగింది. సాంకేతిక అభివృద్ధి జరిగినా, లేక వ్యవసాయ పద్ధతులలో మెరుగైన పద్ధతులు అవలంబింపబడినా క్రొత్తగా ఉదయించిన పనులలో పురుషులు చేరతారు. ఆ పదవులలో పనిచేయటానికి ప్రత్యేక శిక్షణ, నేర్పు కావలసి వున్నందున పురుషులకు ప్రవేశం లభిస్తున్నది. ఈ సందర్భంగా మనం క్రొత్త "బడ్జెట్"ను పరిశీలించాలి. నిత్యావసర వస్తువుల ధరలు ఒకవైపు పెరుగుతాయి. మరోవైపున ఎక్కడ సాధ్యమైతే అక్కడ కంప్యూటర్లను, ఎలక్ట్రానిక్ పరికరాలను ప్రవేశపెట్టడం జరుగుతుంది. అందువలన ప్రతిపనికి పెట్టుబడి ఎక్కువగా కావలసి ఉంటుంది.

అంతేగాక నైపుణ్యం అవసరమవుతుంది. దాంతో స్త్రీలకు ఉద్యోగాలు పోయి పురుషులు వాటిలో చేరతారు. స్త్రీలు ఉద్యోగం చేయడంవలన అది కుటుంబ పరిమాణంపై సరాసరి ప్రభావం కలిగి వుంటుంది. అలాగే శిశు మరణాల రేటుపై ప్రత్యక్ష ప్రభావం వుంటుంది. గరిష్ట జాతీయ వుత్పత్తి, సగటు తలసరి ఆదాయం కాకుండా ఒకదేశం, లేక ఒకసమాజం యొక్క అభివృద్ధికి గీటురాయిగా ఆ దేశపు, లేక సమాజపు శిశు మరణాల రేటును సూటిగా పరిగణించటం పరిపాటి. నిజానికి, తతిమ్మా రెంటికన్నా, శిశు మరణాల రేటు అభివృద్ధి దశను తప్పక తెలియజేయగలదు. స్త్రీలు ఎక్కడైతే విద్యావంతులయి వుద్యోగాలు చేస్తుంటారో, ఎక్కడ ఆలస్యంగా వివాహమాడతారో అక్కడ శిశు జననాలరేటు తక్కువగా వుంటుంది. అలాగే శిశు మరణాలరేటు తక్కువగా వుంటుంది. గ్రామప్రాంతంలో ఒక వంద మంది కార్మిక స్త్రీలు సంతానాన్ని పొందితే వారు 491 మందిని కంటారు అదే, పనికిపోని స్త్రీలయితే 561 మంది సంతానాన్ని పొందుతారు. పట్టణ ప్రాంతంలో వందమంది కార్మిక స్త్రీలు 411 మంది పిల్లలను కంటే పని చేయని 100 మంది స్త్రీలు 465 మంది పిల్లలను కంటారు. కనుక, స్త్రీ పనిచేసి వేతనం సంపాదిస్తుంటే ఆమె సంతానోత్పాదనా శక్తిపై అది ప్రభావం కలిగి వుంటుంది. ఒకవేళ వివాహపూర్వమే ఆమె పనిచేస్తూ వుంటే ఆమెవివాహం ఆలస్యంగా జరుగుతుంది. ఈపరిస్థితి ఆమె సంతాన పరిమాణంపై ప్రభావం కలిగియుంటుంది. ఆమె పదునెనిమిది ఏండ్ల ప్రాయానికి ముందే వివాహమాడటం తటస్థిస్తే, ఆమె సంతానోత్పాదనా శక్తి రేటు గ్రామాలలో 5.41 గాను, పట్టణాలలో 4.61 గాను వుంటున్నది. అలాకాక ఆమె 21 సంవత్సరాల తదుపరి వివాహమాడితే, గ్రామాలలో ఆ రేటు 4.67 గాను, పట్టణాలలో 5.53 గాను వుంటున్నది.

స్త్రీ వుద్యోగం చేస్తుంటే, ఆమె కనే సంతానంయొక్క సంఖ్య తగ్గుతుంది. భవనాల నిర్మాణపు పని, రవాణా పరిశ్రమ, శ్రమతో కూడిన పని వీటిని చేపట్టిన స్త్రీలలో శిశు మరణాల సంఖ్య ఎక్కువగా వుంటున్నది. గ్రామాలలో అది 150 అయితే పట్టణాలలో .2.. అయితే వివాహ వయః పరిమితిని 18 సంవత్సరాల లోపునుండి 21 సంవత్సరాలు లేక అంతకు

పైకి పెంచితే శిశుమరణాల రేటు గ్రామాలలో 156 నుండి 91 కి పట్టణాలలో 88 నుండి 46 కు పడిపోతుంది. విద్యాస్థాయికూడా నిర్ణాయకపాత్ర వహిస్తుంది. గ్రామాలలో నిరక్షరాస్యులలో 145, ప్రాథమిక విద్య ఆపైన చదివినవారిలో 71 గా శిశు మరణాలరేటు ఉన్నది. పట్టణాలలో నిరక్ష రాస్యులలో ఆ రేటు 88 గాను, ప్రాథమిక విద్య ఆపై చదువు ఉన్నవారిలో 47 గాను ఉన్నది. అలా శిశువుల సంఖ్యను, శిశు మరణాలరేటును నిర్ణ యించేది వివాహ వయః పరిమితి. స్త్రీలు ఆర్థికంగా ఇతరులపై ఆధార పడనప్పుడు, వారికి ఎక్కువ హోదా ఇచ్చినపుడు వివాహ వయః పరిమితి పెరుగుతుంది. కాని, ఇంటిబయట ఆమె పనిచేయటం వలన ఆమె శిశువుల ఆరోగ్యానికి భంగంకలిగి, శిశు మరణాలు ఎక్కువయితే ఆమె ఇంటిబయట వుద్యోగం చేయటం కష్టతరమవుతుంది. కనుక స్త్రీలు వుద్యోగాలు చేయ డాన్ని ప్రోత్సహించి, వారు అవసరమైన నైపుణ్యాన్ని, శిక్షణను పొంద టానికి అవకాశం ఇవ్వడం ఒకవైపున జరగాలి. తల్లులకు, పిల్లలకు పని ప్రదేశంలో తగిన జాగ్రత్త, సౌకర్యాలు వుండేలాగున చూడవలసిన బాధ్యత సమాజంపైన, యజమానులపైన వున్నది. అందుకు అవసరమైన వైఖరిలో మార్పు వారిలో రావాలి. ఇది స్త్రీలకు ఎంతో సహాయకారి అవు తుంది. అంతేకాక అది చిన్నకుటుంబాల వునికికి దారితీస్తుంది. మెరుగైన జీవనప్రమాణం ఏర్పడుతుంది. అదీగాక, పనిని వికేంద్రీకరణ చేస్తే స్త్రీలకు వుద్యోగావకాశాలు పెరుగుతాయి. కేంద్రీకృత విధానంలో స్త్రీలకు వుపాధి అవకాశాలు సన్నగిల్లుతాయి.

ఈ దిగువ పట్టిక 1981 సంవత్సరంలో స్త్రీ పురుషుల వుద్యోగ పరి స్థితులు తెలియజేస్తుంది.

### పట్టిక — 1

### జనాభాలో శ్రమజీవుల శాతం

| | మొత్తం | గ్రామ ప్రాంతంలో | పట్టణ ప్రాంతంలో |
|---|---|---|---|
| మనుజులు | 42.18 | 45.76 | 30.36 |
| పురుషులు | 56.16 | 58.48 | 48.62 |
| స్త్రీలు | 27.87 | 32.85 | 11.11 |

## పట్టిక — 2

### మొత్తం శ్రమజీవుల సంఖ్యలో దిగువ తరగతుల శ్రమజీవుల శాతం.

| | మొత్తం | గ్రామాలలో | పట్టణాలలో |
|---|---|---|---|
| **కర్షకులు :** | | | |
| మనుజులు | 32.60 | 38.18 | 4.86 |
| పురుషులు | 36.68 | 44.84 | 4.89 |
| స్త్రీలు | 24.20 | 26.16 | 4.72 |
| **వ్యవసాయ కూలీలు :** | | | |
| మనుజులు | 36.68 | 41.82 | 11.07 |
| పురుషులు | 26.61 | 31.53 | 7.42 |
| స్త్రీలు | 57.46 | 60.42 | 27.94 |
| **ఇంటి పని :** | | | |
| మనుజులు | 5 43 | 5.05 | 7 32 |
| పురుషులు | 5.13 | 4.96 | 5.78 |
| స్త్రీలు | 6.05 | 5 21 | 14.42 |
| **ఇతర శ్రమజీవులు :** | | | |
| మనుజులు | 25.29 | 14.95 | 76.75 |
| పురుషులు | 31.58 | 18.67 | 81.91 |
| స్త్రీలు | 12.29 | 8.21 | 52.92 |

శ్రమజీవులైన స్త్రీ పురుషుల వృత్తిరీత్యా విభజన పట్టిక
(1981 జనాభా లెక్కలు)

| వృత్తి | సంఖ్య స్త్రీలు | సంఖ్య పురుషులు | పనిచేసేవారి శాతం స్త్రీలు | పనిచేసేవారి శాతం పురుషులు |
|---|---|---|---|---|
| వ్యవసాయం | 15.2 | 76.2 | 33 | 43.8 |
| వ్యవసాయ కూలీలుగా | 20.9 | 34.4 | 46 | 19.8 |
| కుటీర పరిశ్రమ | 2.4 | 6.4 | 5.0 | 3.7 |
| తదితరాలు | 7.5 | 57.1 | 16 | 32.7 |
| | 46.0 | 174.1 | 100 | 100 |

సోషల్ వెల్‌ఫేర్ వాల్యూము 31, నెం. 2, మే 1984, పుట 26.

(తే 31-3-1985 దిన మహిళాభ్యుదయ సంస్థ హైదరాబాద్‌లో నిర్వహించిన "స్త్రీలు : ఉపాధి" అనే సెమినార్‌లో పరిశోధనావ్యాసం)

# స్త్రీలు : స్వయం ఉపాధి

ఎం.వి. రామమూర్తి

శ్రమకు సంబంధించిన సంఘటిత రంగమూ, అసంఘటిత రంగమూ కాక మూడవరంగం ఉన్నది. అది స్వయం ఉపాధి కల శ్రమజీవుల రంగంవారు, ఎక్కువగా చేతి వృత్తులవారు. నేత, చాపలు అల్లటం, కూరగాయలు అమ్మడం, అల్పాహారపు తినుబండారాలు విక్రయించడం, పాడి పరిశ్రమ, అప్పడాలలాంటి ఇళ్ళల్లో ఖర్చయ్యే వస్తువులు తయారు చేయడం, పూలు అమ్మడం, దర్జీపని, కుట్టుపని, లేసు పని చిన్న చిన్న వ్యాపారాలు నడపటంలాంటి వృత్తులు వారు చేపట్టారు. ఈ స్త్రీలు పెట్టుబడి క్రింద చాల తక్కువ ధనము వినియోగిస్తారు. తమ వృత్తిని సాగించ

II. శిశు మరణాలు

వృత్తినిబట్టి శిశు మరణాల రేటు.

| | స్త్రీల వృత్తి | గ్రామ | పట్టణ |
|---|---|---|---|
| 6వ విభాగం : | కర్షకులు, మత్స్యకార్మికులు, వేటాడేవారు, కలప పనివారు | 143 | 106 |
| 7, 8, 9 విభాగాలవారు : | ఉత్పత్తి, రవాణా పరిశ్రమలలో | 150 | 129 |
| | కార్మికులు | 142 | 98 |
| | పనిచేయని స్త్రీలు | 134 | 64 |

పెండ్లినాటి వయస్సునుబట్టి శిశు మరణాల పట్టిక

| పెండ్లినాటి వయస్సు | గ్రామ | పట్టణ |
|---|---|---|
| 18 సం॥ లోపు | 156 | 88 |
| 18–20 సం॥లో | 132 | 67 |
| 21 సం॥, ఆపైన | 90 | 46 |

(1981 అక్టోబరులో ప్రకటింపబడిన జనన మరణాల రిజిష్ట్రారు సమాచార లేఖ)

పని స్థాయినిబట్టి స్త్రీ పురుషుల శాతాలు (1981)

| వరుస సంఖ్య | తరగతి | జనాభాలో శాతం స్త్రీ. | పు. | మొత్తం | స్త్రీల జనాభాలో శాతం | పురుషుల జనాభాలో శాతం |
|---|---|---|---|---|---|---|
| 1) | పనిచేయువారు | 20.9 | 79.1 | 100 | 14.5 | 51.23 |
| 2) | కొలదిగా పనిచేయువారు | 75.27 | 24.73 | 100 | 6.4 | 1.97 |
| 3) | అసలు పనిచేయనివారు | 61.3 | 38.7 | 100 | 79.1 | 46.8 |
| | మొత్తం | 48.36 | 51.54 | 100 | 100 | 100 |

శ్రమజీవులైన స్త్రీ పురుషుల వృత్తిరీత్యా విభజన పట్టిక
(1981 జనాభా లెక్కలు)

| వృత్తి | సంఖ్య | | పనిచేసేవారి శాతం | |
|---|---|---|---|---|
| | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు |
| వ్యవసాయం | 15.2 | 76.2 | 33 | 43.8 |
| వ్యవసాయ కూలీలుగా | 20.9 | 34.4 | 46 | 19.8 |
| కుటీర పరిశ్రమ | 2.4 | 6.4 | 5.0 | 3.7 |
| తదితరాలు | 7.5 | 57.1 | 16 | 32.7 |
| | 46.0 | 174.1 | 100 | 100 |

సోషల్ వెల్ ఫేర్ వాల్యూము 31, నెం. 2, మే 1984, పుట 26.

(తే 31–3–1985 దిన మహిళాభ్యుదయ సంస్థ హైదరాబాద్‌లో నిర్వహించిన "స్త్రీలు : ఉపాధి" అనే సెమినార్‌లో పరిశోధనావ్యాసం)

# స్త్రీలు : స్వయం ఉపాధి

ఎం.వి. రామమూర్తి

శ్రమకు సంబంధించిన సంఘటిత రంగమూ, అసంఘటిత రంగమూ కాక మూడవరంగం ఉన్నది. అది స్వయం ఉపాధి కల శ్రమజీవుల రంగంవారు, ఎక్కువగా చేతి వృత్తులవారు. నేత, చాపలు అల్లటం, కూరగాయలు అమ్మడం, అల్పాహారపు తినుబండారాలు విక్రయించడం, పాడి పరిశ్రను, అప్పడాలలాంటి ఇళ్ళల్లో ఖర్చయ్యే వస్తువులు తయారు చేయడం, పూలు అమ్మడం, దర్జీపని, కుట్టుపని, లేసు పని చిన్న చిన్న వ్యాపారాలు నడపటంలాంటి వృత్తులు వారు చేపట్టారు. ఈ స్త్రీలు పెట్టుబడి క్రింద చాల తక్కువ ధనము వినియోగిస్తారు. తమ వృత్తిని సాగించ

టానికి మరీ తక్కువ మొత్తాన్ని వాడతారు. రుణదాతలు, టోకు వర్తకులు, దళారులు వారి శ్రమ ఫలితాన్ని దోచుకుంటారు. వారిలో కొంత మంది రోడ్డు మార్జినులలో పనిచేస్తుంటారు. మరి కొంతమంది వారికి సంబంధించిన ప్రభుత్వోద్యోగులవల్ల, పోలీసుజులుంవల్ల బాధలు పడుతుంటారు. వారికి వృత్తులతో భద్రత లేదు. వారు పనిచేసే ప్రదేశాలు వారివి కావు. వాటిపై వారికి ఆక్రమణ హక్కులూ ఉండవు. వారికి జీవిత భీమాలేదు; ఆరోగ్య భీమావసతి అంతకన్నా మరణంకాని ప్రమాదం కాని వారికి సంభవిస్తే యజమానినుండి నష్టపరిహారం పొందటానికి వారికి అవకాశం లేదు. ఎందుకంటే వారికి వేరే యజమాని లేడు కనుక పని వారి నష్టపరిహార శాసనం వారికి వర్తించదు. సంఘటిత రంగంలోని పనివారికన్న వారి వేతనాల రేట్లు చాల తక్కువ. ఫ్యాక్టరీ యజమాని అంటూ ఒకడు లేడు కనుక వారు ఎవరినుండి గృహవసతిని కోరగలరు? విద్యుచ్ఛక్తికి నీటి వాడకానికి వారికి తక్కువ రేట్ల రాయితీ ఉండదు. అలా అన్ని అంశాలలో సామాన్య పౌరునిలాగా అన్ని అసౌకర్యాలను వారు అనుభవిస్తారు కాని తమ జీవనోపాధి నిమిత్తం ఎక్కువ గంటలు శ్రమించవలసి వస్తున్నది. అలాంటి స్త్రీలు లక్షల సంఖ్యలో ఉన్నారు. స్వయం ఉపాధికల స్త్రీలను కుటుంబంలోని పురుషులు శ్రామిక జంతువుల లాగా చూస్తున్నారు. వారిచేత బండచాకిరీ చేయిస్తున్నారు. ఆ స్త్రీలకు విధ్యుక్త ధర్మాలేతప్ప హక్కులు ఏనాడూ కుటుంబంలో లేవు.

అలాంటి స్త్రీల పరిస్థితిని మెరుగుపరచడానికి ఎలాంటి వ్యూహాన్ని చేపట్టాలి ? రెండు పద్ధతు లున్నాయి. ప్రజారంగంలోని కంపెనీలలో పని వారినిగా వారిని చేర్చుకోవటం ఒక పద్ధతి. అలాకాకుండా వారిని స్వయం ఉపాధి శ్రామికులుగానే ఉంచుతూ వారికి కావలసిన ముడిసరకులు కొనుగోలు చేయటానికి, తయారుచేసిన వస్తువులను మార్కెటింగు చేసుకోటానికి, అప్పులు తెచ్చుకోటానికి, సరకులు నిల్వచేసుకునే నిమిత్తం గిడ్డంగులు ఏర్పరుచుకోటానికి వారి కవసరమైన వినియోగ వస్తువుల కొనుగోలు వీటి అన్నింటిని సమకూర్చుకునే నిమిత్తం వారిని సహకార సంఘాలలో సమీకరించడం రెండవది. అంతేగాక అనారోగ్యం, ప్రమాదం, నిరుద్యోగం

ఏర్పడినప్పుడు భద్రత కలిగించే భీమా పథకాలనుకూడా ఈ సహకార సంఘాలు చేపట్టవచ్చును. ప్రథమ విధానం ఆచరణయోగ్యంకాదు. పరిపాలకులలో రాజకీయ సంకల్పం లోపిస్తున్నది. ప్రభుత్వ బొక్కసంలో తగినంత ధనము ఉండదు. ఎంతగా భద్రతా రాహిత్యానికి లోనవుతున్నా తామనుభవిస్తున్న కొద్దిపాటి స్వేచ్ఛను పోగొట్టుకోవటానికి స్వయం ఉపాధి కల శ్రామికులు అంగీకరించరు. కనుక రెండవ మార్గము మాత్రమే శరణ్యం. అదొక్కటి ప్రత్యామ్నాయం. స్వయం ఉపాధివర్గంలో సహకార భావన ఉదయిస్తేనే అది సుసాధ్యమవుతుంది. వారి పరిస్థితి బాగా లేదని వారు గ్రహించాలి; అంతటితో ఆగక తమ స్థితిగతులను బాగుచేసుకోవాలనే ప్రేరక భావం వారికుండాలి. దానికి అవసరమైన జాగృతి కావాలి. విపరీతంగా విలయతాండవం చేస్తున్న నిరక్షరాస్యత, రాజకీయ విద్యలేమి ఈ రెండూ వారి అభివృద్ధికి ఆటంకాలు. స్వయం ఉపాధి శ్రామికులకు ఎన్నో ఇబ్బందులు వారు ఎన్నో పరిమితులకు లోనయి పని చేయవలసి వస్తున్నది. కనుక వారిని సహకార రంగంలోకి దించడం అసాధ్యం కాకపోయినా చాల కష్టతరం. ఏదైనా అది సాధించవలసిన ఒక ఆదర్శం.

ఈ రకపు శ్రామికులకు సాయపడే నిమిత్తం ఇటీవల ప్రభుత్వం అనేక సహకార పథకాలను రూపొందించింది. ఖాదీ మరియు గృహ పరిశ్రమల బోర్డు, చేతికళల బోర్డు ఉద్భవించాయి. ఉద్దేశ్యం మంచిదైనా శ్రామికులు, ఉత్పత్తిదారులకన్నా ఈ సంస్థల ఉద్యోగులకే ఈ సంస్థల వల్ల లాభం చేకూరుతున్నదని చెప్పక తప్పదు. పెత్తందారీతనం ఈ సంస్థలలో వ్యాపించింది. నిజానికి యజమాని అయిన స్వయం ఉపాధి శ్రామికుడు, ఉత్పత్తిదారుడు, చేతిపనివాడు వీరిని ఆ సంస్థలలోని ఉద్యోగులు, ఆఫీసరు చిన్నచూపు చూస్తున్నారు. దీనిని జాగ్రత్తగా గమనించవలసి ఉంటుంది. దీనిని మదింపువేసి నివారణకు తగు చర్యలు తీసుకోవాలి.

స్వయం ఉపాధి శ్రామికులలో సహకార భావనను పెంపొందించడానికి ఈ సంస్థలు ఏనాడూ కృషిచేయలేదు. ఆ సంస్థలకు లక్ష్యాలను

నిర్ణయించుకోవడమూ, వాటిని సాధించుకోవడంతోనే సరిపోతున్నది. ఆ ప్రక్రియను అనుసరించే క్రమంలో ఆ సంస్థలయొక్క లక్ష్యాలను ఆదర్శాలనే మరచిపోవడం జరుగుతున్నది.

ప్రతి రాష్ట్రంలోనూ స్త్రీల ఆర్థిక కార్పొరేషనును ఏర్పాటుచేసినమాట వాస్తవం. అనేక వందల వృత్తులను గుర్తించడంకూడా జరిగింది. అయినా కష్టించి పనిచేసే వేలాది స్త్రీలు వీటివల్ల లాభం పొందలేదనేది వాస్తవం. పెద్దగా లెక్కలు తీసుకొని అధ్యయనం చేయకపోయినా దరహంమీద చూచినా ప్రభుత్వం ఈ కార్పొరేషనులవల్ల అట్టి స్త్రీలకు అందించిన మార్గ దర్శకత్వం, సహాయం, సాధనసంపత్తి అత్యల్పం అని చెప్పక తప్పదు.

## I. ప్రభుత్వం ఏమి చెయ్యగలదు? ఏమి చేయాలి?

ఈ సందర్భంలో అహమ్మదాబాద్‌లోని సేవా (S E W A) సంస్థ వారు జరిపిన సెమినారు నివేదిక పరిశీలించటం లాభదాయకం. వారి సిఫారసులు ఇలా ఉన్నాయి.

### 1. విధానం:

i) శ్రమ చేసే బీదవారికి అనుకూలంగా రక్షణ చర్యలను తీసుకొనే విధానాన్ని ప్రభుత్వం చేపట్టాలి.

ii) వారికి లాభించే పథకాలను రూపొందించటమేకాక, ఇపుడున్న పథకాలు, రాబోయే పథకాలు బీదలైన కష్టజీవులకు లాభించేలా చూడాలి.

iii) కష్టనష్టాలకు లోనుకాగల శ్రామికులకు రక్షణ ఇచ్చే ఉద్దేశ్యంతో ప్రభుత్వం పనిచేయటానికి ప్రారంభించాలి.

### 2. సంస్థాగత నిర్మాణం:

i) స్వయం ఉపాధి శ్రామికులు సహకార సంఘాలను, సంస్థలను నిర్మించుకోవడానికి అనువుగా నిబంధనలను సడలించి వెసులుబాటు కలుగజేయాలి.

సాంకేతిక విధానాలను అందులో మరిన్ని ఆ వృత్తి పరిస్థితులకు అనుగుణమైన సాంకేతిక పద్ధతులను-ప్రవేశపెట్టటానికి దోహదం చేయాలి.

10. చీకటిగా ఉండి, అనారోగ్య పరిస్థితుల్లో గాలి వెలుతురూ లేని ప్రదేశాలలో స్వయం ఉపాధి స్త్రీలు ఎవరికివారుగా పనిచేసే బదులు సహకార సంఘపు ఆరోగ్యకర వాతావరణంలో భవనాలలో పనిచేయడానికి అనువైన మానసిక వైఖరిని స్త్రీలలో పెంపొందించాలి.

11. శిశు సంక్షేమ సౌకర్యాలు :

శిశు పోషణను నిర్వహించగల సహకార సంస్థలూ సంఘాలూ ఏర్పడేవరకూ ప్రభుత్వం శిశు పోషణాలయాలను స్థాపించి నడపాలి. బీదలకు అందుబాటులో ఉండేటట్లుగా రుసుములు ఉండాలి. దీనివల్ల రెండు రకాలుగా లాభం. పనిచేసేటప్పుడు పిల్ల ఏమయిందోననే భయం తల్లిని పీడించదు. అంతేగాక చిన్నపిల్లలను ఆడించే బాధ్యత పెద్ద పిల్లలకు తప్పిపోయి వారూ చదువుకోవటానికి, ఆడుకోవటానికి అవకాశం కల్గుతుంది.

12. స్వయం ఉపాధి స్త్రీల విషయమై పరిశోధన :

స్వయం ఉపాధి స్త్రీల స్థితిగతులను పరిశీలించి, అధ్యయనంచేసి నివేదికలు సమర్పించటానికి-ఇతర సంస్థలు ముందుకురాని తరుణంలో-ప్రభుత్వమే ఆ బాధ్యతను చేపట్టాలి.

II. సంఘ సేవకులు ఏమి చేయగలరు ?

ఇంతవరకు సంఘ సేవకులు తమ దృష్టిని ప్రభుత్వోద్యోగాలలోని స్త్రీల సమస్యలమీదను, సంఘటిత రంగంలోని స్త్రీలపైనను కేంద్రీకరించారు. ఇపుడు స్వయం ఉపాధి స్త్రీల స్థితిగతులను పట్టించుకోవలసిన తరుణం ఆసన్నమయినది. అహమ్మదాబాద్‌లోని "సేవా" (SEWA) సంస్థ ఈ కృషిలో ముందున్నది.

## 5. ఆరోగ్య సౌకర్యాలు :

స్వయం ఉపాధి శ్రామికులకు ప్రత్యేకంగా ఒక ఆరోగ్యపథకాన్ని రూపొందించాలి; అమలుపరచాలి. సంధికాలంలో ఆరోగ్య వసతిని అందజేయాలి.

## 6. సంక్షేమం, విద్య :

i) స్వయం ఉపాధి శ్రామికుల సంతానానికి విద్యను అందించే నిమిత్తం ప్రత్యేకంగా గ్రాంటులు ఇవ్వాలి.

ii) స్త్రీ సంక్షేమ సంస్థలో భాగంగా స్వయం ఉపాధి స్త్రీలకు ప్రత్యేక సంక్షేమ విభాగాన్ని ఏర్పరచాలి.

## 7. శాసన పరంగా :

స్వయం ఉపాధి శ్రామికులు తమ హక్కులను గుర్తించే నిమిత్తం వాటిని అమలుపరచమని కోరేటందుకు వారిలో జాగృతి కలిగించటానికి ప్రత్యేక కృషి సాగాలి.

## 8. ఇతర సహాయ చర్యలు :

i) స్వయం ఉపాధి శ్రామికులు తయారుచేసే వస్తువులను వీలయినంతవరకు-ప్రభుత్వం కొనుగోలుచేసే విధానం ఏర్పడాలి.

ii) మార్కెటులో దొరికేదానికన్న తక్కువ ధరలకు వారికి అవసరమైన ముడి సరుకులను ప్రభుత్వం అందించాలి.

iii) అలాంటి శ్రామికులను ప్రోత్సహించే నిమిత్తం అనేక పథకాలను తయారుచేయాలి.

## 9. నూతన సాంకేతిక నైపుణ్యాన్ని ప్రవేశపెట్టుట :

స్వయం ఉపాధి శ్రామికుల పని భారాన్ని తగ్గించే నిమిత్తం నూతన

సాంకేతిక విధానాలను అందులో మరిన్ని ఆ వృత్తి పరిస్థితులకు అనుగుణమైన సాంకేతిక పద్ధతులను-ప్రవేశపెట్టటానికి దోహదం చేయాలి.

10. చీకటిగా ఉండి, అనారోగ్య పరిస్థితుల్లో గాలి వెలుతురూ లేని ప్రదేశాలలో స్వయం ఉపాధి స్త్రీలు ఎవరికివారుగా పనిచేసే బదులు సహకార సంఘపు ఆరోగ్యకర వాతావరణంలో భవనాలలో పనిచేయడానికి అనువైన మానసిక వైఖరిని స్త్రీలలో పెంపొందించాలి.

## 11. శిశు సంక్షేమ సౌకర్యాలు :

శిశు పోషణను నిర్వహించగల సహకార సంస్థలూ సంఘాలూ ఏర్పడేవరకూ ప్రభుత్వం శిశు పోషణాలయాలను స్థాపించి నడపాలి. బీదలకు అందుబాటులో ఉండేటట్లుగా రుసుములు ఉండాలి. దీనివల్ల రెండు రకాలుగా లాభం. పనిచేసేటప్పుడు పిల్ల ఏమయిందోననే భయం తల్లిని పీడించదు. అంతేగాక చిన్నపిల్లలను ఆడించే బాధ్యత పెద్ద పిల్లలకు తప్పిపోయి వారూ చదువుకోవటానికి, ఆడుకోవటానికి అవకాశం కల్గుతుంది.

## 12. స్వయం ఉపాధి స్త్రీల విషయమై పరిశోధన :

స్వయం ఉపాధి స్త్రీల స్థితిగతులను పరిశీలించి, అధ్యయనంచేసి నివేదికలు సమర్పించటానికి-ఇతర సంస్థలు ముందుకురాని తరుణంలో-ప్రభుత్వమే ఆ బాధ్యతను చేపట్టాలి.

## II. సంఘ సేవకులు ఏమి చేయగలరు ?

ఇంతవరకూ సంఘ సేవకులు తమ దృష్టిని ప్రభుత్వోద్యోగాలలోని స్త్రీల సమస్యలమీదను, సంఘటిత రంగంలోని స్త్రీలపైనను కేంద్రీకరించారు. ఇపుడు స్వయం ఉపాధి స్త్రీల స్థితిగతులను పట్టించుకోవలసిన తరుణం ఆసన్నమయినది. అహమ్మదాబాద్‌లోని "సేవా" (SEWA) సంస్థ ఈ కృషిలో ముందున్నది.

## III. స్వయం ఉపాధి శ్రామికులు తమకు తాముగా ఏమి చేసుకోగలరు :

స్వయం ఉపాధి శ్రామికులు అనేక ప్రదేశాలలో పనిచేస్తున్నారు. వారిలో ఐక్యత లేదు. వారి వృత్తి ప్రాతిపదికపై వారు సంఘటితమవటం అవశ్య కర్తవ్యం. ఇది సంఘాల యుగం. విశాల వ్యాప్తి గల ప్రభుత్వ యంత్రాంగం, శక్తివంతమైన బహుళార్థసాధక సంస్థలు, సంఘటిత రంగపు కూటములు, వడ్డీవ్యాపారుల, వ్యాపారస్థుల దురాశా పూరిత దోపిడి వీటిని ఏ ఒక్క వ్యక్తి ఎదుర్కొని నిలవలేడు. అలాకాక ఐక్యతగా ఉంటే వారి వాణిని ఇతరులకు వినిపించ గలుగుతారు ; వారి కోర్కెలను బహిర్గతం చేయగలరు. న్యాయాన్ని సాధించుకోగలరు. వారు తమ సంఘాలను నిర్మించ పూనుకోవాలి. అందులో ముఖ్యంగా సహకార సంఘాలను నిర్మించుకోవాలి. ఇది ప్రాథమిక చర్య. తతిమ్మావి తరువాత వస్తవి.

స్వయం ఉపాధి స్త్రీలు, సంఘసేవికలు, సంక్షేమాన్ని ఆశించే ప్రభుత్వ వ్యవస్థలు ఇవన్నీ కలసికట్టుగా ఐక్యతతో కృషిచేస్తే స్వయం ఉపాధి స్త్రీల కష్టాలు చాలవరకు తొలగిపోతాయి ; అంతేకాక వారి స్థితి గతులు మెరుగుపడతాయి.

(తే 31–3–85 దిన మహిళాభ్యుదయ సంస్థ హైదరాబాద్‌లో నిర్వహించిన "స్త్రీలు : ఉపాధి" అనే సెమినారులో పరిశోధనా వ్యాసం.)

# వనితలు : వృత్తులు

—ఎ.ఎల్. శారద

పారిశ్రామిక విప్లవం తర్వాత పని రంగస్థలం ఇంటినుండి ఫాక్టరీకి మారడంతో "అసలుకు పని గురించిన భావనే బాగా మారిపోయింది. అంతకుముందు కుటుంబంమొత్తం ఒకే ఉత్పత్తి యూనిట్‌గా, సాంఘికంగా ఒక శ్రేణి యివ్వబడిన వృత్తి చేస్తూ, సాంఘిక కట్టడంలో సజాతీయంగా యిమిడిపోయి వుండేది. అంటే కుటుంబ వృత్తి గుర్తింపు ప్రాతిపదికగా వుండేది. కాని సంస్థకు సంబంధించిన నిపుణతల దొంతరలో వ్యక్తి స్థితికాదు. పని రంగస్థలం ఇంటినుండి మారడంతో అది ఆడవాళ్ళ పై ప్రతికూల ప్రభావం చూపింది. మొదటగా, "పని" అంటే ఏదో ఇంటి బయట చేసేది అనే గుర్తింపు వచ్చింది. రెండవది, పని అంటే ఆర్థిక వ్యవస్థలో ప్రత్యేకస్థానం కలది (డబ్బు తెచ్చేది) అనే గుర్తింపు వచ్చింది. కనుక ఉపయోగపు విలువను మాత్రమే సృష్టించే ఆడవాళ్ళ యింటి పనులు, కనబడే రూపంలో ప్రతిఫలం పొందని ఈ పనులు, రోజువారీ వాడుక పనులతో ముడివడిన ఈ పనులు పనులుగా లెక్కకు రాలేదు. వాటిని పనికాని పని (non-work) గా లెక్కించసాగారు. అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాల్లో కంటె ద్వంద్వ ఆర్థిక విధానాలువున్న బడుగు దేశాల్లోనే స్త్రీల భాగస్వామ్యాన్ని యిలా బాగా తగ్గించి చెప్పడం జరుగుతున్నది. దీనిని "శ్రామికబలగం గురించి భావ నిర్మాణం, స్త్రీల ఆర్థిక కార్యకలాపాలను తక్కువ అంచనావేయడం" అనే తన వ్యాసంలో బనారియా (1981) సవివరంగా చర్చించాడు.

ఒక వ్యవస్థాపన (organizational) సంస్కృతి ఆవిర్భావంతో బాటు వృత్తిపరమైన అంతస్తుల దొంతరలోకూడ ఒక మార్పు వస్తుంది. కొన్ని వృత్తులు "సువృత్తులు లేక ఉన్నత వృత్తులు" (professions) గా "కులీన వృత్తులు"గా ఒక కొత్త గుర్తింపు సంతరించుకుంటాయి. ఈ సువృత్తీకరణ క్రమం (professionalisation process) కూడ పారిశ్రామికీకరణ క్రమంవలెనే ఆడవాళ్ళకు అనుకూలంగా లేనిదేనని మేమీ

వ్యాసంలో వాదిస్తాము. సువృత్తీకరణ అనేది ప్రాథమికంగా అధికారం, అదుపాజ్ఞలు పెరిగిపోయే ఒక క్రమం. ఈ క్రమంలో సాంఘిక వ్యవస్థ మొత్తంపై చూస్తే తక్కువ అధికారం కలిగివున్న స్త్రీలు అంతకంతకూ ఎక్కువగా అధికారం, అదుపాజ్ఞలు పూర్తిగా లుప్తమైన స్థితిగతులకు నెట్టివేయబడతారు. ఇది ఉద్దేశ్యపూర్వక వివక్షా విధానంవల్ల కాకపోవచ్చు; అయితే కనీసం పనిచేసే స్త్రీల మనుగడకు సంబంధించిన అవశ్యక పరిస్థితుల వల్లనైనా యిలా జరిగి తీరుతుంది.

సువృత్తికి సంబంధించిన మూలకాలను గురించి అతి క్లుప్తంగా యిక్కడ యోచిద్దాము. విజ్ఞానం, నిపుణతలు క్రమబద్ధంగా అలవర్చుకోవడంపై ఆధారపడిన వృత్తులవి. ఇతర వృత్తులకు వీటికి తేడా ఏమిటంటే ఈ సువృత్తులు తాము సమర్పించే సేవల వుత్పత్తి, పంపిణీ, వాడకాలపై అదుపాజ్ఞలు కలిగివుంటాయి. కఠినమైన ప్రవేశ నిబంధనలు, సుదీర్ఘమైన, బాగా ప్రత్యేకీకృతమైన సాంఘికీకరణ క్రమాల ద్వారా, స్వయంప్రతిపత్తి లేక ఆత్మానుశాసనం, విపణిపై గుత్తాధిపత్యాల సాయంతో మామూలు మనుషుల శోక్యాన్ని, అదుపును జయప్రదంగా అడ్డుకొనడంద్వారా ఈ సువృత్తుల ప్రత్యేక ప్రతిపత్తుల్ని సంరక్షించుకుంటారు. రాజకీయ ఎత్తుటెత్తుల ద్వారా, కులీనవర్గాల గుర్తింపుద్వారా, ఒకానొక మాయాకరణ క్రమంద్వారా (దీనికి సాంకేతిక, జ్ఞానపర ప్రాతిపదికలుకూడ వుంటాయి) సువృత్తిదారుకు, అతని సేవలుపొందే వ్యక్తికి (ఖాతాదారు client) మధ్య సాంఘిక దూరాన్ని పెంచడంలో కృతకృత్యం అవుతారు. తద్వారా ఈ లక్ష్యాల్ని సాధించుకుంటారు. సువృత్తి బృందాల సభ్యులు అత్యధికభాగం ఎగువ వర్గాలనుండి, ఆధిపత్య ప్రజాతి బృందాల నుండి వచ్చినవారే హెచ్చుగా ఆధిపత్య మనోప్రవృత్తి కలిగి వుంటారు. (జాన్సన్ : 1979)

వనితలు, సువృత్తుల మధ్య సంబంధాన్ని రెండు దృక్కోణాల నుండి చూడవచ్చు. ఒకటి పూర్తి హంగులు గల వృత్తులు-వైద్యం, న్యాయం, విద్యా విషయాలు మొదలైన సువృత్తులలో స్త్రీల స్థితి గురించి

రెండవది, సగం హంగుల సువృత్తులు నర్సింగు, విద్యాబోధన, కార్య దర్శినిని మొదలైన వాటిలో వారి స్థితి గురించి, వాటిని పూర్తి హంగులు గల సువృత్తులుగా మార్చే ప్రయత్నాలను గురించి—

మొదటగా అన్ని హంగులు గల సువృత్తుల్లోకి ప్రవేశించే స్త్రీల ముందుండే పదవీ ఎంపిక విధాలను, నమూనాలను గురించి యోచిద్దాం. ఇవన్నీ సాంఘిక కట్టడంలో వారి స్థానాన్నిబట్టి చాలవరకు నిశ్చయింప బడుతాయి. స్త్రీలందరూ తమ పదవుల ఎంపికలో ఆగంతుక వైఖరిని అవలంబిస్తారని సిల్వర్ స్టోన్ (1980) అభిప్రాయపడతాడు. "పెళ్ళి, పిల్లలు పుట్టడం, ఊళ్ళు మారాల్సి రావడం మొదలైన ఏ అనిశ్చిత స్థితి ముంచుకొచ్చినా వెసులుబాటు యిచ్చే అవకాశాలు ఎక్కువగావున్న సువృత్తులనే స్త్రీలు ఎంపిక చేసుకుంటారనేదే ఈ ఆగంతుక వైఖరి అంత రార్థం." (పు. 29) ఒక ఉదాహరణ చూపాలంటే నేడు నిజంగా ప్రపంచం మొత్తంమీద ఎక్కడచూచినా స్త్రీలు ఏ యితర వృత్తులకంటే వైద్యం, విద్యాబోధనా వృత్తులపట్ల ఎక్కువగా ఆకర్షితమవడం గమనిస్తాము. ఎందుకంటే, (1) స్త్రీలు సున్నితంగా, మనోద్రేకాలకు ప్రతిస్పందించే విధంగా వుంటారనే ప్రతిష్టకు; (2) స్త్రీల "తల్లి" పాత్రకు తగినట్లు పొందికగా, మరింత వెసులుబాటు నిస్తూ అవి (వైద్యం, విద్యాబోధనా వృత్తులు) వుండడమే కారణం. సువృత్తిరంగంలో స్త్రీల శక్తిసామర్థ్యాలను గురించి సర్వత్రా సందేహాలు వ్యక్తమవుతున్నాయి. స్త్రీలకు కొన్ని జీవ విజ్ఞాన సంబంధ విధులున్నాయనే భావనే దీనికి కారణం. పిల్లల్ని కనడం, సాకడంలాంటి విధులు వృత్తి నిర్వహణకంటె ప్రాధాన్యత వహిస్తాయని ఈ అభిప్రాయం అంతరార్థం. కనుక స్త్రీలు తమ ఉపాధుల్ని నిరంతరాయంగా కొనసాగించకుండా యింకా ఇంటిపనులు, అత్త మామల ఆదేశాలు అడ్డుకొంటూనే వున్నాయి. ఆడదాని పదవీ సరళి మగవాడి పదవీ సరళికి భిన్నమైనదని సిల్వర్‌స్టోన్, వార్డ్‌లు (1981) పేర్కొంటారు. మగవాని పదవి ఒకవిధంగా అవిచ్ఛిన్నంగా విద్యనుండి శిక్షణనుండి, పనినుండి పదవీ విరమణదాకా అలాఅలా ముందుకు సాగి పోతూ వుంటుంది. కాగా అత్యధికభాగం ఆడవాళ్ళ పదవి విద్య-శిక్షణ-పని-అంతరాయం-తిరిగి శిక్షణ-తిరిగి పని-పదవీ విరమణ క్రమంలో అంత

రాయాలతో సాగుతుంది. గర్భధారణ, పిల్లల్ని కనడం, సాకడాలకు సంబంధించి స్త్రీలు అనివార్యంగా గడపవల్సి వచ్చే కాలాన్నిబట్టి, భర్త పదవికి అధీనమై స్త్రీ పదవి వుండడాన్నిబట్టి, పర్యవసానంగా వుండవల్సిన భౌగోళిక చలనశక్తినిబట్టి స్త్రీల పదవిలోని ఈ అంతరాయాలకు వివరణలు యిస్తారు. అయితే ఈ అంతరాయంవల్ల కొన్నికొన్నిసార్లు దీర్ఘకాలాల పాటు తిరిగి శిక్షణ పొందవల్సిన అవసరం రావచ్చు. అలాగే తాజాగా ప్రవేశించే యువవృత్తిదారుల పోటీకి తట్టుకుని తిరిగి ఉపాధి సంపాదించడంకూడ కష్టమే కావచ్చు. బాగా ప్రత్యేకీకృతమై వున్న ఎలెక్ట్రానిక్స్‌కు సంబంధించిన మైక్రోవేవ్స్ రంగం, వైద్యంలో శస్త్రచికిత్స మొదలైన రంగాల్లో వున్న స్త్రీలకైతే ఉపాధి సంబంధ చలనశక్తి (mobility) పరిమితంగానే వుంటుంది. ప్రతిచోటా తగిన యజమానులు దొరకడం కష్టం. ఇలాంటి సందర్భాల్లో సాధారణంగా స్వయం ఉపాధి కల్పన అనేది ఎంతో ఖర్చుతో కూడుకునివుంటుంది కూడ. ఈ సందర్భంగా తాము నిర్వహించవల్సిన పాత్రల మధ్య రాజీ అంటే నిజానికి ఏదో ఒక పాత్రను పూర్తిగా వదులుకోవడమే అవుతుంది. అంటే శిక్షణాక్రమంలో పోసిన డబ్బులన్నీ వృథాఅయినట్లే నన్న మాట.

పదవుల ఎంపికకు సంబంధించిన ఆగంతుక పైఖరి (Contingency Approach) స్త్రీలను ఏవో కొన్ని సువృత్తుల రంగాలకే పరిమితం చేస్తుంది ; పోటీ బాగావుండే రంగాల్లో పదవులకోసం దుడుకుగా ప్రయత్నించడాన్ని నిరుత్సాహపరుస్తుంది. భారతదేశంలో వైద్యురాంద్ర ఉదాహరణ ఆసక్తికరంగా వుంటుంది. ప్రతి 10 మగ డాక్టర్లకు ఒక ఆడ డాక్టరు చొప్పున ఈ రోజు మన దేశంలో ఆడ డాక్టర్లు వున్నారు. ప్రత్యేక నిపుణతలు గడించే ఆడ డాక్టర్లలో 50% మంది ప్రసూతి శాస్త్రము/స్త్రీ రోగ చికిత్సా విజ్ఞానాల్లో కేంద్రీకరిస్తారు. మంత్రసానుల సాంప్రదాయమూ, పాశ్చాత్య వైద్యపు ఉన్నత హోదా రెండూ ఈ రంగాల్లో మేళవించి వుండటమే దీనికి కారణం. శిశు వైద్యము, మత్తు వైద్యము, రోగ నిర్ణయము, అడియాలజీ మొదలైనవి మహిళా డాక్టర్ల తర్వాత ప్రాధాన్యతలుగా వుంటాయి. స్త్రీ శస్త్ర వైద్యుల్ని అతికష్టంమీదగాని ఆమోదించరు. శస్త్ర చికిత్సారంగం

అంతా పురుష ప్రపంచమే. కనుక శస్త్రచికిత్స వైపు ఆడ డాక్టర్లు అసలు ఉత్సాహమే చూపించరు. (జాయిస్ లెబ్రా, యితరులు 1984). ఈ విధంగా ఒక ప్రత్యేక వృత్తిలోనే తక్కువ అధికారంగల, తక్కువ ప్రతిష్ఠా కరమైన ప్రత్యేక రంగాలకు స్త్రీలను నెట్టివేస్తుంటారు. లింగపర నమూనాలు తిరిగి వృత్తిపర నమూనాలుగా తలయెత్తుతాయి. ఆధిపత్యం, స్వాతంత్ర్యం, సమర్థత కలిగినవారుగా భావించబడే పురుషులను (యిలాంటి భావనల్ని బలవత్తరంచేసే) సువృత్తుల్ని ఆచరించే వారుగా కూడ చూడడం జరుగుతుంది. కుటుంబంలో ద్వితీయులుగా, సహాయక, పోషక, ఘర్షణా పరిష్కారక పాత్రలను పోషించేవారుగా చూడబడే స్త్రీలు వనిరంగంలోకూడ అలాంటి పాత్రలే వహించాలని ఆశిస్తారు.

వ్యవస్థాగతమైన లేక ఆపాదించబడే స్వభావంకల (ascriptive) వృత్తులకంటె ప్రైవేటు ప్రాక్టీసును అనుమతించి, స్వతంత్ర కృషిని సాధ్యంచేసే వైద్యం, విద్యాబోధన, విద్యావిషయాలు, న్యాయం మొదలైన స్వేచ్ఛావృత్తులను అవలంబించడానికే స్త్రీలు మొగ్గు ఎక్కువగా చూపుతారని మనం ఈ వరకే గమనించాము. పేరుకు తగ్గట్లే వ్యవస్థాగతమైన సువృత్తులు కేవలం ఏదో ఒక వ్యవస్థ లేక సంస్థలో మాత్రమే ఆచరించబడుతాయి. వుదాహరణకు మేనేజిమెంటు పద్ధతులు, పరిపాలనా పద్ధతులు యిలాంటివే. ఇక్కడ ప్రైవేటు సంప్రదింపులకు అతి తక్కువ అవకాశం మాత్రమే వుంటుంది. ఈ సువృత్తుల్లో పదవీ ప్రగతి సంస్థాగత వుద్యోగాలనుబట్టి ఆధారపడి వుంటుంది. ప్రభుత్వోద్యోగాలు (పౌర సేనలు, సివిల్ సర్వీసులు), మేనేజిమెంటు కోర్సుల్లో ప్రవేశించే స్త్రీల సంఖ్య చాల పరిమితం. పైగా చేరే తర్వాత మధ్యలో విడిచిపెట్టేవాళ్లు కూడ ఎక్కువే. [జాయిస్ లెబ్రా తదితరులు] ఆపాదించబడే స్వభావం గల వృత్తుల్లో మహిళల భాగస్వామ్యం చాల తక్కువే. ఉదాహరణకు పోలీసుల్లో, సైన్యంలో స్త్రీల సంఖ్యనే చూడండి. ఈ వృత్తుల్లో నిరంకుశాధికార, సువృత్తిపర మూలకాలన్నీ గరిష్ట పరిమితుల్లో వుంటాయి. ఇక్కడ వ్యవస్థలుకూడ వృత్తిపర సంస్థలుగా వుంటాయి. సిబ్బంది పదవీ స్థితిగతులు సంస్థకే ఎంతో సన్నిహితంగా ముడిపడివుంటాయి. తమ నిపుణతల్ని అదేమేరకు ప్రయోగించి చూపేందుకు అవకాశమిచ్చే

ప్రత్యామ్నాయ సంస్థలేవీ ఈ సిబ్బందికి లభ్యమై వుండవు. ఈ వృత్తుల్లో స్త్రీలు ప్రవేశించకుండా లాంఛనంగా నిషేధం వుంటుంది. భారతదేశంలో స్త్రీలు పోలీసుశాఖలో వున్నతోద్యోగాల్లో ప్రవేశిస్తున్నా, అవిమినహాయింపు సందర్భాలే. ఇంజనీరింగు, వాస్తుశాస్త్రం, గణకశాస్త్రం మొ॥ వృత్తుల్లో పని చేసే ఆడవాళ్లకు స్థిరంగా పాదుకుపోయిన మగ నమూనాల్ని సవాలుచేయడము చాలకష్టమౌతున్నది. క్లయింట్లతో, సహచరులతో, యితరులతో కలివిడిగా వుండడంలో వాళ్ళకెదురయ్యే చిక్కులు, పనిరంగంలో ఎప్పుడూ హాజరై వుండాల్సిన అవసరం, వాళ్ళ తీరిక సమయంలోకూడ వచ్చిపడే పని పిలుపులు మొదలైన చిక్కులవల్ల ఆడవాళ్ళు మరిన్ని యిబ్బందులకు లోనవుతారు. ఇలాంటి వృత్తులను ఏమైనా ఎన్నుకొంటే అందులో గుర్తింపు సంపాదించడానికి వాళ్లు అదనంగా కృషిచేసి కృతకృత్యులు కావాల్సి వుంటుంది.

ఇప్పుడు మనం సగం హంగుల సువృత్తులను (semi-professions) గురించి (వృత్తులుకాని వృత్తులను గురించి) పరిశీలిద్దాం. వృత్తుల దొంతరలో యివి అట్టడుగుకు పడివుంటాయి. ఈ వృత్తుల్లో సాంకేతిక, జ్ఞానపర ఉత్పాదకాలు పరిమితంగానే ప్రవేశిస్తాయి. అవి సహాయక విధుల్ని నిర్వహించాల్సి వుంటుంది. ఒక ఆధిపత్య బృందానికి లేక సువృత్తికి అవి లొంగి వుంటాయి. ఈ వృత్తి బృందాల్లోని సభ్యులు ప్రధానంగా విశేషాధికారాలు లేని తరగతులనుండి వస్తారు ; వీరిలో స్త్రీలు కూడ ఒక భాగం. సాంకేతిక, జ్ఞానపర ప్రాతిపదిక పరిమితంగా వుండడంతో మాయచేయడానికి (Mystification) అంత అవకాశం వుండదు. మరి క్లయింట్లను అదుపులో వుంచుకోవడానికి యిదీ (మాయచేయడమే) ప్రధాన పద్ధతి అని అందరికీ తెలుసు. పోతే ప్రధాన వృత్తికి లొంగి వుండవల్సిరావడంతో ఈ అర్థ వృత్తులకు స్వయంశాసనా అవకాశాలుకూడ పరిమితంగానే వుంటాయి. వాటిల్లో వేతనాలు తక్కువగా లభిస్తాయి. గ్లామర్ (ఆకర్షణ) అంతగా వుండదు. వాటి సేవలు యిదివరకు యిళ్ళల్లో లభించినవే. కనుక ఈ అర్థ వృత్తులకు కులీన వర్గాలనుండి అంతగా గుర్తింపు లభించదు. కనుక పోటీల్లో పనిచేసేవారు అధికార బృందాలుగా

లేక వత్తిడి బృందాలుగా (power groups or pressure groups) వుండలేరు.

ఈ అర్ధ వృత్తులను సువృత్తులుగా మార్చే క్రమంలో స్త్రీలను వృత్తుల దొంతరలో మరింత అడుగుకు నెట్టేయడం జరుగుతుందని, పురుషులు, యితర విశేషాధికారాలు గల వర్గాలతో కూడుకున్న ఒక కొత్త సువృత్తిదారుల బృందం వారిపై ఆధిపత్యం చెలాయిస్తుందని రోజ్ మేరీ డీమ్ వాదిస్తున్నది. వుదాహరణకు నర్సుల వృత్తినే తీసుకుందాం. ఒక "తల్లి"లా, అనుభవమున్న మనోవిశ్లేషణా శాస్త్రజ్ఞునిలా, సమర్ధుడైన పరిపాలనావేత్తలా రోగులను చూచుకొనాలనేది నర్సింగు వృత్తి ఆదర్శం. అయితే తల్లి పాత్రను ఎక్కువగా ధరించే, అత్యధిక భాగం మహిళలే అయినా "అగ్జిలరీ నర్సు మరియు మంత్రసాని స్కీము"వారిని అర్ధ వృత్తిదారులుగా భావిస్తుండగా, యితర రెండు పాత్రలు (మనోవిశ్లేషణ, పరిపాలన) ధరించే నర్సింగు సూపరింటెండెంటు తదితరులకు వీరిలో అత్యధికభాగం మగవాళ్లకే వున్నత వృత్తి హోదా యిస్తారు. వీరైనా వృత్తియొక్క సాంకేతిక ప్రాతిపదిక మెరుగుపడుతున్నప్పుడు, అందు మూలంగా ఆ వృత్తి బృందం బేరమాడే శక్తి మెరుగైనప్పుడు, అప్పుడే మనవాళ్ళు ఆ వృత్తిలో ప్రవేశిస్తుంటారని డీమ్ (Deem) వాదం. ఈ దశలో వృత్తితత్వం హెచ్చుస్థాయిలో వుంటుంది; వృత్తిదారుల సమరశీలతకూడ అధికంగానే వుంటుంది.

స్త్రీలు వ్యవహార దృక్పథంలో మగవాళ్ళకంటే తక్కువ వృత్తి తత్వాన్ని కలిగి వుంటారని అనేక అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి. ఈ అంశం గురించికూడ యిక్కడ చర్చించదల్చుకున్నాను. వృత్తితత్వం గురించిన సూచికల్ని సక్రమంగా ఎంపికచేసుకోక పోవడంవల్లే యిలాంటి తీర్మానాలకు రావడం జరుగుతున్నది. ఎన్ని వృత్తిపర సమావేశాలకు హాజరయ్యారు, ఎన్ని పత్రికలు చూసారు, ఎన్ని పరిశోధనా పత్రాలు ప్రచురించారు మొదలైన అంశాలపైనే ఎక్కువగా కేంద్రీకరించి చూడడం వలన, ఆడవాళ్ళకంటె మగవాళ్ళే మంచి వెలుగు వెలుగుతున్నట్లు ఆ భావన కలుగుతుంది. అలాకాకుండా సేవాదృక్పథంపై తగువిధంగా కేంద్రీకరించి

చూస్తే ఫలితాలు మరోలా వుంటాయి. కర్తవ్యాలపట్ల నిబద్ధత, పనిలో సాధించే ఫలితం, క్లయింట్లతో సంబంధాలు మొదలైన అంశాలపై కేంద్రీకరిస్తే అప్పుడు పురుషుల, స్త్రీల వృత్తితత్వాల గురించి మరింత సమతూకమైన దృష్టి అలవర్చుకోగల్గుతాము.

వృత్తుల దొంతర సంఘంలోని అంతస్తుల దొంతరపై ప్రతిబింబమే కనుక సంఘంలో సాంకేతిక ప్రాతిపదిక, విలువ దృక్పథాలు, అధికార సంబంధాలు, అలాగే ఇంటివద్ద బాధ్యతా విభజన మొదలైన అంశాల్లో బహుముఖ మార్పులువస్తే తప్ప ఈ వృత్తుల దొంతరలో ఏ తీవ్ర మార్పులనూ ఆశించలేము. ఆడవాళ్ళుకూడ కులీన వృత్తుల్లో ప్రవేశిస్తున్నారని పొంగిపోవడం భావ్యంకాదు. మహిళావికాసానికి అడ్డుగా నిలిచే సాంఘిక కట్టడ అసమానతల్ని, బాగా పాతుకొనిపోయివున్నా సాంఘిక దురభిప్రాయాలను తొలగించడానికి మనం చైతన్యయుతమైన ప్రయత్నాలుచేసి, సఫలంకాగల్గినప్పుడే అలాంటి ఆత్మసంతృప్తికి అర్థం వుంటుంది.

(తే 23-3-85 ది) హైదరాబాద్ విశ్వవిద్యాలయం వారు నిర్వహించిన "స్త్రీలు : పని" అనే సెమినారులో సమర్పింపబడిన వ్యాసం)

---

# అసంఘటిత రంగంలో స్త్రీలు

ఎ. కె. రాఖులాదేవి

సమాజపు శ్రమలో తమవంతు భాగస్వామ్యానికి తగినట్లుగా స్త్రీలు సమాజంలో స్థానాన్ని ఆక్రమించాలంటే స్త్రీలు పనిని వాస్తవిక పద్ధతితో అంచనా వేస్తేనే అది సాధ్యమని కొందరు వాదిస్తున్నారు. ఇవి రెండు చిక్కు ప్రశ్నలను లేవనెత్తుతుంది. ఇంటా, ఇతరత్రా స్త్రీ యొక్క వేతనం పొందని పనిని ఎలా లెక్కకట్టాలనేది మొదటిది. కొట్టవచ్చినట్లు

కన్పడే స్త్రీ యొక్క ఈనాటి శోచనీయ స్థితికి ఏది కారణభూతం? స్త్రీ మొదల వివక్షా లేక ఆర్థిక పరిస్థితులా ?

1981 జనాభా లెక్కల ప్రకారం స్త్రీలు జనాభాలో 48.2 శాతం. 68.4 కోట్లలో వారు 33 కోట్లు. మొత్తం శ్రామికులలో స్త్రీలు 20.85 శాతం మాత్రమే. అభివృద్ధిచెందిన దేశాలలో అది 40 నుండి 45 శాతం వరకు ఉంటుంది. గ్రామీణ ప్రాంతాలలో 1971 లెక్కల ప్రకారం శ్రామిక స్త్రీలు శ్రామికులలో 15.9 శాతం వుండేవారు. ఆ సంఖ్య 1981 నాటికి 23.09 అయింది. 1971-81 దశకంలో ఆర్థిక కార్యక్రమాలలో స్త్రీలు ఇతోధికంగా పాల్గొన్నారన్నమాట.

గ్రామీణ స్త్రీలు ముఖ్యంగా వ్యవసాయ కూలీలుగాను, రైతుగాను ఆర్థిక కార్యక్రమంలో పాల్గొంటున్నారు. వ్యవసాయం, పశుపోషణ, అడవుల పెంపకం, చేపల పరిశ్రమ, తోటలను, ఫలవృక్షాలను పెంచటం మొదటి రంగానికి చెందినవి. గ్రామీణ శ్రామిక స్త్రీలలో 79 శాతం ఈ రంగంలో పనిచేస్తున్నారు. అందులో 46 శాతం వ్యవసాయ కూలీలు గాను, 33 శాతం రైతులుగాను పనిచేస్తున్నారు. రెండవ రంగంలో 5 శాతం, మూడవ రంగంలో 16 శాతం కృషిచేస్తున్నారు.

ఎక్కువమందికి ఉద్యోగాలను సమకూర్చగలగడం వలననూ, అదీ గాక పనికి ఎక్కువమంది [అంటే యంత్ర పరిశ్రమతో పోలిస్తే] శ్రమ చేయవలసి ఉంటుంది గనుకనూ, చేనేత పరిశ్రమ [నేతకు ముందుగా జరుగవలసిన పనులు], చేతిపనులు, గ్రామీణ పరిశ్రమలు స్త్రీలకు ఉద్యోగావకాశాలను, తమ నేర్పును వినియోగించటానికి అవకాశాలను ఇస్తున్నాయి. 1981 జనాభా లెక్కల ప్రకారం స్త్రీలలో అక్షరాస్యత 22.88 శాతం. పురుషులలో ఆ శాతం 47. అందువలన స్త్రీలకు ఉద్యోగావకాశాలు సన్నగిల్లుతున్నాయి. గృహ నిర్మాణం, వర్తకం, వ్యాపారం, రవాణా, గిడ్డంగి, ప్రసార యంత్రాంగం యింకా యిలాంటి వాటితో కూడిన తృతీయ రంగంలో స్త్రీలు 16 శాతం వరకే ఉన్నారు. విద్య, నేర్పు లేమి ఇందుకు కారణభూతమయింది. ఖాదీ గ్రామోద్యోగ

గాక ఆడపై మగ పెత్తనానికికూడ వర్తిస్తుందనేది కూడ స్త్రీ పురుషులు సాధారణంగా గ్రహించలేకపోతారు.

రెండు సువిశాలమైన సాంఘిక కూర్పులు/లేక వర్గాల గురించి మార్క్స్ యోచించాడు. వాటిల్లో ఎక్కువ సంపన్నమైనది, ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం, ఆధిపత్యం గల వర్గమే (పరస్పర) సంబంధాలను నిశ్చయిస్తుందని భావించాడు. అయితే ప్రతివర్గంలోకూడ గణనీయమైన అంతరా లుంటాయి. ఈ సాధారణ వర్గీకరణ ఆ అంతరాలను దాచిపెడుతుంది. యాజమాన్య వర్గంలోని సభ్యులంతా యజమానులు కారు. ఈ విలాసవర్గంలోకూడ స్త్రీలపై యాజమాన్యం (దాదాపు) పురుషులదే. వాళ్ళు పురుష ప్రణయం దయాదాక్షిణ్యాలపై బతకాల్సివచ్చే ఒకానొక అధికారవిహీన కార్మికవర్గంలాగ వుంటారు. కార్మిక వర్గాలలోకూడ ఈ పురుషులు స్త్రీలపై యాజమాన్యం, పెత్తనం చెలాయిస్తుంటారు. ఈ రెండు సందర్భాల్లోకూడ, స్త్రీ పురుషుని అంతగానూ చదువుకుని వున్నా, అంతగానూ సంపాదిస్తున్నా ఒకలెక్కలోకి రాదు. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం వున్నా, కుటుంబంలో లేక కుటుంబం వెలుపల పురుష సభ్యులతో యిచ్చిపుచ్చుకోళ్ళను నిశ్చయించే అధికారం స్త్రీకి వుండదు. కనుక సాంఘిక వాస్తవికత నిజ స్వభావాన్ని అర్థంచేసుకోవాలంటే అధికార సారవిజ్ఞానానికి, జ్ఞాన మీమాంసకు మధ్య భౌతికవాద, మహిళావాద మార్గంలో ఒక నూతన సంబంధం నెలకొల్పాలి. "మహిళల స్థితి/పాత్ర/హోదా"లను విశ్లేషించేందుకు బదులు వివిధ ఉత్పత్తి విధానాలలో గృహశ్రమ (ఇంటి పని) ఎలా ప్రత్యేకంగా అభివ్యక్తమవుతున్నదో శ్రద్ధగా పరిశీలించాలి.

* * * * * *

ఫ్యూడల్ విలువలకు అంటిపెట్టుకొని వుంటూ అంతకంతకు అధికంగా పెట్టుబడిదారీ విధానానికి మారే ఒక సమాజంలో "స్త్రీలను స్త్రీలుగా ఒక ఏకరీతి విశ్లేషణాత్మక తరగతి"గా ఊహించుకోలేము. అంతకంటే "ఉత్పత్తి సాధనాల యాజమాన్యం" అనే నికషం (Citerion) తో మొదలుపెట్టి చరి

మూడు దశాబ్దాలనుండి శ్రామిక జనాభాలో స్త్రీల భాగస్వామ్యం ఇంచు మించుగా 28 శాతంగానే ఉంటున్నది. పురుషుల భాగస్వామ్యం 57 శాతంగా స్థిరంగా ఉంది. సంఘటిత రంగంలో 1971 లో స్త్రీల భాగ స్వామ్యం 11 శాతం. 1981 లో 12.4 శాతం అన్ని రంగాలలోను కొందరు స్త్రీలు ఉన్నత స్థానాలను పొందగలిగారు.

కాని మొత్తంమీద, స్త్రీలు తక్కువస్థాయి ఉద్యోగాలలోను, తక్కువ వేతనం వచ్చే పదవులలోను, బండచాకిరితో కూడిన పనులలోను జీవనోపాధి కోసం పనిచేయువలసి వస్తున్నది. ఒక్క కట్టడాల రంగంలో తప్ప అన్ని అసంఘటిత రంగాలలోను 1975-79 కాలంలో శ్రామిక స్త్రీల సంఖ్య పెరిగింది.

స్త్రీ యొక్క పరాధీన జీవితానికి రెండు కారణాలు కన్పడుతున్నాయి. (1) ఆమె సంతానం కనగల జీవిత దశలో ఆమె చాలకాలంవరకు సమర్థ వంతంగా పనిచేయలేకపోవటం. (2) స్త్రీల శ్రమకు డిమాండు లేక పోవటం. స్త్రీలను కార్మికులుగా నియమించటానికి యజమానులు విముఖత చూపటం.

పూర్వకాలంలో, నైపుణ్యం అవసరంలేని లేక అంతగా నైపుణ్యం అవసరంలేని వృత్తులలో అంటే ఆయాలుగా, నీరు తెచ్చేవారుగా, చేపలు అమ్మేవారుగా స్త్రీలు పనిచేసేవారు. 1980-81 లో సంఘటిత రంగంలో కార్మికుల సంఖ్య 22.83 మిలియన్లు. స్త్రీ కార్మికుల సంఖ్య 2.76 మిలి యన్లు. అంటే మొత్తం కార్మికులలో 12.4 శాతం మాత్రం. భారతదేశంలో శ్రామికుల సంఖ్య 265 మిలియన్లు అయితే స్త్రీల సంఖ్య 87 మిలియన్లు మాత్రమే. అంటే మూడవ వంతు అన్న మాట.

సంఘటిత రంగంలో పని పరిస్థితులు వేతనాలు మెరుగు అవుతున్న కొలదీ సంప్రదాయంగా స్త్రీలు చేసే పనులకు పురుషులు ఎగబ్రాకు తున్నారు. జవుళి పరిశ్రమలో, జనపనార పరిశ్రమలో గనులతో ఇలా జరిగింది. ఈ శాఖలలో స్త్రీల శాతం గత రెండు దశాబ్దాలలో 60 నుండి

60 కి పడిపోయింది. బీడీలను, అగరువత్తులను తయారుచేసే పరిశ్రమల లోను ఇంకా తదితర పరిశ్రమలలోను వేతనాలు తక్కువగా ఉంటున్నాయి. పని పరిస్థితులు అధ్వాన్నంగా ఉంటున్నాయి. వీటిలో మాత్రం శ్రామికులలో స్త్రీలు 50 నుండి 60 శాతంగా ఉంటున్నారు.

దేశంయొక్క సామాజిక ఆర్థికాభివృద్ధి జరుగుతున్నకాలంలో ఆధునిక పారిశ్రామికీకరణవల్ల అనేక మార్పులు వచ్చాయి. అంతకు క్రితం సంపాదించుకోవడానికి స్త్రీలకు కల అవకాశాలు మృగ్యమయినయి. ఉదాహరణకు దంపుడుబియ్యం బదులు మరబియ్యం వాడుకలోకి వచ్చింది. అప్పడాలు వడియాలకు బదులుగా ఫ్యాక్టరీ రొట్టె, బిస్కట్లు వచ్చాయి. దీంతో స్వయం ఉపాధి కల అనేకమంది స్త్రీలు నిరుద్యోగులయ్యారు.

గ్రామీణ స్త్రీలు ఆర్థిక ఉత్పత్తిలో పాల్గొంటున్నారు. కాని సమస్య ఏమంటే వారి కృషివలన ఆదాయం వస్తురూపకంగా కాని ధనరూపంగా కాని వస్తున్నదా ? అది వ్యాపారానికి దోహదం చేస్తున్నదా ? వాటిపై స్త్రీలకు అదుపు ఉంటున్నదా ? స్త్రీలు సాగించే ఉత్పత్తియుత కార్యక్రమాలలో ఎంతో వైవిధ్యం కనిపిస్తున్నది. పిడకలుచేసి సంతలో అమ్మటం, పశువులకు బలం వచ్చేటట్లు పెంచటం, ధాన్యం కూలిగా తీసుకొని వడ్లు దంచడం, చాపలు, పట్టాలు, అల్లడం, వడ్డీకి ధాన్యాన్ని అప్పు ఇవ్వడం స్త్రీలు సాగిస్తున్న పనులు.

ఎక్కువమంది శ్రామికులకు ఉపాధి కలిగించే చిన్న తరహా లేక మధ్యతరహా గ్రామీణ పరిశ్రమలు, భారీ పరిశ్రమలతో పోలిస్తే, తక్కువ సామర్థ్యంతో పనిచేస్తాయనే వాదన వినబడుతున్నది. పెట్టుబడిని ఎక్కువగా కోరే కేంద్రీకృతమయిన భారీపరిశ్రమతో పోటీపడలేని రంగాన్ని విస్తరింప చేయమనటం అర్థరహితంగా కన్పించవచ్చు. కాని వికేంద్రీకృత పరిశ్రమలవల్ల అనేక లాభాలున్నట్లు ఎన్నో సాక్ష్యాధారాలు కనిపిస్తున్నాయి. 1) పెట్టుబడి తక్కువగావున్న మన సమాజంలో వున్న పెట్టుబడిని సమర్థవంతంగా వాడటంలో, మనకున్న శ్రామికశక్తిని విస్తారంగా వినియోగించటంలో సామర్థ్యం భారీపరిశ్రమలలోకన్న ఎక్కువ

మోతాదులో వుంటున్నది. తక్కువ పెట్టుబడి, పెట్టుబడికి శ్రామికశక్తికి వున్న నిష్పత్తి ఈ విషయాన్ని రుజువుచేస్తున్నాయి. 2) ఈ రంగం తక్కువ విదేశీ మారకపు ద్రవ్యాన్ని కోరుతుంది. 3) పట్టణాలు గ్రామాల సంబంధాలను చూస్తే గ్రామాలలోకి ఎక్కువ ఆదాయన్ని చేరుస్తుంది. అలాగే భూమిలేని శ్రామిక వర్గాల చేతుల్లోకి ఎక్కువ ఆదాయన్ని అందిస్తుంది. 4) విద్యావంతులుకాని శ్రామికులకు వుపాధి అవకాశాలను కల్పిస్తుంది. 5) ఒక్కొక్కపుడు విదేశీ మార్కెట్లులో ఈ రంగంలో తయారు అయ్యే సరుకులు ఎక్కువగా అమ్ముడుపోయే అవకాశంవుంది. 6) అన్నింటికన్న మిన్న వ్యవసాయరంగంతో గట్టి సంబంధాలను కలిగించుకుంటుంది.

ఆహార ధాన్యాల తాలూకు పరిశ్రమలు :-

సర్వసామాన్యంగా స్త్రీలు తమ కుటుంబాల వినియోగం నిమిత్తం ఆహార ధాన్యాలను బాగుచేసుకొని వాడతారు. కాని కొన్ని ప్రాంతాలలో అది ఆదాయంలో ఎక్కువ భాగాన్ని ఒనకూరుస్తుంది. పెరుగు, మీగడ, వెన్న, నెయ్యిలాంటి పాడిపరిశ్రమ తాలూకు వస్తువులను తయారు చేయటం, పండ్ల రసాలను సీసాలలో భద్రపరచటం, గ్యాసుతో కూడిన పానీయాలను తయారుచేయటం, పండ్లను, కూరలను ఎండబెట్టడం, రొట్టెలను, అటుకులు, పేలాలు మొదలగువాటిని చేయడం, పండ్లు మొదలగు ఆహార పదార్థాలను డబ్బాలలో భద్రపరచడం, సుగంధ దినుసులను నూరడం, ఔషధులను కలపటం, వంటనూనెలను శుభ్రపరచటం మొదలగునవి ఆహార పదార్థాలకు సంబంధించిన పరిశ్రమలు. గ్రామీణ ప్రాంతాలలో వీటిని స్త్రీలు చేపట్టున్నారు. ఈ పరిశ్రమలవల్ల వ్యవసాయంవల్ల ఉత్పత్తి అయ్యే పదార్థాలకు గిరాకీ వస్తుంది ; పంటల మార్పిడికి దారి సుగమమవుతుంది. సంవత్సరం పొడుగునా స్థానిక మార్కెట్లలో రకరకాల ఆహారపదార్థాలు దొరకడానికి వీలు కలుగుతుంది.

తయారీ పరిశ్రమలు :- స్థానికంగా లభ్యమయ్యే పదార్థాలనుండి స్థానికుల వినియోగం నిమిత్తం అనేక వస్తువులను తయారుచేయటం జరుగు

తున్నది. బంకమన్ను, పీచు, వెదురుగడలు, కలప, ప్రత్తి, జనపనార స్థానికంగా దొరుకుతున్నాయి. వీటిని ఉపయోగించుకొని ఇంటికి కావాల్సిన సామాను, అరక సామాను, వ్యవసాయ పనిముట్లు, చేపలుపట్టే వలలు, త్రాళ్ళు, బుట్టలు, చాపలు, కట్టుబడి సామాను, కుండలు వగైరా, గోనె సంచులు, సబ్బులు, ప్రత్తినూలు, చేనేతవస్త్రాలు, బీడీలు, చుట్టలు, కుర్చీలు, మంచాలు వగైరా రూపొందించుకుంటున్నారు.

ఎక్కువగా సంప్రదాయబద్ధమైన చేతి వృత్తులను అవలంబించి గ్రామీణ స్త్రీలు ఆదాయాన్ని సంతరించుకుంటున్నారు. కుట్టుపని, అల్లిక అలాంటివి. వీరు తయారుచేసే వస్తువులు ఒకే నాణ్యతను కలిగి ఉండక పోవటంచేత, మార్కెటింగు సౌకర్యాలు లేనందునను, వాటిని విక్రయించ టానికి ఏ వర్గాలూ ముందుకు రాకపోవడం వలన ఆ గ్రామిక స్త్రీల ఆదాయం తగినంతగా లేదు. పారిశ్రామికీకరణ ఎంతగా సాగుతున్నా కొన్ని హస్తకళా వృత్తుల పరిధి విస్తరించటానికి అవకాశం ఉంది. అయితే అభివృద్ధి చెందిన ఉత్పత్తి విధానాలను వాడితేనే, వస్తువిక్రయ విధానంలో లాభకరమైన మార్పు వస్తేనే అది సాధ్యమవుతుంది. కంచు, ఇత్తడిలాంటి లోహాలతో కళాత్మక వస్తువులు, బుట్టలు, గాజుపూసలు, అలంకార వస్తువులు లేసులు మొదలగునవి తయారుచేయడం పైన ఉటంకించబడిన చేతిపనుల క్రిందికి వస్తాయి.

<u>గ్రామీణ ప్రాంతాలలో కట్టుబడి :-</u> యంత్ర పరిశ్రమ వలననే కాక గ్రామీణ ప్రాంతాలలో అవస్థాపన (Infrastructure) చర్యలు తీసు కున్నందువలన నీటి పారుదల, మురుగునీటి పారుదల, భూమిని సాగు కులాయికీ చేయటం, భూసారాన్ని భద్రపరచటం, అడవులను పెంచటం, వంతెనలు ఆనకట్టలు, గ్రామీణ గృహనిర్మాణం పాఠశాలలు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, సామాజిక వికాస కేంద్రాలు, బావులు, నీటిని వృథా గాకుండా నిలవచేయడంలాంటి పథకాలను చేపట్టటంవలన ఉపాధి సౌకర్యాలు పెరుగుతాయి.

"పనికి ఆహారం" అనే పథకం తరువాత "జాతీయస్థాయి ఉద్యోగ

భద్రతా పథకం"గా మారింది. దీని పనితీరును గురించి సర్వేలు జరిగాయి. పనికి ప్రతిఫలం ధాన్యరూపకంగా ముట్టచెప్పినపుడు ఎక్కువమంది గ్రామీణ స్త్రీలు ఆ పథకాలపట్ల ఆసక్తిని కనపరచి అందులో పనిచేశారని తేలింది. అంటే సమాజంలోని బీదవర్గాల పోషణకు అవసరమైన సంపాదనను స్త్రీలు చేస్తున్నారనేది స్పష్టమయిది.

అంతర్జాతీయ నిధుల భారీ సహాయంతో జరుగుతున్న "పనికి ఆహారం"లాంటి పథకాలు గ్రామీణ స్త్రీలను ఆకర్షించాయి. ఆనకట్టలు కట్టడం, నీటి సౌకర్యాన్ని అందించటం, కొండ చరియలపై ఎక్కడికక్కడ ప్రదేశాలను చదునుచేసి చెట్లుపెంచడం, గ్రామాలలో రోడ్లువేయడం, భూమిని బాగుచేయడంలాంటి పథకాలు అవి. మహారాష్ట్రంలో జరుగుతున్న "అడవుల అభివృద్ధి పథకం"లో మొక్కలు నాటటం, అడవులను పెంచటం లాంటి పనులను ఆదివాసి స్త్రీలు పూర్తిగా తామే చేయటం కద్దు.

గ్రామీణ పథకాలలో పని భారంగా ఉంటున్నందువలననూ, దానిని నీచస్థాయి పనిగా పరిగణించడంవలననూ, గ్రామాలలోని బీద స్త్రీలు "అప్రతిష్టాకర జీవిత విధానం కలిగిన సమాజాల" స్త్రీలు మాత్రమే దానికి పూనుకుంటున్నారు. వారు మామూలుగా షెడ్యూలుజాతుల స్త్రీలు, షెడ్యూలు తరగతుల స్త్రీలు, పై కులాలలోని దిక్కుదివాణములేని స్త్రీలు, ఈ తరగతులకు చెందినవారు. "స్త్రీలు పురుషులకన్న లొంగివుండే స్వభావం కలిగి ఉండడంవలన, ఎక్కువ క్రమశిక్షణతో ప్రవర్తించటం వలన, పురుషులు స్వీకరించని పనులను వారు చేపట్టటానికి సంసిద్ధులవటం మూలాన" (సిన్హా 1975 : పుట 24), స్త్రీలకిచ్చే వేతనాల పురుషులకు చెల్లింపవలసిన వేతనాలకన్న తక్కువగా ఉంటున్నందువలన యజమానులు స్త్రీలకే ఎక్కువగా ఉద్యోగాలను ఇస్తున్నారు. వేతనాల విషయంగా అదుపు అజమాయిషీ లేకపోవటం, ఎక్కువ పనిగంటలు, గృహవసతి లేమి, పారిశుద్ధ్య సౌకర్యాలు, ప్రమాదాలనుండి రక్షణ, శిశువుల గురించి శ్రద్ధా సౌకర్యాలు మొదలగు అవసర సదుపాయాలు యజమానులు ఒనగూర్చలేకపోవడం వలన పని పరిస్థితులు ఘోరంగా దోపిడీ

(Exploitative) లక్షణంతో కూడివున్నాయి. ప్రాజెక్టు పని మొత్తం పూర్తికాకుండానే శ్రామిక స్త్రీలు పని వదలి వెళ్ళిపోకుండా వేతనాలలో కొంత మొత్తాన్ని చెల్లించక బిగపట్టటం, గడువుప్రకారం కూలీమొత్తాలను ముట్టచెప్పకపోవటం జరుగుతున్నది. పైగా పనిచోటు వారి గ్రామాలకు దూరంగా ఉండి కొన్ని రుతువులలో మాత్రమే పని దొరుకుతున్నది. ఇలా స్త్రీలు శ్రమ దోపిడీకి గురవుతున్నారు.

సేవారంగాలు :-

ఇది పూర్తిగా మా స్వంతం అని చెప్పుకోడానికి ఏదైనా రంగం ఉంటే అది సేవారంగం మాత్రమే అదీ ఇంటిపని. వంటకత్తెలుగా, పని మనుషులుగా, గుడ్డలు ఉతికేవారుగా, అంట్లు తోమేవారుగా, దాసీలుగా ఇలా సేవారంగంలో పనిచేస్తున్నారు స్త్రీలు. తృతీయ ప్రపంచంలోని గ్రామాలలో ధనవంతులైన భూస్వాములు సంపన్నులైన వర్తకులు ఒక వైపున సన్నకారు రైతులు భూమిలేని వ్యవసాయ కూలీలు మరొకవైపున రెండువర్గాలు కన్పిస్తాయి. ఆ గ్రామాలలో సేవా వృత్తిని స్త్రీలు విరివిగా చేపట్టటం జరుగుతున్నది. ప్రత్యేకంగా ఒక ఇంటిలో పనిచేయటమేగాక వారు ఇతర సేవా కార్యక్రమాలను చేపట్టున్నారు. రోజు కొకసారికాని, వారాని కొకసారికాని ఇంటింటికెళ్ళి అంట్లుతోమి ఇల్లు శుభ్రపరచి, బట్టలు ఉతికి పనిచేస్తుంటారు. అలాకాక పిలిచినపుడు పోయి ఏదో ఒక ఇంటిలో ఈ పనులనే చేస్తారు. "పాకీ" పనిని ఆ స్త్రీలచేత మునిసిపాలిటీలు చేయిస్తాయి. వీధులను శుభ్రం చేయిస్తాయి. బహిరంగ ప్రదేశాలను ఊడ్పిస్తాయి. వ్యక్తిగత రంగంలోను, ప్రజారంగంలోను నెలకొనియున్న అనేక సంస్థలలో రోజు వారి కూలీ లేక వారపు జీతాలపై స్త్రీలు పని చేస్తున్నారు.

చవకగా లభించే స్త్రీల శ్రమశక్తి లేకపోతే సంపన్న గృహస్తులు తమ అవసరాలను భోజన శాలలు, ఫలహార శాలలు, "లాండ్రీలు" వగైరా సంస్థలద్వారా తీర్చుకోవలసి ఉన్నది. అందుకు వారు ఎక్కువ మూల్యం చెల్లించాలి. ఇందుకు బదులుగా చవకగా ఇంటిపనులను చేయటానికి స్త్రీల

శ్రమశక్తిని వినియోగించుకొని సంపన్న గృహస్థులు కృత్రిమమైన ఉన్నత జీవన ప్రమాణాన్ని కొనసాగించుకుంటున్నారు. ఈ పరిస్థితిని మార్చాలంటే మూడు రకాలుగా ఆలోచించవలసి వుంటుంది. (1) చిన్న పరిశ్రమలలో స్త్రీలకు ఇతోధికంగా ఉపాధి సౌకర్యాలు కల్పిస్తే సేవా రంగంలో పనిచేసే స్త్రీల సంఖ్య తగ్గుతుంది. వారి వేతనాలు పెరుగుతాయి. అంతేగాక శ్రమను చిన్న పనిముట్ల ద్వారా చేయించే పద్ధతిపస్తే అలాంటి పనిముట్లను తయారుచేసే పరిశ్రమలు పెరుగుతాయి. (2) ఇళ్ళల్లో పనిచేసేవారు చెదురుమదురుగా నివసిస్తూ పనిచేస్తూ ఉన్నందువలన, పైగా యజమానులపై వ్యక్తిగతంగా ఆధారపడుతున్నందున వారిని సంఘటితం చేయడం కష్టతరమే. అయినా సేవారంగంలో పనిచేసే స్త్రీలను సంఘటితం చేయపూనడం, దానికి అనువైన విధానాలను రూపొందించడం మరో మార్గం (3) ప్రస్తుతం వేరువేరు యజమానుల ఇళ్ళల్లో పనిచేసే స్త్రీలను సమీకరించి ముఠాలుగా సంఘటితంచేసి వారిచేత శిశు సంరక్షణాలయాలు, "లాండ్రీలు", ఫలహార శాలలు, ఆహార పదార్థాల సరఫరా లాంటి పనులు చేయించవచ్చును. అందుకు అవసరమైన వ్యాపార దక్షతను, నేర్పును వారు అలవరుచుకుంటారు. వ్యాపారాలు నడుపుకోవటానికి వేరే స్థలాలను ఏర్పరచుకుంటారు. ఇలా చేయడంవలన వారు తమ సేవలకు ప్రతిఫలంగా న్యాయమైన హేతుయుతమైన వేతనాలను పొందగలరు.

ప్రమాదాల బారినుండి రక్షణ లేకపోవడం, "క్రెషీలు" కరువవడం, పని స్థలానికి పోవటానికి రవాణా సౌకర్యాలు లోపించడం, పనికాలం మారుతూ అసౌకర్యంగా వుండడం, పని ప్రదేశంలో లైంగిక వేధింపుకు లోనుకావడం ఇవికూడా స్త్రీలు వుపాధి కోల్పోపడానికి కారణభూతాలు అవుతున్నాయి. వారు వదలిన ఉద్యోగాలను పురుషులు ఆక్రమిస్తున్నారు.

రైతు స్త్రీలు వ్యవసాయ కార్మిక స్త్రీలుగా మారుతున్నారు. 1951లో రైతు స్త్రీల సంఖ్య 183.6 లక్షలు. 1971లో అది 92.6 లక్షలకు దిగజారింది. అయినప్పటికి 1971లో శ్రామిక స్త్రీలలో 80 శాతం వ్యవ

సాయ రంగంలో ఉన్నారు. సంప్రదాయంగా వచ్చే ఆహార ధాన్యాల ఉత్పత్తినుండి వాణిజ్య పంటల ఉత్పత్తికి వ్యవసాయరంగం ప్రాధాన్యత ఇస్తున్నకొలదీ స్త్రీలు ఆర్థికరంగంలో తమ స్థానాన్ని కోల్పోవసాగారు. వరిపొలాల్లో మోకాలిలోతు నీళ్ళల్లో నిలబడి వంగి పనిచేయటం, తేయాకు, కాఫీతోటలలో, ప్రత్తి పొలాలలో ఆకును కాయును త్రెంచటం, తమ కోసంగాని లేక అమ్మకానికిగాని కట్టెపుల్లలను ఏరి మోసుకొన్ని రావడం, ధాన్యాన్ని తూర్పారపట్టడం, లేక దంచడం, ఇంటిపనులు గాక అదనంగా అరక పశువులను పెంచడం ఇలాంటి పనులను ఎన్నింటినో స్త్రీలు చేస్తూ ఉండడం మనం గమనిస్తున్నాం. అంటే పురుషులు ఇంత కన్నా తక్కువ శ్రమ కల్గిన పనులను చేస్తున్నారని భావంకాదు. కాగా గ్రామీణ బీద ప్రజానీకంలో స్త్రీల ఇబ్బందులు కష్టాలు ఇతోధికమని, విస్తృతమని గ్రహించాలి.

## అసంఘటిత రంగంలోని గ్రామీణ స్త్రీల సమీకరణకు వ్యూహం :-

వ్యవసాయరంగానికి లోపల, వెలుపల ఉండే గ్రామీణ స్త్రీలను సమీకరించటానికి ఈ దిగువ పేర్కొనబడిన చర్యలు ఉపకరిస్తాయి. 1) ఆదాయాన్ని ఒనగూర్చే ఉపాధి అవసరమైన స్త్రీ సముదాయాలను గుర్తించి పేర్కొనడం. 2) ప్రస్తుతం వారు సాగిస్తున్న ఆర్థికరంగ కార్యక్రమాలను గమనించి, వాటి పరిధిని పరిశీలించి, వాటి వుత్పత్తిని పెంచే మార్గాలను, ఆదాయాన్ని పెంచే శక్తిని అన్వేషించడం. అంతేగాక ఇతోధిక వుత్పత్తి లేక ఆదాయం వచ్చే కార్యక్రమాలలోకి స్త్రీలను తరలించడం. 3) స్త్రీలను సముదాయాలుగా, ముఠాలుగా చేర్చటం. 4) స్త్రీలు సముదాయకంగా నడిపే పరిశ్రమలకు ప్రయత్నాలకు దోహదంగా వారికి పరపతిని, శిక్షణను, సాంకేతిక సహాయాన్ని అందించటం. 5) ఇంటిపని శ్రమను తగ్గించే నిమిత్తం ఆవశ్యకమైన సాంకేతికత అవసరాన్ని గుర్తించి ఒనగూర్చటం. 6) స్త్రీల శ్రమ ఫలితంపై వారి యాజమాన్యమూ, అదుపూ లేకుండా చేసిన సామాజిక, సాంస్కృతిక అవరోధాలను గుర్తించి వాటిని అధిగమించడానికి లేక తొలగించడానికి కృషి చేయడం.

(తే 31-3-85 దిన హైదరాబాద్‌లో మహిళాభ్యుదయ సంస్థ నిర్వహించిన "స్త్రీలు : ఉద్యోగం" అనే సెమినారులో సమర్పింపబడిన వ్యాసం)

# మధ్యతరగతి మహిళలు : వారి శ్రమ

—మల్లాది సుబ్బమ్మ

18వ శతాబ్దంలో పెట్టుబడిదారి వర్గంగా ఉద్భవిస్తున్న వర్గానికి "మధ్యతరగతి" అని నామకరణం చేశారు. 20వ శతాబ్దంలో దాని అర్థం మారింది. ఈనాడు రైతులు చిన్న దుకాణదారులు ఉద్యోగస్తులు అందరూ మధ్యతరగతికి చెందినవారే ఇప్పుడు పెట్టుబడిదారి, శ్రామిక, మధ్యతరగతి వర్గాలు వెలిశాయి. శ్రమ, ఉపాధి రెండూ వేరువేరు మాటలు. భుక్తి కోసం ఉపాధిని చేపట్టటం జరుగుతోంది. శ్రమ అనే పదానికి విస్తృతమైన అర్థం వున్నది. మనిషి తన సంతోషంకోసం, తృప్తి కోసం చేసేది కూడా శ్రమక్రిందకే వస్తుంది. అలాగే స్వయం ఉపాధికూడా ఉపాధి క్రిందకే వస్తుంది.

ఈ సందర్భంలో ఉపాధిని గురించే చర్చిద్దాం. ఉపాధి యెడల మధ్యతరగతి భావం ఎలావుందో నిర్ణయించే ముందు ఆలోచనాపరులు మధ్యతరగతిని ఎలా పరిగణిస్తున్నారనేది మరో ఆలోచనీయాంశం. కొంత మంది మేధావులు మరికొంతమంది విద్యావంతులు మధ్యతరగతి యెడల దురభిప్రాయం కలిగి వున్నారు. ఆ వర్గం బలహీనమైనదని, ధైర్యం లేనిదని వారి ఉద్దేశ్యం. ఈ వైఖరి శోచనీయం. ఏదైనా ఈ దృక్పథం ప్రబలంగా వుంది. మధ్యతరగతి వర్గానికి బలహీనతలు ఉన్నవని సామర్థ్యం లోపిస్తుందని మనం అంగీకరించవచ్చు. కాని ఆ మాటకొస్తే ప్రతి వర్గానికీ ఏదో ఒక లోపం, ఏదో ఒక బలహీనత వుంటున్నమాట వాస్తవం. కనుక మధ్యతరగతియొక్క ప్రయోజనకర లక్షణాలను పేర్కొనడం అవశ్య కర్తవ్యం. సమాజంలోని ఇతర వర్గాలకన్నా ఈ వర్గానికి చదువెక్కువ; సమాజ భావన అధికం. సంస్కృతిని ఈ వర్గం వారసత్వంగా పొందుతున్నది. భవిష్యత్తును నిర్మించనున్నది. మానవ విలువలయెడ ఈ వర్గానికి శ్రద్ధ వున్నది. అలాగే ఈ వర్గానికి అవగాహన శక్తికూడా వున్నది. సర్వసామాన్యంగా ఆలోచనలోగాని, కార్యాచరణలోగాని ఈ వర్గం తీవ్రవాద వైఖరిని అవలంభించదు; మధ్యే

మార్గాన్ని అనుసరిస్తున్నది. విప్లవానికి కాని లేక తిరోగమనానికి గాని ఈ వర్గం అండదండలను అందివ్వగలదు. ఈ వర్గం భావాలకోసం ఆరాటపడుతుంది. వాటిని అమలుపర్చాలని తాపత్రయ పడుతుంది. భావాలకొరకు కష్టనష్టాల పాలవుతుంది.

గతంలో స్త్రీలు భుక్తికోసం శ్రమ చేశారు. జీవనోపాధికోసం ఈనాడు శ్రమిస్తున్నారు. పారిశ్రామిక కార్మికవర్గం ఉద్భవించనిరోజుల్లో శ్రామిక వర్గాల్లోని స్త్రీలు బ్రతుకుతెరువుకోసం పనిచేసేవారు. తమకిష్టం లేకపోయినా రైతులు, వ్యవసాయ కార్మికులు, చేతిపనివారు తమ స్త్రీలచేత పని చేయించక తప్పలేదు. శ్రమకు, సంపదకు చాలా సంబంధం వుంది. ఒక పురుషుడు తగినంత సంపదను పొందగానే తన భార్యను పనిచేయవద్దని ఆదేశిస్తాడు. పనిచేస్తే కుటుంబ గౌరవం నశిస్తుందని వాపోతాడు. ఇదంతా అతనియొక్క ప్రేమాభిమానాలకు నిదర్శనమని కొందరు ఉదారంగా వ్యాఖ్యానిస్తే, మరికొందరు పురుష దురహంకార ప్రదర్శనగా చిత్రిస్తారు. పురుషుడికి తగినంత సంపద వచ్చేవరకు ఆమె అర్ధమానిసి. అంటే ఆమెను కొంతవరకు మనిషిగా చూస్తాడన్నమాట ఈ పురుష పుంగవుడు. అతడికి ఆస్థి వచ్చాక ఆమె వస్తు తత్వాన్ని సంతరించుకుంటుంది. అంటే ఆమె అతని వస్తువవుతుంది. తన వస్తువు అందంగా సుకుమారంగా వుండాలని కోరుకున్నట్లే. తన భార్యకూడా శ్రమ చేయకుండా వసివాడకుండా వుంటూ తనకు తృప్తిని, సంతోషాన్ని కలుగజేయాలని అతడు ఆశిస్తాడు. ఇలా అతడు తన భావాలను ఆమెపై రుద్దుతాడు. స్త్రీలుకూడా పితృస్వామ్య వ్యవస్థయొక్క విలువలను తమవిగా చేసుకుంటారు. అందువలన శ్రమ చేయడానికి వారు ఇష్టపడక పనిని ద్వేషిస్తారు; అసహ్యించుకుంటారు.

కొన్ని వాస్తవాలను మనం గ్రహించాలి. స్వయం ఉపాధి కల స్త్రీలు అంటే నేత, కుండలు చేయడం, పూలు, కూరలు వగైరాలు అమ్మడం, చిన్నచిన్న దుకాణాలను నడపడం చేసే స్త్రీలు శ్రమచేస్తున్నారు; బాగా కష్టపడుతున్నారు. పని చేయకపోతే వాళ్ళకు బ్రతుకు గడవదు. చిన్న

ఆమె ఆలోచనలు, భావోద్రేకాలు ఇవన్నీ మన కళ్ళముందు సజీవంగా సాక్షాత్కరిస్తాయి.

లత సాహిత్యం పేరిట ఒక ప్రత్యేకత సంతరించుకొన్నవారు శ్రీమతి తెన్నేటి హేమలత, తమ చుట్టు అల్లుకొన్న ఛాందస భావాల చిక్కుముడులు, సాంప్రదాయాలు ఛేధించుకొనేందుకు నేటి స్త్రీలు సాగిస్తున్న నిరంతర సమరాన్ని తమ నవలలలో ప్రతిబింబింపజేశారు. ఎడారి పువ్వులు, మహానగరంలో స్త్రీ, ప్రేమ రాహిత్యంలో స్త్రీ, ఇవన్నీ స్త్రీల సమస్యల గురించిన పుస్తకాలే. ఆమె అంతరంగ చిత్రం, ఒక అందమైన స్వప్నం. ఆమె వూహించే సమాజమూ ఒక స్వప్నం మాత్రమే. వివాహం పేరిట స్త్రీకి జరుగుతున్న అన్యాయాలకు అసంతృప్తి ప్రకటించేరు. లత కానీ, ఏ నవలలోనైనా, స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాన్ని అనుసరించిన వ్యక్తులకు ఆత్మహత్యే శరణ్యం అయింది.

"స్త్రీల సమస్యలు, స్త్రీల జీవితాలకు పరిమితంకాదు, అవి పురుష జీవితాలకు సంబంధంలేని విషయాలు కావు. స్త్రీల సమస్యలమీద స్త్రీకి సరి అయిన విజ్ఞానం ఎంత అవసరమో, పురుషులకుకూడా అంతే అవసరం".

సంఘం ఎప్పుడూ సణిగే ముసలమ్మ లాటిది యవ్వనము, సౌందర్యము, వుత్సాహము వున్నదశ, సమాజానికి ఎప్పుడూ లేదు. అది పుట్టినప్పుడే ముసలమ్మగా పుట్టింది".

అంటు రంగనాయకమ్మగారు తమ రచనల్లో ఒక కొత్త విప్లవం సాధించేరు. ఆమె వ్రాసిన బలిపీఠం, చదువుకొన్న కమల పేకమేడలు, అంధకారంలో ఉన్న స్త్రీల దౌర్భాగ్యాలకు మచ్చుతునకలు. "ఆడది ఒంటరిగా జీవించే తాహతుకి మన సమాజం ఎదగలేదు. మనం అంత పురోగమించలేదు అంటూ వాపోయారు పేకమేడలు నవలలో. మనుష్యులు వూరికే ఆలోచించి, మానవతుల కథలు చదివి, పశ్చాత్తాపాలు పొంది, వెంటనే మారతారని, ఎదుగుతారని అనుకోవటం శాస్త్రీయ దృక్పథం కాదు. మనిషి నవ్వుకి, నిట్టూర్పుకి బాధ్యత సంఘానిదే అన్నారు రచయిత్రి

వారిలో అధికమని, యవ్వనంలో. ప్రసవ సమయంలో, ముట్లుడిగినప్పుడు మానసిక ఒత్తిళ్ళకు లోనవుతారని వుద్వేగ పూరితులనే వాదనలు ప్రబలంగా వున్నాయి. కొన్ని పనులకు మాత్రమే తగుదురని కొందరంటున్నారు.

ఇది పొరపాటు. వారు చేసేపనినిబట్టి వుంటుంది. ప్రమోషన్ లేని పనులిచ్చి సమర్థత లోపించిందంటే తప్పు మేనేజిమెంటుదే. స్త్రీ అధికారి క్రింద పనిచెయ్యటానికి పురుషులు విముఖతవల్లనే ఆమెను పైకిరానివ్వరు. శిక్షణ విషయంలోకూడా ఆడవారికి అవకాశాలు తక్కువ. వారిలో విద్య లేమి మరోకారణం. పిల్లల తల్లులకు కుటుంబ బాధ్యతలు నిర్వహించటానికి 'టైము'ను వేరుగా కేటాయించని కారణం మరొకటి.

"సర్వే"లు చేసి నిర్వచించినది కాదు ఈ విశ్లేషణ. స్థూల దర్శనం వల్ల కలిగిన భావాల సంపుటీకరణ ఇది. ఇతోధికంగా నైపుణ్యమూ వనరులూ కలిగిన పరిశోధకులు పూనుకొని ఈ సమస్యలను నిశితంగా, గాఢంగా పరిశీలించవలసి ఉంటుంది.

భారతదేశంలో సమాజాన్ని కులమూ, వర్గమూ చీలుస్తున్నాయి. కులంయొక్క దుష్టపాత్రను విస్మరించడం పొరపాటు. అలాగే కులానికి అత్యధిక ప్రాముఖ్యతనిచ్చి వర్గాల ఉనికిని త్రోసి రాజనడం తప్పు. కులం వర్గాన్ని ప్రభావితం చేస్తుంది. అలాగే వర్గం కులంలోకి చొచ్చుకుపోతుంది. రెండవదానిని పూర్తిగా నెట్టివేసేటంతగా ఒకదాని పాత్రను విపరీతంగా పెంచి చూడటంగాని, రెండవదానిపై పెత్తనమూ ఆధిక్యతా కల దానినిగా మరియొకదానిని పరిగణించడంకాని సరియైన పద్ధతికాదు.

తాత్వికంగా మనదేశం 16 వ శతాబ్దంలో ఉంది. పారిశ్రామికంగా 19 వ శతాబ్దంలో ఉంది. 21 వ శతాబ్దంలోకి దేశాన్ని తీసుకొనిపోవాలని కొందరు మాట్లాడుతున్నమాట నిజమే. మనం అవునన్నా కాదన్నా, 15 సంవత్సరాల తదుపరి దేశం 21 వ శతాబ్దంలో అడుగుపెట్టుంది.

కాలగమనం ఎవరికోసమూ ఆగదు. ప్రశ్న ఏమంటే భారతదేశ

స్త్రీలు 21వ శతాబ్దంలోకి అడుగుపెట్టటానికి అభిలషిస్తున్నారా అనేది. ఆ పరిణామానికి అవసరమైన సాంస్కృతిక మార్పు ఎప్పుడో రావలసి వున్నది. కాని ఇంకారాలేదు. కారణం ఆమె వైవాహిక స్థాయి, లేక లైంగిక పరిస్థితి. శారీరక, మానసిక సమస్యలను ఆమె సర్దుకుపోవటంలో అవి పాత్ర వహిస్తాయి.

ఈ పరిస్థితిలో ఆశాజనకమైన దేమంటే కుటుంబ ఆదాయానికి ఏదో కొంత కలపాలనే ఆతృత ఎక్కువయి అనేకమంది స్త్రీలు ఉద్యోగాలను ఆశించేలాగ చేయటమే తమ వ్యక్తివికాసంకోసం పని చేయటానికి ఉద్యుక్తులవుతున్నారా లేక దేశపు శ్రమశక్తిని వినియోగించటానికి అలా సన్నద్ధులవుతున్నారా అనేది తేలని విషయం. మొత్తంమీద చెప్పవలసి వస్తే మధ్యతరగతి స్త్రీలు ఇంటా బయటా పనిచేయటానికి ఇష్టపడటంలేదు. ఉద్యోగాలుచేసే స్త్రీలుకూడా గత్యంతరములేక అవసరమయి బలవంతంగా పనిచేయవలసి వస్తున్నదని బాధపడుతున్నారు. గృహిణులను చూచి అసూయ పడుతున్నారు. తాము గృహిణులలాగే ఇంటిపట్టున ఉంటే బాగుండునని తలపోస్తున్నారు. ఈ వైఖరి చాల ప్రమాదకరం. ఈ దృక్పథం మారాలి. వ్యక్తియొక్క స్వంత లాభాన్ని దేశం లేక సమాజం యొక్క శ్రేయస్సును ముడివేసే సమ సమాజం ఏర్పడేవరకు పరిస్థితి ఇలాగే ఉంటుంది. కనుక స్త్రీలలో భావ విప్లవమూ, సమాజ పునర్నిర్మాణ ప్రయత్నమూ ఏకకాలంలో జరగాలి. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయం అనే అంశాలపై ఆధారపడిన సమ సమాజం ఉద్భవిల్లాలి.

ఇతర వర్గాలవారికన్న మధ్యతరగతులవారి భవిష్యత్తు సమాజపు భావ సౌధంపై ఆధారపడుతున్నది. అందువల్ల మధ్యతరగతి స్త్రీల ప్రాముఖ్యత పెరుగుతున్నది. సమాజం ఎంతగా పురోగమిస్తున్నది? తమ స్వప్రయత్నం ఎంతవరకు ఉంటున్నది అనే ప్రశ్నలకు సమాధానాలపైననే మధ్యతరగతి స్త్రీల అభ్యుదయం ఆధారపడుతుంది.

(హైదరాబాద్ విశ్వవిద్యాలయ మహిళ సమస్యా పరిశోధనా శాఖ సెమినారులో వ్యాసం : 1985)

# పని స్థలంలో స్త్రీలపట్ల వివక్ష-కొన్ని సమస్యలు

—విమల్ బాలసుబ్రమణ్యన్

స్త్రీ పురుష సమానత్వాన్ని సునిశ్చయం గావించే కొన్ని బహు ముఖ ప్రభావ శీల భావనల్ని మన భారత రాజ్యాంగం ప్రకటించి యిప్ప టికి ముప్పైఏళ్ళకు పైగా అవుతున్నది. లింగపరమైన వివక్షను నివా రించి, సమానతను పెంపొందించేందుకని ఐక్యరాజ్యసమితి, అంతర్జాతీయ శ్రామిక సంస్థలు రూపొందించిన వివిధ సూత్రాలను ప్రపంచ దేశాలేవీ ఆమోదించకముందే మన రాజ్యాంగం ఈ భావనల్ని ప్రకటించిందని గమనించాలి. అయితే యిప్పటికీ మన పనిస్థలాల్లో కొనసాగుతున్న, బాగా లోతుగా పాతుకుపోయివున్న లింగ వివక్షను చూస్తే, అది న్యాయ మూర్తి క్రిష్ణ అయ్యర్ అభివర్ణించిన "అచ్చులోని రాజ్యాంగానికీ, ఆచరణ లోని న్యాయానికీ మధ్య దూరాన్ని" ప్రతిబింబిస్తున్నదనే చెప్పుకోవాలి.

రాజ్యాంగం ఏమి గ్యారంటీ చేస్తున్నది? చట్టంముందు సమా నత్వాన్ని సునిశ్చయం చేస్తుంది 14వ అధికరణం. కాగా 15వ అధికరణం లింగ వివక్షను నిషేధిస్తుంది. 16వ అధికరణం సమాన పనికి సమాన వేతనాన్ని గ్యారంటీ చేస్తుంది. ప్రసూతి సహాయం అందించటం రాజ్యాం విధి అని 42వ అధికరణం ప్రకటిస్తున్నది.

ఇదంతాచూస్తే భారత స్త్రీలు పోరాడడం మాటటుంచి, అసలు అడగనన్నా అడగకుండానే లింగ వివక్షనుండి రక్షణ, సమానత్వాలను వారికి అప్పనంగా యిచ్చారనే భావన కలగక మానదు. కాని అసలు వాస్తవం ఏమిటి ?

ఈ వ్యాసంలో నేను మొదట మూడు ఇటీవలి కోర్టు కేసుల్ని వుదహరిస్తాను. లింగ వివక్ష ఎలా వున్నదో అవి ఛాయామాత్రంగా

వెల్లడిస్తాయి. తర్వాత కోర్టు దాకాలించె శ్ళనిగ వివక్షకు సంబంధించిన కొన్ని వుదాహరణలు యిస్తాను. వుపాధి కల్పన విషయంలో మహిళలు యింకా ఎందుకు యిలాంటి (వి)పక్షపాతాన్ని సహించాల్సి వస్తున్నదనే ప్రశ్నను అవి రేకెత్తిస్తాయి. చివరగా, ఇప్పుడు వ్యాప్తిలోవున్న పితృస్వామిక దృక్పథాలు ఎంత లోతుగా వేళ్లూనుకొని వున్నాయో, విప్లవాత్మక (radical) రాజ్యాంగ సూత్రాలకు అవి ఎంత దూరంలో, ఎంత భిన్నంగా వున్నాయో, కనుక పని పరిస్థితుల్లో మౌలిక మార్పులు సాధించాలంటే చట్టపర యుద్ధాలకంటే ప్రభావశీలమైన యితరేతర మార్గాలు ఎలా అవసరమో వివరించే కొన్ని వాస్తవాలు మీముందు వుంచుతాను.

మొదటగా మూడు కోర్టు కేసులు. భారతదేశ ప్రప్రథమ మహిళా FS (భారత అటవీశాఖ) అధికారి సి.బి. ముత్తమ్మ సుప్రీం కోర్టులో ఒక రిట్ పిటిషన్ వేసింది. అటవీశాఖ ఉద్యోగ నిబంధనల్లో రెండు నిబంధనలు రాజ్యాంగంలోని 14, 16 వ అధికరణాలను అతిక్రమిస్తున్నాయని ఆమె వాదించింది. పెళ్ళి చేసుకునేముందు అనుమతి తీసుకోవల్సిందిగా ఒక నిబంధన మహిళా వుద్యోగులను ఆదేశిస్తున్నది. అంతేగాక ఎవరైనా వివాహిత వుద్యోగిని కుటుంబ బాధ్యతలు ఆమె పని సామర్థ్యానికి అడ్డు వస్తాయని ప్రభుత్వం భావించేట్లయితే అప్పుడు ఆ వుద్యోగినిని రాజీనామా చేయమని కోరే అధికారాన్ని కూడా ప్రభుత్వానికి యిస్తున్నది. రెండవ నిబంధన వివాహిత స్త్రీలకు వుద్యోగాల్ని పూర్తిగా నిరాకరిస్తున్నది. అయితే ఈ పిటిషన్ వేసిన వెంటనే, ప్రభుత్వమే ఈ రెండు దుస్సహ నిబంధనలను రద్దు చేసివేసింది. తర్వాత ఈ కేసు న్యాయమూర్తి క్రిష్ణ అయ్యర్ వద్దకు రాగా ఆయన "పిటిషన్‌ను త్రోసివేస్తున్నాను కాని సమస్యనైతే కాదు." అని పేర్కొన్నాడు. అయితే ఈ మధ్యకాలంలో ముత్తమ్మ కంటె జూనియర్ వుద్యోగులు కొందరికి ఆమెకంటె పైస్థాయిల్లో ప్రమోషన్లు వచ్చినందువల్ల, ప్రభుత్వం ముత్తమ్మ సీనియారిటీని సమీక్షించి, ఆమెకు న్యాయం చేకూర్చాలని ఆదేశించాడు. అంతేగాక "రిట్ దరఖాస్తుల తాత్కాలిక ప్రేరణ" కోసం వేచిచూడకుండా వుద్యోగ నిబంధనల

చేసే అసంఖ్యాక రిట్ పిటిషన్లతో సుప్రీంకోర్టు, హైకోర్టులు నిండిపోయాయనుకుంటే అది పొరపాటే. మరి ఇలా జరగలేదంటే దానికి రెండు కారణాలుండొచ్చు. ఒకటి అత్యధిక మహిళా వుద్యోగులకు అసలుకు రాజ్యాంగ నిబంధనలను గురించి, ఇలాంటి సమస్యల్ని తాము కోర్టుకు తీసుకువెళ్ళ వచ్చనే సంగతి గురించి తెలియకపోవడం రెండవది, ఒకవేళ తెలిసి వున్నా, సుదీర్ఘమైన చట్టపర యుద్ధాల్లో నిమగ్నమవడం వాళ్ళకు చాల కష్టమవడం. అలాగే పురుషాధిక్యత గల ట్రేడ్ యూనియన్లకు ఇలాంటి సమస్యల ప్రాధాన్యం తట్టకపోవడం.

లింగ వివక్షపై ఫిర్యాదులను గురించి వ్యవహరించేందుకు మరింత బలీయమైన శాసనాలు, మరింత కుదురైన పద్ధతులు గల బాగా అభివృద్ధి చెందిన యూరపు ఆర్థిక సముదాయ (E E.C.) దేశాల్లో సైతం ఇలాంటి లింగవివక్ష పూర్తిగా అంతరించలేదు. ఈ విషయంపై వెలువడిన ఇటీవలి ఒక అంతర్జాతీయ శ్రామిక సంస్థ (ILO) నివేదిక రెండు కారణాలను పేర్కొంటున్నది. మొదటిది, ఎదిరించి పోరాడడానికి చట్టాన్ని ఉపయోగించుకునేది అతి కొద్దిమంది స్త్రీలే. రెండవది, పెరుగుతున్న నిరుద్యోగం, బర్తరఫ్ భయాలవల్ల యిలాంటి ఫిర్యాదులు చేయడానికి వెనుకాడుతుంటారు.

నాకు బాగా తెలిసినంతలో ఉద్యోగ నియామక నిబంధనాలు, సేవా నియమాలు బాహాటంగా వివక్షాపూరితంగా వున్నా వాటిని కోర్టులో సవాలు చేయని ఇటీవలి మూడు ఉదాహరణల్ని యిక్కడ పేర్కొంటాను.

గత సంవత్సరం, లేడీ హార్డింజ్ వైద్య కళాశాలకు చెందిన మహిళా హౌస్ సర్జన్ల గురించి ఒక వార్త బాగా వెలుగులోకి వచ్చింది. ఉద్యోగ నియామక సమయంలో వాళ్ళు గర్భపరీక్ష చేయించుకోవాలి. గర్భం లేకుంటేనే వాళ్ళకు ఉద్యోగాలు యిస్తారు. ఆరునెలల తర్వాత మళ్ళీ ఒక సారి గర్భపరీక్ష చేయించుకోవాలి. అప్పుడు గర్భం వుంటే, ఉద్యోగం వదలనన్నా వదిలిపెట్టాలి లేదా కడుపు తీయించుకోవాలి అంతేగాని

చేసే అసంఖ్యాక రిట్ పిటిషన్లతో సుప్రీంకోర్టు, హైకోర్టులు నిండిపోయా యనుకుంటే అది పొరపాటే. మరి ఇలా జరగలేదంటే దానికి రెండు కారణా లుండొచ్చు. ఒకటి అత్యధిక మహిళా వుద్యోగులకు అసలుకు రాజ్యాంగ నిబంధనలను గురించి, ఇలాంటి సమస్యల్ని తాము కోర్టుకు తీసుకువెళ్ళ వచ్చనే సంగతి గురించి తెలియకపోవడం రెండవది, ఒకవేళ తెలిసి వున్నా, సుదీర్ఘమైన చట్టపర యుద్ధాల్లో నిమగ్నమవడం వాళ్ళకు చాల కష్టమవడం. అలాగే పురుషాధిక్యత గల ట్రేడ్ యూనియన్లకు ఇలాంటి సమస్యల ప్రాధాన్యం తట్టకపోవడం.

లింగ వివక్షపై ఫిర్యాదులను గురించి వ్యవహరించేందుకు మరింత బలీయమైన శాసనాలు, మరింత కుదురైన పద్ధతులు గల బాగా అభివృద్ధి చెందిన యూరపు ఆర్థిక సముదాయ (E E.C.) దేశాల్లో సైతం ఇలాంటి లింగవివక్ష పూర్తిగా అంతరించలేదు. ఈ విషయంపై వెలువడిన ఇటీవలి ఒక అంతర్జాతీయ శ్రామిక సంస్థ (ILO) నివేదిక రెండు కారణాలను పేర్కొంటున్నది. మొదటిది, ఎదిరించి పోరాడడానికి చట్టాన్ని ఉపయో గించుకునేది అతి కొద్దిమంది స్త్రీలే. రెండవది, పెరుగుతున్న నిరుద్యోగం, బర్తరఫ్ భయాలవల్ల యిలాంటి ఫిర్యాదులు చేయడానికి వెనుకాడు తుంటారు.

నాకు బాగా తెలిసినంతలో ఉద్యోగ నియామక నిబంధనాలు, సేవా నియమాలు బాహాటంగా వివక్షాపూరితంగా వున్నా వాటిని కోర్టులో సవాలు చేయని ఇటీవలి మూడు ఉదాహరణల్ని యిక్కడ పేర్కొంటాను.

గత సంవత్సరం, లేడీ హార్డింజ్ వైద్య కళాశాలకు చెందిన మహిళా హౌస్ సర్జన్ల గురించి ఒక వార్త బాగా వెలుగులోకి వచ్చింది. ఉద్యోగ నియామక సమయంలో వాళ్ళు గర్భపరీక్ష చేయించుకోవాలి. గర్భం లేకుంటేనే వాళ్లకు ఉద్యోగాలు యిస్తారు. ఆరునెలల తర్వాత మళ్ళీ ఒక సారి గర్భపరీక్ష చేయించుకోవాలి. అప్పుడు గర్భం వుంటే, ఉద్యోగం వదలనన్నా వదిలిపెట్టాలి లేదా కడుపు తీయించుకోవాలి అంతేగాని

గత్యంతరంలేదు. ఈ నిబంధనకు వ్యతిరేకంగా ఈ మహిళలు హాస్పిటల్ అధికారులకు, ఆరోగ్య శాఖామంత్రికి, ఆఖరుకు ప్రధానమంత్రికి కూడ నిరసన తెల్పారు. కాని వాళ్ళు యింతవరకు ఈ విషయమై కోర్టుకు వెళ్లలేదు.

రెండవ ఉదాహరణ: 1981 లో హిందుస్థాన్ టైమ్స్‌లో ఒక వార్త పడింది. కోయంబత్తూర్‌లో ఒక హోమ్‌సైన్స్ కళాశాలలోని మహిళా లెక్చరర్లకు "శెలవుల్లోనే పిల్లల్ని కనండి!" అనే ఒక స్థాయీ ఉత్తరువు అమలులో వుందట. ప్రసవ సమయం శెలవుల్లో కుదరకపోవడంవల్ల, ప్రసూతి శెలవు యివ్వడానికి కళాశాల అధికారులు నిరాకరించడంవల్ల ఒక లెక్చరర్ గర్భస్రావం చేయించుకోవాల్సి వచ్చిందటకూడ. అయినా ఈ నిబంధనమకూడ యింతవరకు కోర్టుల్లో సవాలు చేయలేదు.

మూడవ ఉదాహరణ మరింత వక్రమైనది. ఢిల్లీ, సఫ్దర్‌జంగ్ అస్పత్రిలో మంత్రసాని శిక్షణ కోర్సుకని ఒక ప్రకటన జారీఅయింది పెళ్ళయిన స్త్రీలు, పిల్లలున్న వాళ్ళకు ప్రవేశం లేదనీ, కేవలం "అవివాహిత స్త్రీ"లకు, లేక "మరే భారాలులేని వితంతువు"లకు మాత్రమే ప్రవేశం వుంటుందని అందులో స్పష్టంగా పేర్కొన్నారు. అయితే ఈ నిబంధనమకూడ యింతవరకు ఎవరూ కోర్టులో సవాలుచేయలేదు.

గర్భం దాల్చడం, పిల్లల్ని కనడం, తల్లిగా సంఘంలో ఒకపాత్ర వహించడం ఆడవాళ్ళకు ఒక విధంగా జీవశాస్త్రపర విధులని చెప్పవచ్చు. మరి అలాంటి విధులకుగాను మహిళా ఉద్యోగులను, ఉద్యోగాలకోసం దరఖాస్తుదారులను ఏవిధంగా శిక్షిస్తున్నారో చూపించడానికే నేని ఉదాహరణలు ఎన్నుకొని మరీ పేర్కొన్నాను. మహిళల సామర్థ్యాన్ని పొందు పరిచే ఒక "భారం" పిల్లలనేముందు ఊహ దీనికి కారణం. అంతేగాక చట్టంకోరే ప్రసూతి సహాయాలను చెల్లించకుండా తప్పించుకునేందుకు ఈ నిబంధనల్ని ప్రత్యేకించి రూపొందించినట్లున్నారు. అందరినీ మించి, రాజ్యాంగ సాంప్రదాయాలను, ఆదేశాలను అమలుపర్చడంలో మంచి

ప్రమాణాలు నెలకొల్పవలసిన ప్రభుత్వ శాఖలే ఎలా వాటిని వుల్లం ఘించాయో పై వుదాహరణల్లో రెండు స్పష్టం చేస్తున్నాయి. (ప్రసూతి సహాయాల చట్టం నిబంధనలను యజమానులు ఎలా అతిక్రమిస్తున్నారో, ఆ చట్టంకింద తమ మహిళా ఉద్యోగులు అర్హులుకాకుండా చూచేందుకు ఎలాంటి కిటుకులు వుపయోగిస్తున్నారో నేనీ వ్యాసంలో చర్చించడం లేదు. అలాగే అంగ వివక్షకు సంబంధించిన మిగతా అనేక దుష్ట ఉదా హరణలను : వృత్తి శిక్షణ లభ్యత విషయంలో వివక్ష, కొన్ని అల్ప వేతన ఉద్యోగాల్లోనే స్త్రీల విశేష నియామకం, లింగ ప్రాతిపదిక పై ఉద్యోగాలు వేరుచేయడంవల్ల వివక్ష, సమాన ప్రతిఫలాల చట్టంలోని లొసుగులు, స్త్రీలకు ఉద్యోగాలు నిరాకరించేందుకు ఏవిధంగా పరిరక్షణా శాసనాలను ఉపయోగిస్తున్నారు మొదలైన సందర్భాలనుకూడ ఈ చిన్న వ్యాసంలో తడమబోవడం లేదు).

ఈ వ్యాసం పరిధిలో, నేను ప్రస్తావించదల్చిన మరో విషయం ఏమంటే ప్రస్తుతం వ్యాప్తిలోవున్న అంగ వివక్షా దృక్పథాలు చాల లోతుగా వేళ్లూనుకొని వున్నాయి ; కనుక కేవలం న్యాయపరిహారాలు మాత్రమే అయితే సరిపోవనేది విస్పష్టమే.

శ్రీ చరణ్‌సింగ్ ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు 1970 లో, ఆ రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి రాసిన ఒక లేఖలో స్త్రీలను ఐ. ఏ. ఎస్. లో నియమించకూడదని, అథవా నియమించినా అలాంటి మహిళా అధికారుల్ని కనీసం తమ రాష్ట్రానికి పంపకుండానైనా చూడాలని కోరింది. భారతదేశంలో మహిళల హోదాపై పరిశీలనకు నియమించబడ్డ కమిటీ సమర్పించిన 1975 వ సం॥ నివేదికలో మొదటి అధ్యాయంలోనే ఈ విషయం పేర్కొన్నారు. సైనిక వైద్యసేవలోనైతే 1972 వరకు స్త్రీలు పెళ్ళవగానే ఉద్యోగాలు వదిలివేయాల్సి వచ్చేది. ఈ కమిటీ తన నివేదిక తయారుచేసే సమయంలో డాక్టర్లకుగాని, నర్సులకుగాని వేతనంతో కూడిన ప్రసూతి సెలవు సౌకర్యం లేకుండెను. అలాగే రాజ్యాంగ ఆదేశాలను ఖాతరుచేయకుండా, తమిళనాడు, రాష్ట్రప్రభుత్వం వ్యవ

సాయ రంగంలో నాట్లు వేసే మహిళలు, మగవారికి అసమాన వేతనాలు స్థిరపరిచింది. ప్రభుత్వ వర్గాల్లోనే యిలాంటి దృక్పథాలు పాతుకుపోయి వున్నప్పుడు యిక ప్రైవేటురంగం గురించి వేరుగా చెప్పనక్కర లేదను కుంటాను.

అంతేగాక, యిప్పుడున్న రాజ్యాంగ నిబంధనలు ప్రైవేటు రంగానికి వర్తించవని ప్రస్తుతపు న్యాయపర వివరణలద్వారా అనిపిస్తున్నది. ప్రైవేటురంగం "చట్టబద్ధంగానే స్త్రీలపట్ల వివక్ష చూపించవచ్చ"ని తీర్పిచ్చిన కోర్టుల" "పూర్వాచార పరాయణ" దృక్పథాన్ని యిటీవల 1982 లో లింగపర న్యాయం గురించి చేసిన ప్రసంగాల్లో న్యాయమూర్తి క్రిష్ణ అయ్యర్ దుయ్యబట్టారుకూడ. "రాజ్యం" అనే పదం ప్రభుత్వరంగ సంస్థలకు కూడ వర్తించేట్లు సుప్రీంకోర్టు ఉదారంగా వివరణలు యిచ్చిందని, కనుక రాజ్యాంగంలోని 14, 16 వ అధికరణాలను శిరసావహించేట్లు ప్రైవేటురంగాన్నికూడ వత్తిడి చేయవల్సిన సమయం యిపుడు ఆసన్నమైందని ఆయన పేర్కొన్నారు.

ఇంతకుముందు నేను పేర్కొన్న కేరళ కేసుల సందర్భంలో, స్త్రీలకు 4 వ తరగతి ఉద్యోగాలు యివ్వ నిరాకరించినందుకు ఆ రాష్ట్ర ప్రభుత్వాన్ని న్యాయమూర్తి ఖొట్టి నిశితంగా ఖండించారు. స్త్రీలు కొన్ని ఉద్యోగాలు చేయవచ్చునా, కూడదా అని నిర్ణయించవల్సింది పురుషాధిక్యత గల శాసనసభగాని లేక పురుషాధిపత్యంలోని నిరంకుశోద్యోగి వర్గం కాని కాదని ఆయన పేర్కొన్నారు. న్యాయమూర్తుల దృక్పథాల్లో హర్షణీయమైన మార్పులు వచ్చాయనడానికి ముత్తమ్మ, కేరళ కేసుల తీర్పులు మంచి చిహ్నాలు. నిశ్చయంగా అవి కనీసం కొందరు న్యాయమూర్తులైనా స్త్రీలు, ఉద్యోగ అర్హతలకు సంబంధించిన పాతచింతకాయ దృక్పథాలను తిరస్కరిస్తున్నారనడానికి తిరుగులేని చిహ్నాలే.

సైనిక న్యాయమూర్తి సేవలో ఒక స్వల్పకాలిక సేవా కమిషన్‌కు దరఖాస్తులు పెట్టుకునే అర్హత మహిళా న్యాయవాదులకు లేదని చెబుతూ 1970 దశకం తొలి భాగంలో సుప్రీంకోర్టు ఒక తీర్పు యిచ్చివున్నది. నాటికీ

నేటికీ న్యాయమూర్తుల దృక్పథాలు ఎంతో మారినట్లు ఈ తీర్పులు (ముత్తమ్మ, కేరళ కేసుల తీర్పులు) రుజువు చేస్తున్నాయి. మరో సందర్భంలో, పెళ్ళిచేసుకున్న వెంటనే ఉద్యోగాలు కోల్పోవాల్సివచ్చే ఒక నిబంధనను సవాలుచేస్తూ అనేక బహుళజాతి ఔషధ సంస్థలకు చెందిన ఉద్యోగినులు బొంబాయి హైకోర్టులో దరఖాస్తు పెట్టుకొన్నారు. నాకు తెల్సినంతవరకు యిది పారిశ్రామిక వివాదాల చట్టం పరిధిలోకి వస్తుంది. బొంబాయి హైకోర్టు ఈ నిబంధన సమంజసమేనని తీర్పిచ్చింది. అయితే సుప్రీంకోర్టు మాత్రం "సాంఘిక న్యాయం ప్రయోజనాల దృష్ట్యా" ఈ నిబంధనను కొట్టివేసింది. కాని ఈ నిబంధనకింద అప్పటికే తొలగించబడ్డ ఉద్యోగినులను మాత్రం తిరిగి నియమించలేదు.

ఇక్కడ చెప్పుకోవల్సిందేమంటే, స్త్రీలపట్ల వివక్షనంతటినీ తొలగించేందుకు ఏర్పాటయిన ఐక్యరాజ్యసమితి సదస్సు రూపొందించిన ఒడంబడికలో 11 వ ప్రకరణం ప్రత్యేకించి వైవాహిక హోదా, గర్భధారణ లేక ప్రసూతి కారణాలపై స్త్రీలను బర్తరఫ్ చేయకుండా నిషేధిస్తున్నది. ఈ ఒడంబడిక 1981 లో అమలులోకి వచ్చింది. 1983 మార్చినాటికి 47 దేశాలు దీన్ని ధ్రువపరిచాయి ; కాని ఈ జాబితాలో భారతదేశం మట్టుకు లేదు.

ఈ సమస్య అంతటితో అత్యంత గంభీరమైన, కలవరదాయకమైన లక్షణమేమంటే స్వయంగా ప్రభుత్వమే ఒక అభివృద్ధి నిరోధక వైఖరి అవలంబించడం, ఎయిర్ హోస్టెస్‌ల కేసు కోర్టులో దాఖలయినప్పుడు మార్గరెట్ ఆల్వా, అంబికా సోనీ అనే యిద్దరు పార్లమెంటు సభ్యురాండ్రు రాజ్యసభలో ఈ విషయమై చర్చ ప్రారంభించి, వివక్షాపూరితమైన ఉద్యోగ నిబంధన లన్నిటినీ తొలగించాలని డిమాండు చేశారు. దీన్ని అవకాశంగా తీసుకొని ఈ బాధాకర నిబంధనలను సమీక్షిస్తామని, న్యాయాన్ని సునిశ్చయం గావిస్తామని హామీ యిచ్చేందుకు బదులు అప్పటి పౌరవిమానయాన మంత్రి అవసరాన్నిమించి అప్పుడున్న పరిస్థితులను వెనకేసుకొచ్చాడు; అసలు అవి వివక్షాపూరితమైనవి కానేకావు పొమ్మన్నాడు. అంతేగాక, 35 సంవత్సరాల వయస్సుకు పదవీవిరమణ చేసుకున్న పిదపే ఎయిర్ హోస్టెస్‌లు ఎంచక్కా పిల్లలు కనవచ్చనీ,

ఎయిర్ హోస్టెస్‌లు తమ వృత్తి బాధ్యతల్ని నిర్వహిస్తారా లేక తమ పిల్లల్ని సాకడంలోనే నిమగ్నమవుతారా అనేదే యిక్కడ సమస్యనీ వాదించాడు. ఈ యుగంలో, ఈ సమయంలో ఒక మంత్రి అంత నిరుపద్రవంగా యిలాంటి సమాధానాలు యివ్వగల్గుతున్నాడంటే నిజంగా దిగ్భ్రాంతి కలుగుతున్నది. మరి యిది జరిగింది 1981లో, అంటే రాజ్యాంగాన్ని లాంఛనంగా ఆమోదించిన తర్వాత 34 సంవత్సరాలకు, మహా ఆర్భాటంగా అంతర్జాతీయ మహిళా సంవత్సరం జరుపుకున్న అనంతరం ఆరు సంవత్సరాలకు, అనే విషయం మట్టుకు మరిచి పోకండి.

ఈ కేసులో అత్యున్నత న్యాయస్థానం యిచ్చిన తీర్పుకూడ ఎంతో ఆశ్చర్యం కలిగించింది. తీర్పురాకమునుపు ఒక సుప్రీంకోర్టు అడ్వొకేటు "ఇండియా టు డే" పత్రికలో రాస్తూ ఎయిర్ హోస్టెస్‌ల వాదం చాల బలంగా వుందని, కనుక దీన్ని అవకాశంగా తీసుకొని సుప్రీంకోర్టు "మహా రాజుకు కొంత ఆధునికతను బోధించగల" దనేది ముందుగానే చెప్పేయ వచ్చని సూచించాడు. అయితే తీర్పు వచ్చిన అనంతరం దానిపై ఈ పత్రిక వ్యాఖ్యానిస్తూ, రాజ్యాంగంలో వ్యక్తమైన "ఏకలింగ" దృక్పథాన్ని (యిది ఆ పత్రిక అభివర్ణన) చక్కగా వివరించే అవకాశాన్ని సుప్రీంకోర్టు జారవిడుచుకున్నదనే చింత వ్యక్తం చేసింది. ఇటీవలికాలంలో అణగారిన వర్గాలకు అనుకూలంగా సుప్రీంకోర్టు ఎన్నో చారిత్రాత్మక తీర్పులు యిచ్చి వున్న మూలంగా యిది మరింత నిస్పృహను కలిగించేదిగా వుంది. ఆఖరుకు శ్రీమతి ఇందిరాగాంధీ కూడ ఆ సమయంలో ఎయిర్ హోస్టెస్ పనికి 45 ఏళ్ళ వయస్సు అంటే "మరీ ఎక్కువే"నని ప్రకటించి తన సాంప్రదాయిక, లింగపర వైఖరిని వెల్లడించుకున్నది. అంటే యవ్వన సౌందర్యానికి, పని అర్హతకు ఆమె లంకె పెట్టిందన్నమాట. అయితే ఈ విధమైన లంకెను స్వయంగా సుప్రీంకోర్టే కఠిన పదజాలంతో ఖండించిందని, యిలాంటి లింగపరమైన నియమాలను వెనకేసుకు వస్తున్నందుకు విమానమార్గ మేనేజిమెంటుకు తీవ్ర ఆక్షేపణలు తెలిపిందని తెలుసు కోవాలి.

ముత్తమ్మ కేసు, ఎయిర్ హోస్టెస్‌ల (విమాన సేవికల) కేసులు రెండింటి విషయంలోను, యిలాంటి బాహాటంగా వివక్షా పూరితమైన ఉద్యోగ నిబంధనల్ని సవాలు చేసేందుకు ఆ ఉద్యోగినులకు మూడు దశాబ్దాలు పట్టిందా అని వ్యాఖ్యాతలు ముక్కుపై వేలేసుకున్నారు. నిజానికి, విమాన మార్గ మేనేజిమెంటు చేసిన ఒక వాదంకూడ యిదే- ఇంతకాలంగా ఒక నిబంధన సవాలు చేయబడలేదంటే అది సజావుగానే వున్నట్లని, భవిష్యత్తులో న్యాయపరమైన సవాళ్ళు ఎదురవకుండా దానికి రక్షణ లభించినట్లేనని వారు వాదించారు!

అలాగే, లేడీ హార్డింజ్ డాక్టర్ల కేసు ప్రముఖంగా పత్రికల కెక్కినప్పుడు, దాని విషయమై పార్లమెంటులో కూడ ప్రశ్న వచ్చింది. అప్పుడు కేంద్ర ఆరోగ్యశాఖామంత్రి దానికి ఈ విధంగా జవాబు యిచ్చారు: "మొదటి సంవత్సరం వివాహిత జూనియర్ నివాసులను మినహాయిస్తే మిగతా లేడీ హార్డింజ్ డాక్టర్ల కెవరికీ గర్భం ఒక అడ్డంకి కాదు". అంటే, తన దృష్టికి తేబడిన ఒక అన్యాయాన్ని సరిచేయడానికి బదులు, ఆ మంత్రి చాల అసంతృప్తికరమైన ఒక జవాబిచ్చాడన్నమాట. జూనియర్ మహిళా డాక్టర్లకు వ్యతిరేకంగా కొనసాగే విపక్షను ఒక విధంగా సమర్థించినట్లే అయింది.

అయితే ఇక్కడ మరో విషయం చెప్పుకోవాలి. ప్రసూతి సంబంధ శాసనాలకు సంబంధించిన ఒక అంతర్జాతీయ శ్రామికసంస్థ సంకలనం ప్రకారం ప్రసూతి శెలవులప్పుడు ఉద్యోగినులను బర్తరఫ్ చేయడాన్ని అనేక దేశాలు నిషేధించినా, గర్భందాల్చిన కాలంలో బర్తరఫ్‌లను ఏవో అతి కొద్ది దేశాలు మాత్రమే రద్దుచేశాయని తెలుస్తున్నది. గర్భవతులయిన జూనియర్ డాక్టర్లను నియమించడానికి తిరస్కరించే చిన్న కిటుకుద్వారా లేడీ హార్డింజ్ అధికారులు ఏ విధంగా ప్రసూతి సహాయాలు చెల్లించవల్సిన అగత్యాన్ని తప్పించుకుంటున్నారో మనకు స్పష్టమవుతున్నది.

మరి దీనికి ఇంటర్నేషనల్ సోషలిస్టు రివ్యూ (1974 మార్చి) నుండి ఒక చిన్నతోక చేర్చి చెబుతాను. ఒకప్పుడు అమెరికాలో యజమానులు

తమవద్ద ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకునే స్త్రీలను ముందుగా గర్భ పరీక్ష చేయించుకోమనేంతవరకు వెళ్ళేవారు. అంతేకాదు, గర్భపరీక్షలు జరిపే ఒక ప్రయోగశాలవారు ప్రముఖ పత్రికల్లో ఈ విషయమై అనేక ప్రకటనలుకూడ గుప్పించారు. అందులో యిది ఒకటి : "కంపెనీ ఆమెను నియమించే ముందుగా ఆమె గర్భవతి కాదని నిశ్చయం చేసుకొనండి. మీ ఉద్యోగపూర్వక శారీరక పరీక్షల్లో గర్భ పరీక్షను ఒక వాడుక అంశంగా చేసుకొనండి. మీ కంపెనీ ఖరీదైన శిక్షణా కార్యక్రమాల్లో అలాగే ఆరోగ్య సంరక్షణా, జ్వర చికిత్సా చెల్లింపులతో నిమగ్నమయ్యేముందు గర్భ వతుల్ని కనిపెట్టేయండి !"

మన ఆరోగ్యశాఖామంత్రి సమాధానం కూడ యిదేవరసలో వుంది. కాకపోతే కాస్త నయం, ఆయన ఈ ప్రకటనను ఉదహరించి, లేడీ హార్డింజ్ నిబంధనలు "ఖర్చుకు తగ్గ సామర్థ్యంతో నడిచే ఆస్పత్రి నిర్వహణ"కుగాను రూపొందించబడిన "అధునాతన మేనేజిమెంటు (నిర్వహణా) కిటుకులు" అనైతే అనలేదు ! అయితే నిజానికి ఆ నిబంధనల అసలు ఉద్దేశ్యం మాత్రం అదే సుమండీ. ఉద్యోగినులకు వ్యతిరేకంగా అత్యంత వివక్షాపూరిత ఆచారాలన్నీ ఎందుకయ్యా అంటే చివరికి యజమానుల డబ్బు మిగిలించేందుకేనని తేలుతుంది.

మహిళలు మొట్టమొదట పనిస్థలంలో తమకున్న న్యాయపర, రాజ్యాంగబద్ధ, మానవ హక్కు లేమిటో తెలుసుకోవాలి. ఈ హక్కుల్ని తమ ఉద్యోగ పరిస్థితుల్లో పొందుపరచబడి తమ ఉద్యోగాలకు తగు రక్షణలు లభించేటట్లు వారు కృషిచేయాలి. ఈ హక్కుల్ని ఉల్లంఘించినప్పుడు తగు పరిహారాలు సమర్పించే యంత్రాంగం ఒకటి వుండాలని వారు డిమాండు చేయాలి. ఈ అన్ని రక్షణలకు తోడ్తోడుగా అంతే ముఖ్యమైన-అయితే, బహుశా అంతకంటె కష్టమైన పని యింకొకటి జరుగుతూండాలి. అదేమంటే స్త్రీలను గురించి, వారి పని గురించి వున్న పాత చింతకాయ, లింగపర అభిప్రాయాలను తొలగించడానికిగాను విధాన ప్రణాళికల్లో, నిర్ణయ ప్రకటనల్లో సకలస్థాయిల్లో స్త్రీ పురుష ఉభయులకు-సకల ప్రజలకు తీవ్ర విద్యాబోధ జరగాలి.

(తే 31-3-85 దిన హైదరాబాద్‌లో జరిగిన "స్త్రీలు : ఉద్యోగం" అనే సెమినారులో సమర్పింపబడిన వ్యాసం)

---

# అధికార సారవిజ్ఞానం
# ( Ontology of Power )

## ఒక భౌతికవాద, మహిళావాద జ్ఞాన మీమాంస దిశగా

—శిశిర్ భట్టాచార్య
హైద్రాబాదు యూనివర్సిటీ

ఒక సోదాహరణ సాంఘిక సిద్ధాంతాన్ని రూపొందించాలంటే మనం అధికార భావనతో కుస్తీపట్టక తప్పదు. సమాజాల్లోని ప్రజల మధ్య సంబంధాలను ప్రజల అవకాశాలను పరిమితంచేసే, తీర్చిదిద్దే కేంద్రభావన అధికారం. అన్ని రకాల యిచ్చిపుచ్చుకోళ్ళను హెచ్చుమేరకు అధికారమే నిర్ణయిస్తుందని, అధికారమనేది పురుష లైంగికతతో ముడివడి వున్నదనే వైఖరి ఈ వ్యాసంలో మేము తీసుకున్నాము. ఈ రెండు మాదిరులలో మొదటిది మార్క్సిస్టు మాదిరి అయితే రెండవది మహిళా వాద మాదిరి. మానవుల కలివిడితనం పరిమితంగా వున్నప్పుడు, వారి పరస్పర సంబంధాల్లో ఆధిపత్యమే (domination) కేంద్రాంశంగా వున్నప్పుడు అధికార సంబంధాల ప్రాతిపదికపై నెలకొన్న సమాజాలు అతి పెళుసుగా వుంటాయని అర్థంచేసుకోవడానికి ఈ మాదిరులు దోహదం చేస్తాయి. ప్రణయానికీ (eros) అధికారానికీ నడుమనున్న లంకెవల్ల లైంగికతా (sexuality) యితివృత్తానికీ, సాముదాయక విలువలపైఖరి దాని ఆధిపత్య సరళి అనే యితివృత్తానికీ మధ్య సంబంధాలు కమ గొనడం వీలవుతుంది. "వ్యక్తిగత జీవిత" రంగంలో అంటే "పునరుత్పత్తి రంగం"లో ఆధిపత్యానికి, "సముదాయగత జీవితం"లో అంటే "ఉత్పత్తి రంగం"లో ఆధిపత్యానికి మధ్య భేదాభేదాలను గురించి కూడ మనం యోచించవచ్చు. శ్రేయోరాజ్యాల్లో కార్మికవర్గాల్లో హెచ్చుభాగం అధికారానికి సంబంధించిన ఆధిపత్య లక్షణాలను తెలియకుండా వుంటారు. అలాగే, ఆధిపత్యం అనేది కేవలం శ్రమపై పెట్టుబడి పెత్తనానికే పరిమితం

గాక ఆడపై మగ పెత్తనానికికూడ వర్తిస్తుందనేది కూడ స్త్రీ పురుషులు సాధారణంగా గ్రహించలేకపోతారు.

రెండు సువిశాలమైన సాంఘిక కూర్పులు/లేక వర్గాల గురించి మార్క్స్ యోచించాడు. వాటిల్లో ఎక్కువ సంపన్నమైనది, ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం, ఆధిపత్యం గల వర్గమే (పరస్పర) సంబంధాలను నిశ్చయిస్తుందని భావించాడు. అయితే ప్రతివర్గంలోకూడ గణనీయమైన అంతరా లుంటాయి. ఈ సాధారణ వర్గీకరణ ఆ అంతరాలను దాచిపెడుతుంది. యాజమాన్య వర్గంలోని సభ్యులంతా యజమానులు కారు. ఈ విలాసవర్గంలోకూడ స్త్రీలపై యాజమాన్యం (దాదాపు) పురుషులదే. వాళ్ళు పురుష ప్రణయం దయాదాక్షిణ్యాలపై బతకాల్సివచ్చే ఒకానొక అధికారవిహీన కార్మికవర్గంలాగ వుంటారు. కార్మిక వర్గాలలోకూడ పురుషులు స్త్రీలపై యాజమాన్యం, పెత్తనం చెలాయిస్తుంటారు. ఈ రెండు సందర్భాల్లోకూడ, స్త్రీ పురుషుని అంతగానూ చదువుకుని వున్నా, అంతగానూ సంపాదిస్తున్నా ఒకలెక్కలోకి రాదు. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం వున్నా, కుటుంబంలో లేక కుటుంబం వెలుపల పురుష సభ్యులతో యిచ్చిపుచ్చుకోళ్ళను నిశ్చయించే అధికారం స్త్రీకి వుండదు. కనుక సాంఘిక వాస్తవికత నిజస్వభావాన్ని అర్థంచేసుకోవాలంటే అధికార సారవిజ్ఞానానికి, జ్ఞాన మీమాంసకు మధ్య భౌతికవాద, మహిళావాద మార్గంలో ఒక నూతన సంబంధం నెలకొల్పాలి. "మహిళల స్థితి/పాత్ర/హోదా"లను విశ్లేషించేందుకు బదులు వివిధ ఉత్పత్తి విధానాలలో గృహశ్రమ (ఇంటి పని) ఎలా ప్రత్యేకంగా అభివ్యక్తమవుతున్నదో శ్రద్ధగా పరిశీలించాలి.

* * * * * *

ఫ్యూడల్ విలువలకు అంటిపెట్టుకొని వుంటూ అంతకంతకు అధికంగా పెట్టుబడిదారీ విధానానికి మారే ఒక సమాజంలో "స్త్రీలను స్త్రీలుగా ఒక ఏకరీతి విశ్లేషణాత్మక తరగతి"గా ఊహించుకోలేము. అంతకంటే "ఉత్పత్తి సాధనాల యాజమాన్యం" అనే నికషం (Citerion) తో మొదలుపెట్టి చరి

త్రలో వర్గాల ఏర్పాటుకు కారణాలు అన్వేషించడంపై శ్రద్ధ చూపి స్త్రీ అప్పుడు స్త్రీల లొంగుబాటు స్థితి (Subordination) ని మరింత మెరుగ్గా అర్థం చేసుకోవచ్చు. మానవజాతి ఏకలింగం కాదు. రెండు లింగాలతో కూడివున్నది. అభివృద్ధి స్థాయి, వేగం ఏమైనా కులీన అల్పసంఖ్యాక శ్రేణులకు చెందని మహిళలకు అభివృద్ధిలో వారి వాటాను ఎన్నడూ యివ్వలేదు. కాకపోగా, వారు ప్రతికూల ఫలితాలు చవిచూచారు. "మహిళల స్థితి/పాత్ర/హోదా"లను విశ్లేషించేందుకు బదులు వివిధ ఉత్పత్తి విధానాలలో గృహశ్రమ (ఇంటిపని) ఎలా ప్రత్యేకంగా అభివ్యక్తమవుతున్నదో శ్రద్ధగా పరిశీలించాలి. మన సమాజాలు లింగరీత్యా (కూడ) చీలివున్నాయి. శ్రమవిభజనలో స్త్రీల న్యూనతా స్థితిని, స్త్రీ పురుషుల సాంప్రదాయక పాత్రల్ని ఈ వాస్తవం కట్టడి చేస్తున్నది. అధికార సంబంధాల సమ్మేళనం (confluence) వల్ల మన సమాజంలో లింగపర వేధింపు పుట్టుకొస్తున్నది.

మనమిప్పుడు లింగ సంబంధ రాజకీయ అర్థశాస్త్రం గురించి గంభీరంగా యోచించవల్సిన సమయం ఆసన్నమైంది. అంటే లైంగికతను గురించి, లింగపర విభజన గురించి ఒక భౌతికవాద పరిశీలన చేయవల్సిన సమయం వచ్చింది. ఇలాంటి భౌతికవాద పరిశీలన ఉత్పత్తి సంబంధాలకు సంబంధించిన మార్క్సిస్టు పరిశీలనతో తూగేదిగా వుండాలి. మగవాళ్లుగా మగవాళ్ళకు ఆడవాళ్ళుగా ఆడవాళ్ళు క్రమబద్ధంగా లొంగివుండేట్లు సంబంధాల్ని సృష్టించాలంటే లైంగికతా సాంఘిక క్రమాలు, సెక్స్ పరమైన శ్రమ విభజన అతి కీలకమైనవి. స్త్రీల ఈ లొంగుబాటు, స్త్రీలుకూడ ప్రవేశించే ఆయా వర్గసంబంధాలు కలిసి వర్గసమాజంలో స్త్రీల అణచివేత రూపాన్ని నిర్ణయిస్తాయి. మగవాళ్లతో సమాన షరతులపై వేతన శ్రమ రంగంలోకి ప్రవేశించిన వెంటనే స్త్రీల అసమానత అదృశ్యమైపోతుందనే ఎంగెల్స్ జోస్యం యింకా నిజంకావల్సే వున్నది. రూపుమాసిపోవడం అటుంచి, కుటుంబంలోని సెక్స్ పర శ్రమ విభజన పకడ్బందీగా వుండిపోవడమేగాక అసలు శ్రామికబలగంలోనే ఒక సమాంతర లింగపర విభజనను శాసిస్తూ తన స్వయం ప్రతిపత్తిని, మొండిపట్టును వెల్లడించు

కున్నది. ఇది తిరిగి దాని వంతుకు స్త్రీల గృహ సంబంధ పరాధీనతను దృఢతరం చేసింది.

తెల్ల చొక్కాల (III వ తరగతి) ఉద్యోగాల్లో వున్నా లేక నీలం చొక్కాల (IV వ తరగతి) ఉద్యోగంలోవున్నా పనిచేసే ఆడవాళ్ళ స్థితి గతులు మాత్రం ఒకేవిధంగా వున్నాయి. ఆమె తెల్ల వారీ తెల్లవారక ముందే లేచి పని ప్రారంభించాల్సి వుంటుంది. కుటుంబానికి అంతటికీ ఉదయం అల్పాహారం, తేనీరు (టీ) సిద్ధం చేయాలి; తర్వాత కుటుంబానికి మధ్యాహ్న భోజనం వండాలి; పిల్లలకు సక్రమంగా తినిపించాలి; ఆపై పిల్లలకు స్కూలు టిఫిన్లు, మొగుడికి మధ్యాహ్న ఆహారం అమర్చి యివ్వాలి; పిల్లలు అవసరమైన సరంజామా అంతా తమ స్కూలు సంచీల్లో వేసుకున్నారో లేదో పర్యవేక్షించాలి; మళ్ళీ వచ్చేలోగా ఏం చేయాలో ఇంట్లోవుండే ఎవరికైనా సవివరంగా ఉత్తరువులు యివ్వాలి; ఆనక తాను ఎంతోకంత గొంతులో వేసుకుని, బస్సుస్టాపుకో లేక పని స్థలానికో పరుగులు పెట్టాలి. మధ్యాహ్న భోజన విరామకాలంలో కూడ అదోయిదో కొనడానికి మార్కెటుకు వెళ్ళిరావాల్సి వుంటుంది. పని అయిపోయినాక, ఇంటికి జాప్యంలేకుండా మరలి, ఆ వెంటనే తిరిగి ఇంటిపనిలోకి దూకాల్సి వుంటుంది. అంటే రాత్రిభోజనం తయారుచేయడం, పిల్లలచే తినిపించడం, వాళ్ళని నిద్రబుచ్చడం మొదలైన పనులన్నమాట. కనుక తీరిక సమయ మనేది దాదాపుగా వుండదు. ఒకవేళ తీరిక దొరికినా, దాన్ని ఉపయోగించుకునే తెరువుండదు. పట్టణవాసులయితే అప్పుడప్పుడూ ఏ సినిమాకో పోవచ్చు, లేక మరే వినోదాలనైనా ఆనందించవచ్చు. కాని పల్లె ప్రజలకు మాత్రం యిలాంటివేమీ ఉండవు; ఉన్నా వాళ్ళు అచ్చుకోలేరుకూడ. సరే, ఇల్లాలు రాత్రి పడుకుని లేస్తే మళ్ళీ తెల్లారిటినుండీ తిరిగి యిదే విసుగు పుట్టించే వరస.

లింగపర విభజనలో ఏదో "సహజత్వం" వున్నదనే భావనే ఆడవాళ్ళను ఇళ్ళకే పరిమితం చేసి, వారిని మగవాళ్ళకు అధీనుల్ని చేసేందుకే దారితీస్తుంది. స్త్రీలు పిల్లల్ని కనేట్లు ప్రకృతి నిర్దేశిస్తున్నది గనుక ఆ

పిల్లల్ని తామే పెంచి పెద్దచేయడంకూడ స్త్రీల సమాజ విధి అని చాలమంది ప్రగాఢంగా విశ్వసిస్తుంటారు. దీనికితోడు ఇంటి మగాళ్ళకుకూడ వాళ్లు (ఆడవాళ్లు) సేవలు చేయాలని ఆశిస్తారు. వాళ్లకు ఉద్యోగాలు ఏవైనా యిస్తే అవి మగవాళ్ళకు అంతగా అవసరంలేని నాసిరకం ఉద్యోగాలు మాత్రమే యివ్వాలంటారు.

విద్య, ఆహార ప్రమాణం, వ్యక్తి స్వేచ్ఛ, పాత్ర నిర్వహణల విషయంలో ఆడవాళ్ళకు, మగవాళ్ళకు వేరువేరు (సాంప్రదాయిక) ప్రమాణాలు (norms) వర్తింపజేస్తూనే వున్నారు. తల్లిదండ్రులు, ఇంటి పరిస్థితులు జనింపజేసి, కాలగమనం పెంచి పోషించే వివక్షాభావంవల్ల తాను ఆడవాళ్ల కంటె శ్రేష్ఠుడిననీ, తనను, తమ పిల్లలను, ఇంటిని కనిపెట్టి చూచుకోవడమే ఆడదాని ప్రధాన విధి అనే దృఢవిశ్వాసం మగవాడిలో పాదుకుపోతుంది. కేవలం ఆర్థిక కారణాలవల్ల కుటుంబ పోషణకు ఆడ, మగా యిద్దరూ పని చేయాల్సి వచ్చేటప్పుడుకూడ ఈ దృక్పథం అలాగే కొనసాగితే తీవ్ర సమస్యలు తలయెత్తుతాయి. ఆహార సంపాదనా పాత్రలో పాలుపంచుకోవడానికి మరీ అంత అయిష్టత వ్యక్తం చేయకుండానే ఆడది అంగీకరిస్తుందిగాని, మగవాడుమాత్రం ఆమెతో సమానంగా ఇంట్లో వంటలో, అంట్లు తోమడం, పిల్లల్ని ఆడించడం మొదలైన చాకిరీలో పాలుపంచుకోవడం మట్టుకు తన తాహతుకు తక్కువగా భావిస్తాడు.

స్త్రీలు ఇంటి బయట పూర్తిసమయం పని చేసినా లేక కొంత సమయమే (part time) పనిచేసినా ఇంట్లోమాత్రం ఎంతలేదన్నా రోజుకు 6 గంటలు అంటే వారానికి 42 గంటలు పనిచేయాల్సిందే. అదే వాళ్ల మొగుళ్లయితే ఏదో రోజుకు ఒకగంటో అరగంటో అంటే వారానికి 9-10 గం॥కు మించకుండా మాత్రమే ఇంటిపని చేస్తారు. కనుక ఆడవాళ్ళుగా కుటుంబంలో వారి అణచివేతకు, స్త్రీ కార్మికులుగా వారిపై దోపిడీకి మధ్య ప్రత్యక్ష సంబంధమే ఉన్నది. ఉద్యోగ విపణిలో ఒక మురికిపేట వంటి ప్రదేశాన్ని ఆడవాళ్లకు కేటాయించారన్నమాట. ఇది ఇంటిలో వారి హీన స్థాయిని ప్రతిబింబిస్తుందంతే. మెరుగైన వ్యవసాయ పద్ధతుల గురించిన

శిక్షణా తరగతుల్లో స్త్రీలకు ఎప్పుడూ చేరుకున్నట్లు కనబడదు. లేక పాడి పెంపకం, కోళ్ళ పెంపకం, యితర గ్రామీణ కుటీర పరిశ్రమలకు సంబంధించి స్వయం ఉపాధికల్పనా పథకాలు ప్రారంభించడానికి వాళ్ళకు ప్రోత్సాహమిస్తున్నట్లూ అగుపించదు. ఒకప్పుడు చేనేత, వడ్లదంపకం, పొగాకు పదును పెట్టడం, తోళ్ల క్యూరింగు, మొదలైన గ్రామీణ గృహ పరిశ్రమల్లో ఎంతోమంది గ్రామీణ స్త్రీలకు పనులు దొరుకుతూ వుండేవి.

యంత్రాలు రావడంతో లక్షలాది మహిళలు తమ మునుపటి ఆ వృత్తుల్ని కోల్పోయారు. అసలుకు అభివృద్ధి క్రమమే వారు అంతకంతకూ మరింత ఒంటరిగా, మరింత నిస్సహాయంగా రూపొందేట్లు చేసింది. ఆడవాళ్ళు "వాస్తవానికి ఆర్థిక పరివర్తనవల్ల అత్యధికంగా బాధపడ్డవాళ్ళు" అని ఎవరో అన్నారు, నిజమే. వ్యవసాయరంగంలో ఒకానొక ఆసక్తి జనకమైన పరిస్థితి తలయెత్తింది. (ఆహార) నిల్వలు, పెంపుడు జంతువుల ఆలనపాలన చూచుకొనేది ఆడవాళ్ళేగాని ఈ పనులు చేయడానికి సంబంధించిన మెరుగైన పద్ధతుల్ని మాత్రం ఎక్కువగా మగవాళ్ళకే నేర్పుతుంటారు! స్త్రీలలో అత్యధికులు ఇంటి పనికత్తెలుగా, నర్సులుగా, పిల్లల స్కూళ్ళలో టీచర్లుగా, టైపిస్టులుగా, క్లర్కులుగా, వంటగత్తెలుగా, ఆహార తయారీ కార్మికురాండ్రుగా యిలాంటి యితర అనేక తక్కువ వేతనాల ఉద్యోగాలు చేసేవారిగా నియమింపబడుతారు. అయితే మన సమాజంలో వారికి దొరికే అత్యంత ముఖ్యమైన పదవి మాత్రం "పెళ్ళి"లోనే - మిగతా అన్ని పదవులకు ఈ "పెళ్ళి" తర్వాతి జీవితం పూర్తి ప్రత్యామ్నాయమని చెప్పవచ్చు. పెళ్ళికోసం పదవిని తేలిగ్గా వదులుకొంటారు. మాటలోమాట, ట్రేడ్ యూనియన్లపై స్త్రీల ప్రభావం అంతగా వుండకపోవటానికి కారణంకూడా యిదే. ఒకసారి పెళ్ళయ్యాక స్త్రీలు అతితరుచుగా తమ ఆశయాలకు సంబంధించి "పారు బోతు"లు కావాల్సి వస్తుంది. అంటే తమ ఆశయాలను వదులుకోవలసి వస్తున్నది.

స్త్రీల అణచివేతను మార్క్సిస్టు పరిభాషలో పూర్తిగా వివరించలేమని కూడ గమనించాలి. పెట్టుబడిదారీ విధానంలో శ్రమ విభజన

లింగ ప్రాతిపదికపై, అంటే; లింగపర శ్రమ విభజనగా వ్యవస్థీకృతం అవుతుందని అనుకోవడానికి తార్కిక దాఖలాలు ఏవీలేవు. పెట్టుబడి - శ్రమ సంబంధం లింగపరంగా గుడ్డిది. ప్రస్తుతం లింగపర గుర్తింపు పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలకు కీలక ప్రాముఖ్యత కలిగిన అంశంగా వున్నదనే మాట వాస్తవమే. కాని దీని విపర్యం (reverse) మాత్రం సత్యంకాదు. స్త్రీల హీన స్థితిని, వారి అణచివేతను మొత్తంగా వివరించడం ఈ విధంగానైతే సాధ్యం కాదు. స్త్రీల లొంగుబాటుకు భౌతిక ప్రాతిపదికను పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలోనే గాక పెళ్ళి, రక్తబాంధవ్యం, లైంగికతల కట్టడాల్లో కూడ కనుగొనవచ్చు. స్త్రీల లొంగుబాటును శాశ్వతం గావించే భౌతిక, భావ జాలపద శక్తులన్నీ పితృస్వామ్యం అనే ఒక సంస్థలో అభివ్యక్తమవుతున్నాయి. పిల్లల పెంపకంతో మగవాళ్ళు కూడ పాలుపంచుకుంటే అది ఆడవాళ్ళ మోతబరువును తగ్గించడమే గాక, అంతకంటె ముఖ్యంగా, లింగపర విభజనల్ని బలహీనపరుస్తుంది. పిల్లల పెంపకంలో లేక ఇంటిపనులు చేయడంలో మగవాళ్లు ఎక్కువగా పాల్గొన్నంత మాత్రాన స్త్రీలపై వాళ్ళకుండే పట్టు దానంతటదే సడలిపోతుందని యిక్కడ ఎవ్వరూ అనడంలేదు. స్త్రీ విముక్తికోసం ఆడవాళ్లు ఆర్థికంగా స్వతంత్రులై, తమ్మి తాము సుసంఘటితం చేసుకొని, అనేక స్థాయిల్లో, అనేక రంగాల్లో శక్తివంతమైన వుద్యమాలు సాగించాల్సి వుంటుంది. వాళ్ళు సమైక్యంగా వుండి, వాళ్ళ (ఆడవాళ్ల) వీపులపై భారంమోపే సాంఘిక వ్యవస్థను నడపడం మగవాళ్లకు రాజకీయంగా నష్టదాయకమయేట్లు చేయగలగాలి. ట్రేడ్ యూనియన్లు పురుషులకు, ప్రత్యేకించి నిపుణతగల పురుషులకే చెంది వుంటున్నాయి. స్త్రీల ప్రత్యేక సమస్యల కెన్నడూ తగిన ప్రాధాన్యం, శ్రద్ధ లభించలేదు. అసలు "సంపాదనాపరుడు" (bread-winner) అనే పదమే సాంప్రదాయికంగా కుటుంబంలో మగవాడికి వర్తింపజేస్తుంటారు. దానితో కుటుంబంలో అతని ఆధిపత్యానికీ, స్త్రీలు అల్పసంఖ్యాకులుగా వుండే పని స్థలంలో అతని ప్రాబల్యానికీ ఎదురే వుండదు. ఈ కారణాలవల్ల కార్మిక వర్గం సజాతీయంగా ఏమీలేదని, కాకపోగా, లింగపర గుర్తింపులకు (Sex) కేటాయించే పాత్రలు, పట్టింపులనుబట్టి ఖచ్చితంగా చీలివుందని రుజువవుతున్నది.

భారత ప్రజల సంక్షేమానికి సంబంధించిన అత్యధిక సమస్యల విషయంలోలాగే స్త్రీ శ్రేయస్సు సమస్యకూడ వ్యవసాయిక లక్షణం కలదే. నిరుద్యోగము, రాజ్యాంగబద్ధమైన హక్కుల నిరాకరణ, భర్తచే, అత్త మామలచే దుర్వ్యవహారం, భూస్వామ్యం చేతుల్లో మానభంగాలు మొదలైన ఘటనలకు వ్యవసాయ రంగంలో దుస్థితికి చాల దగ్గర సంబంధం వుంది. స్త్రీ శ్రామికుల్లో అధిక భాగం తమ పోషణకై ఈ వ్యవసాయ రంగంపైనే ఆధారపడుతారని మరిచిపోకూడదు.

అయితే స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినంతమాత్రంలో భారత దేశంలో స్త్రీలు శతాబ్దాలుగా అనుభవిస్తూ వస్తున్న కష్టాలన్నీ వాటంతటవే మాయమౌతాయనుకోవడం అమాయకత్వమే అవుతుంది. లింగ, కుల విభేదాలతో నిమిత్తం లేకుండా సర్వమానవులు ప్రాథమికంగా సమానులు, అందరికీ ఒక ఆత్మగౌరవం వుంది అని స్త్రీ పురుష లుభయులకీ బోధించి చైతన్యవంతుల్ని చేసేందుకు ఒక స్థిరమైన దీర్ఘకాల కార్యక్రమం అవసరం. ఆర్థిక స్వాతంత్ర్యం ఒక ముందు షరతే ; కాని భారతదేశంలాంటి వెనుకబడిన ఆర్థిక విధానం గల దేశానికి స్త్రీలతో సహా బడుగువర్గాల ప్రజలందరికీ ఆర్థిక స్వాతంత్ర్యం సాధించిపెట్టడమనేది ఒక బృహత్తర కర్తవ్యం. స్త్రీల, బడుగువర్గాల అణచివేత, పీడనలు పాత ఫ్యూడల్ తరహా సాంఘిక, కుటుంబ రూపాలద్వారా శాశ్వతం చేయబడుతున్నాయి. మన దేశంలో పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం బలహీనంగా వుండడంచేత ఈ పాత ఫ్యూడల్ రూపాలను భగ్నం చేయలేకపోయింది. కాకపోగా పారిశ్రామికీకరణతో, నైతిక విలువలు సాధారణంగా తగ్గిపోవడంతో వరకట్న హత్యలు, సామూహిక మానభంగాలు, స్త్రీలపై అత్యాచారాలు మొదలైన యితర దోపిడీ రూపాలు ద్విగుణీకృతమయ్యాయి.

చారిత్రకంగా చూస్తే నిపుణతల లైంగికీకరణ (sennalisation of skills) జరిగిందని చెప్పవచ్చు. ఎందుకంటే కొన్ని కొన్ని ప్రత్యేక శారీరక శ్రమ రంగాలకే ఆడవాళ్ళను నెట్టివేసారు. వృత్తి నిపుణత లేక నిర్వహణా నిపుణత అవసరమైన ఉద్యోగాలకు ఆడవాళ్ళు అయోగ్యులని

యిదివరలో భావించేవారు. కుటుంబం బయట పనిచేయాలనే ఆడవాళ్ళ ఆకాంక్షల్ని మధ్యతరగతి స్త్రీలు సాధారణంగా అణచివేసుకునేవాళ్ళు. స్త్రీలు యిలాంటి కోర్కె వెలిబుచ్చితే అది కుటుంబంపట్ల వారికి తగు శ్రద్ధాసక్తులు లేకపోవడంవల్లేనని, అంటే వాళ్ళు ఆడవాళ్ళకు తగని రీతిలో ప్రవర్తిస్తున్నారని భావించేవాళ్ళు. అయితే ఆఫీసుల్లో, ఫాక్టరీల్లో, పొలాల్లో తాము పురుషులు సంపాదించే వేతనాలు ఇంట్లో కుటుంబాన్ని కనిపెట్టి చూచుకుంటూ, అందుకుగాను తమ శారీరక పోషణార్థం అతితక్కువ మాత్రమే పొందే ఆడవాళ్ళపై ఆధారపడి వున్నాయనే వాస్తవాన్ని గుర్తించడానికి మగవాళ్ళు సిద్ధంగా వుండరు. అంతేగాక తండ్రి అయినంతమాత్రాన మగవాడి పనికి లేక సంపాదనకు అంతరాయం ఏమీ కలగదనికూడ గమనించాలి. కాగా చిన్న సంఘటిత, పారిశ్రామిక రంగాల్లో పనిచేసే స్త్రీలు తప్పితే మిగతా స్త్రీలంతా తల్లి అవడంతో సంపాదన రీత్యా నష్టపోతారు. వారి పనికి అంతరాయం కల్గుతుంది. మగవాళ్ళకు ఇంటిపనుల బాధ్యతలు వుండవు గనుక వాళ్ళ పని సామర్థ్యం, మొత్తం ఉత్పత్తి మహిళా కార్మికుల విషయంలోకంటె తప్పనిసరిగా ఎక్కువే వుంటాయి. కనుక వారి సంపాదనలుకూడ ఎక్కువే వుంటాయి. కాగా స్త్రీలు మాత్రం శారీరకంగా కృశించి, మానసికంగా క్రుంగి తక్కువ జీతాలతో, నిస్పృహా భావాలతో, చాకిరీ చేసుకుంటూ పోవల్సి వుంటుంది.

భారతదేశానికి సంబంధించినంతవరకు, ఏదైనా బృందం రాజకీయంగా సంఘటితమై వుంటేనే, రాజ్యాధికారం సంపాదించుకోవడానికి లేక నిలుపుకోవడానికి ఆ బృందం ఎంతో కొంత ఉపయోగపడేట్లయితేనే, ఆ గ్రూపు లేక ఆ సముదాయంయొక్క ప్రయోజనాలపట్ల కొన్ని కొన్ని రాజకీయ పార్టీలు శ్రద్ధాసక్తులు చూపిస్తాయి. మహిళలు మహోన్నతమైన విలువలు, సుగుణాలు కల వారిని పొగడడం, వాళ్ళకోసం యివి చేయాల్సివుంది అవి చేయాల్సివుంది అని ఏకరువు పెట్టడంతో తమ బాధ్యత ముగిసిపోయిందని రాజకీయ నాయకులు సంతోషించవచ్చు. కాని ఈ రాజకీయ నాయకులు అధికారంలోవున్నా లేకున్నా, ఆచరణలో ఆడవాళ్ళకోసం చేసేది మాత్రం బహు తక్కువేనని తెలియాలి. కనుక తాము నిర్లక్ష్యం చేయబడకుండా లేక ఏదిచెబితే అది వింటారులే అనే

తేలికభావానికి ఆస్కారం యివ్వకుండా వుండాలంటే, అంటే తాము ఒక లెక్కలోకి రావాలంటే, ఆడవాళ్ళే స్వయంగా నడుంకట్టి సకల రంగాల్లో స్వాతంత్ర్య సాధనకు నిర్విరామంగా పోరాటం చేయాలి. ఒకసారి వాళ్ళు తమ సొంత కాళ్ళపై నిలబడి, సంఘటితమై (ఏదో ఒక్క గ్రూపుగానో లేక ఏదో ఒక్క పార్టీలోనో సంఘటితమై వుండాలనేమీలేదు) వుంటే ఇక అప్పుడు స్థానిక, జాతీయ, రాజకీయ నాయకులు వాళ్ళ సమస్యలపట్ల ఇతోధిక శ్రద్ధాశక్తులు చూపిస్తారు. అప్పుడు మాత్రమే వాళ్ళ నిజమైన విముక్తి ప్రారంభమవుతుంది.

(తే 23-3-85 దిన హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో జరిగిన "స్త్రీలు : పని" సెమినారులో సమర్పింపబడిన వ్యాసం)

---

# స్వయం వ్యక్తీకరణగా పని

—ఎం.వి. రామమూర్తి

"పని" అనే పదంయొక్క అర్థం విస్తృతం; విశాల పరిధి కలది. ఇతరులవద్ద వేతనం కొరకు పనిచేయటం, తన పనిని తానే జీవనభృతి కోసం చేసుకోవటం ఈ రెండూ పనిక్రిందనే లెక్క. కేవలం సంతృప్తి సంతోషాల కొరకు చేసేపనికూడా దీనిక్రిందనే వస్తుంది.

కొంతమంది వ్యక్తులు తమ పనిద్వారా తమ వ్యక్తీకరణను చేసుకుంటారు. వారి పనిలో వారి సంపూర్ణ వ్యక్తిత్వం బహిర్గతం అవుతుంది. వారికి పని ఆనందాన్ని సమకూరుస్తుంది; సంతృప్తిని ఇస్తుంది. నిజానికి దానికి అదే పారితోషికం. కవులు, నాటకకర్తలు, నటులు, సంగీతాన్ని ఆలాపించేవారు, చిత్రకారులు, నాట్యకళాప్రవీణులు, శిల్పులు, కళాకారులు, అధ్యాపకులు, ప్రబోధకులు వీరంతా ఆ వర్గానికి చెందినవారు. వారి ప్రతిభను వినియోగించుకోవటానికి, వారికి ఇష్టమైన మార్గంలో పయనించడానికి వారికి బీదరికం అడ్డురాదు. సంపద వారి ప్రేరణను నాశనం

చేయదు. నిజానికి బీదరికానికి బాధలకు లోనయినప్పుడు చాలమంది కళా కారులు తను ప్రతిభను వెలార్చారు. ఇలా అన్నంతమాత్రాన ఆ ప్రతిభా మూర్తులకు లేమి, వ్యధ వెన్నాడాలని ఆశిస్తున్నామని భావించరాదు. సోమరిపోతుతనం ప్రతిభాశాలికి పరమ అసహ్యమని మాత్రమే చెప్ప తలిచాం. పైకి సోమరిగా కనుపడుతున్నా ఆ కళాకారుడు తన మన స్సులో నూతన భావాన్ని రూపకల్పనను ప్రోది చేసుకుంటూ ఉంటాడు. ఇదంతా అతని సైజం. సృజనాత్మక ప్రేరణ అనేది అతని వ్యక్తిత్వంలో, అస్తిత్వంలో భాగం.

ఆర్థిక శాస్త్రజ్ఞుడు రంగంలోకి వస్తాడు. ఈ మాటలు వినగానే ఇలాంటి సృజనాత్మక కృషిచేసే వారినికూడా స్వయం ఉపాధి శ్రామికుల క్రింద జతపరుస్తాడు. పదాలను, పద సముదాయాలను సరిగా అర్థం చేసుకొని అన్వయనం చేసుకుంటే ఇలాంటి బాధ నివారణ అవుతుంది. సృజనాత్మక మానసిక భావన కల వారందరిని స్వయం ఉపాధి శ్రామి కుల క్రింద జమకట్టరాదని స్పష్టీకరించవలసియున్నది. అయితే స్వయం ఉపాధి శ్రామికులందరూ సృజనాత్మక శక్తిలేనివారని అనజాలము. భావాలు, నూతనత్వం, సృజనాత్మకత, స్వయం వ్యక్తీకరణ వీటిపై శ్రద్ధవహించే వారుకూడా మానవమాత్రులే. వారికీ అస్తిత్వం అవసరం, వారూ జీవించాలి. వారికికూడ ఆహారం, విశ్రాంతి, ఆశ్రయం, ఆరోగ్యం, దాంపత్య జీవితం కావాలి. ఈ అంశాలపరంగా వారు సామాన్య మానవు లను పోలివుంటారు. కనుక ఈ అవసరాలను పొందటానికి, ఈ సౌకర్యా లను అనుభవించటానికి వారికి తగినంత ధనం కావాలి. అందువలన ఆ పైకంకోసం తన సృజనాత్మక కృషి ఫలితాన్ని ఆ వ్యక్తి విక్ర యించటం జరుగుతుంది. అంతేకాదు, కొన్ని సందర్భాలలో, సమయా లలో అతడు ఇతరులవద్ద ఉద్యోగానికికూడా కుదరవచ్చును. జీతము సంపాదించవచ్చును లేక మరోరూపంగా పారితోషికం పొందవచ్చును. ఏది ఏమైనా, నిజమైన సృజనాత్మక శక్తికల వ్యక్తి తన సృజనాత్మక ప్రేరణను విడనాడుకోలేడు. తన కృషిలో అతనికి అపరిమిత ఆనందం కలుగుతుంది. అందుకే ఆ కృషిని కొనసాగిస్తాడు.

## సృజనాత్మక కళాకారులపట్ల సమాజంయొక్క విధ్యుక్తధర్మం ఏమిటి?

ఏ సమాజమూ సంస్కృతి లేకుండా మనజాలదు. సంస్కృతి మానవమేధ సంబంధి. అది ప్రజల మానసిక శిఖరులద్వారా బహిర్గత మవుతుంది. స్వేచ్ఛా పిపాస, సత్యంకోసం ఆరాటం, న్యాయ దృష్టి, సహన భావం, సౌందర్యారాధన, సమాజానికి ఏది శుభప్రదమో తెలుసుకో గలగటం, నైతిక జీవితానికై తహతహ, అన్నింటికన్న మిన్న నిర్లిప్త జీవిత దృక్పథం ఇవన్నీ మానవ విలువలకు ప్రాతిపదికను ఏర్పరుస్తాయి. మానవ విలువలను నిరాదరణ చేసిన ఏ సంస్కృతీ వికసించజాలదు. సంస్కృతి జీవితానికి ఊపిరి. కనుక అభ్యున్నతిపథంలో సాగే ఏ సమాజమూ సంస్కారులను చంపుకోలేదు. వారిని పోషించవలసిన బాధ్యత సమాజంపైన ఉన్నది. కనీసం వారి భౌతిక అవసరాలను, సౌకర్యాలను గురించి శ్రద్ధవహించవలసి యున్నది.

సంస్కారులను, సృజనాత్మక కృషి చేసేవారిని పోషించుకోవటానికి పెక్కు సమాజాలు పలురీతులను, విధానాలను చేపట్టాయి. భూస్వామ్య వ్యవస్థ వారిని ఆ స్థానాలలో పోషించింది. వారు ఆ యుగపు మనుషులవటంవల్ల ఆయాకాలపు రాజులను స్తుతించారు; నుతించారు. పెట్టుబడిదారీ సమాజంలో రాజుల స్థానాన్ని ప్రజలు ఆక్రమించారు. అంటే వారు పోషకు లయ్యారన్నమాట. ఇది లాంఛనప్రాయం. నిజానికి నిర్మాత, ప్రచురణ కర్త, వ్యాపారస్తుడు యజమాని అయినాడు. ఎంతో ప్రతిభకల వ్యక్తులు ఉద్గ్రంథాలను వ్రాసి ప్రచురించి "మార్కెటులో" గణనీయమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న సంఘటనలుకూడా చెదురుమదురుగా ఉన్నాయి. దరహంమీద చూస్తే ధనవంతుడు నిర్దేశించగలుగుతున్నాడు. అందువలన సృజనాత్మక శక్తికల కొద్దిమంది మాత్రమే రాణిస్తున్నారు. ఇది దుర్మార్గమైన పరుగుపందెం. ఇందులో గెలుపే ముఖ్యం. విజయం పొందిన వ్యక్తులు ధనవంతులవుతున్నారు. వీరికి మాత్రం లేమి దూరమవుతున్నది. కాని చాలమంది ప్రతిభా వ్యుత్పత్తులు కలవారు ప్రజలలో పేరు ప్రఖ్యాతలు పొందలేకపోతున్నారు; ధనార్జన చేయలేకపోతున్నారు. వారి శక్తియుక్తులు వాడిపోతున్నాయి. కొంతవరకు, అలా, పెట్టుబటిదారీ

సమాజం దుబారాను కల్గిస్తున్నది. సోషలిస్టు సమాజం ఈ సమస్యను మరోరకంగా పరిష్కరించింది. సృజనాత్మక కృషిచేసే వారందరికి ఆ సమాజం గృహవసతి, విశ్రాంతి, అవకాశం, తీరికసమయం ఇచ్చింది. అంతవరకు మంచిదే. సృజనాత్మక కళాకారుల వేతనాలు, ఆదాయాలు, హోదాలు, హక్కులూ, సౌకర్యాలు వీటిని నిర్ణయించటానికి వారి సంఘాలకు అధికారం ఇచ్చింది ఆ సమాజం. మామూలుగా ఈ సంఘాలు అధికారంలో ఉన్న రాజకీయపార్టీ ఆదేశాలను అనుసరిస్తాయి. ఇలా కళాకారుడికి శారీరక భౌతికావసరాలు తీరతాయి కాని అతడు తన స్వేచ్ఛను కోల్పోవటం సంభవిస్తున్నది. ఇది శోచనీయం. సృజనాత్మక వ్యక్తి యొక్క సైజానికిది వ్యతిరేకం. స్వేచ్ఛ అతని ప్రాణం. భావాలు, రంగులు, గేయాల పోకడులు, నాట్యాల రూపాలు, వగైరాలు వీటి చిత్ర విచిత్రాది కలయికలతో ప్రయోగాలుచేసే అవకాశం అతనికి కావాలి. అందువలన సృజనాత్మక కృషిసల్పే వ్యక్తి సోషలిస్టు సమాజంలోకూడా సందిగ్ధావస్థలో ఉంటున్నాడు. శరీరాన్ని పోషించడం జరుగుతున్నది. కాని అంతప్రవృత్తిని నిరాదరణ చేస్తున్నది ఆ సమాజం. ఇలాంటి పరిస్థితి సామాజికాభ్యుదయానికి, సంస్కృతి అభ్యున్నతికి ఎలా దోహదం చేస్తుంది ?

ఈ పరిస్థితికి ఇతరులను నిందించి ప్రయోజనం లేదు. సృజనాత్మక కృషి చేసేవారి స్వేచ్ఛకు భంగం కలుగనిరీతిలో వారికి సౌకర్యాలు కలుగజేసి వారిపట్ల శ్రద్ధాసక్తులు చూపే సమాజాన్ని మనం రూపొందించుకోవాలి. వారు దేనిని తయారుచేశారు, ఏమిచేశారు అనే ప్రశ్నలతో నిమిత్తం లేకుండా వారికి జీవితావసరాలను కనీస సౌకర్యాలను సమాజం అందించాలి. ప్రజల సాంస్కృతాభిరుచి పెరిగినకొలదీ వారు సృజనాత్మక వ్యక్తులను గురించి శ్రద్ధ చూపిస్తారు.

## II. ప్రజలు ఏమి చేయాలి ?

మంచిపనులు చేయుటానికి ఎల్ళవేళలా ప్రభుత్వంపై ఆధారపడడం అంత శ్రేయస్కరం కాదు. ఉన్నతాదర్శాలను, ఉదాత్త లక్ష్యాలను,

సర్వసామాన్యంగా, ప్రభుత్వాలు పాటించవు. మంచి ప్రభుత్వం ఉండి సృజనాత్మక వ్యక్తుల సంక్షేమాన్ని గురించి పట్టించుకుంటే మంచిదే. కాని ప్రజలకు తమ యెడల, సమాజంపట్ల కొన్ని బాధ్యతలు, విధ్యుక్త ధర్మాలు ఉన్నాయి. వారు సాంస్కృతిక వైఖరిని అలవరచుకోవాలి. అంతేగాక వారు తమ సమాజంలోని శ్రేష్ఠులను పోషించుకోవాలి.

## III. సృజనాత్మక కృషీవలుల కర్తవ్యం ఏమిటి ?

సృజనాత్మక కృషి చేసే వ్యక్తి జీవితం పూలబాట కాదు. అది కంటకావృతం. అతనిది కష్టజీవితం. అతడు లేక ఆమె జీవితాన్ని ఎంపిక చేసుకున్నారు. కనులు తెరుచుకొని ఆ మార్గాన్ని ఎన్నుకున్నారు. సృజనాత్మకత, నూతనత్వం, స్వయం వ్యక్తీకరణ, వీటికి అతడు ప్రాధాన్యత ఇస్తున్నపుడు, మామూలుగా లేమితో కూడిన కఠిన కర్కశ జీవితాన్ని గడపవలసి ఉంటుంది. ఆ స్థితి పరీక్షా సమయం. ప్రలోభాలు పెక్కు సాక్షాత్కరిస్తాయి. పారితోషకం ఇస్తామని, బృహత్తర వేతనమిస్తామని కొందరు ఆశలు పెట్టారు వీరికి. ఒత్తిడులు ఎక్కువ అవుతాయి. అతడుకాని ఆమెకాని ఏ ధనవంతుడి వలలోనో, రాజకీయ పార్టీ చెప్పుచేతుల్లోనో లేక సంఘపు విషదంష్ట్రిలలోనో ఇరుక్కొనిపోయే ప్రమాదం సంభవిస్తుంది, అపుడు అతడు తన స్వేచ్ఛను కోల్పోతాడు. అపుడు అతని పతనం ప్రారంభమవుతుంది. నిజాయితీ గల సృజనాత్మక కృషీవలుడు ఈ ప్రమాదాల ఊబిలో పడరాదు. అతని చిత్తశుద్ధికి అది అగ్నిపరీక్ష. ఈ ఒత్తిడులను, ప్రలోభాలను తట్టుకొని నిలువగలిగి తమ నిజాయితీని, చిత్తశుద్ధిని కాపాడుకోగల సృజనాత్మక వ్యక్తుల సంఖ్య పెరిగేకొలదీ సమాజపు సాంస్కృతాభివృద్ధి అంతగా సాగుతుంది.

ఇది పురుషాధిక్య సమాజం అవటంవల్ల సృజనాత్మక శక్తి కల్గిన స్త్రీలు గుర్తింపుపొందడం, విజయాలను సాధించటం చాల కష్టసాధ్యం. స్త్రీలలో ప్రతిభ రాణించదనే అపోహ చాల పెద్ద ఆటంకం. దీనిని రెండు రకాలుగా అధిగమించవచ్చును. సృజనాత్మక శక్తిగల స్త్రీలు ముఖ్యంగా ఆత్మవిశ్వాసం అలవరుచుకోవాలి. వారు తమ కౌశల్యాన్ని,

నైపుణ్యాన్ని మరింతగా వృద్ధిచేసుకొని ప్రథమ శ్రేణిని చేరుకోవాలి. అత్యధిక విజయం సాధించిన స్త్రీని పొగడడం, కొద్దిపాటి ప్రతిభ కలిగిన మహిళను ఈసడించడం పురుష ప్రపంచపు సర్వసామాన్య లక్షణం. అందు వలన సృజనాత్మక కృషిని చేపట్టి స్త్రీలు ఉన్నతోన్నత స్థాయిని చేరటం అత్యవసరం. సమస్య క్లిష్టమైనా, పరిష్కారమార్గం లేనిదికాదు.

(తే 23-3-85 దిన హైదరాబాద్ విశ్వవిద్యాలయం నిర్వహించిన "స్త్రీలు : పని" అనే సెమినారులో వ్యాసం)

---

# రూ ప మా ధు రి

—డాక్టర్ సంజీవదేవ్

మెదడు, కన్ను, వస్తువు. మెదడు గ్రహిస్తుంది వస్తువును కన్ను ద్వారా. మెదడులేంది కన్ను గ్రహించలేదు; కన్ను లేంది మెదడు గ్రహించలేదు; వస్తువులేంది మెదడూ కన్నూకూడ గ్రహించలేవు.

మెదడుది మనసు, కన్నుది దృష్టి, వస్తువుది రూపం.

రూపం అంటే రంగుకూడ. రంగులేని రూపం గోచరించదు. రూపాల ఆకృతులు భిన్న భిన్నంగా ఉన్నట్లే ఆకృతుల రంగులు భిన్న భిన్నంగా ఉంటాయి.

దృశ్య జగత్తంతా రంగులతో కూడిన రూపాల, రూపాలతో కూడిన రంగుల ప్రదర్శన.

వాటిని తన రసానుభూతిలో రంగరించి చేసే సృష్టి చిత్రలేఖనం, చేసే కళాకారుడు చిత్రకారుడు.

చిత్రలేఖనం ఎప్పుడు పుట్టింది, ఎక్కడ పుట్టింది అనే ప్రశ్నలు

అంత ప్రధానమైనవి కావు. ఫలానికాలంలో అది పుట్టినందునకాని; ఫలాని దేశంలో పుట్టినందునకాని దానికి ఆధిక్యతకాని హైన్యతకాని సంక్రమించదు.

మనిషి పుట్టుకకంటే మాత్రం కళల పుట్టుక లక్షల సంవత్సరాలు లేతది. మనిషి వయస్సు లక్షల సంవత్సరాలు అయితే కళల వయస్సు వేల సంవత్సరాలలోనే.

చిత్రకారుడు ఎందుకు చిత్రిస్తాడు అంటే కవి ఎందుకు కవితల్లుతాడో, నర్తకుడు ఎందుకు నర్తిస్తాడో, గాయకుడు ఎందుకు గానంచేస్తాడో అందుకే చిత్రకారుడు చిత్రిస్తాడు ; తన ఆనందం నిమిత్తం చిత్రిస్తాడు, తన తోటి సామాజికుల అనందం నిమిత్తం చిత్రిస్తాడు.

ఆనందం నిమిత్తం చిత్రిస్తాడు, ప్రయోజనం నిమిత్తం చిత్రిస్తాడు.

ఆనందం మాత్రం ప్రయోజనం కాదా? ఎందుకు కాదు?

ఆదిమ చిత్రకళ నుండి ఆధునిక చిత్రకళ వరకు సాగిన ముప్పయి వేల సంవత్సరాల కాలంలో చిత్రలేఖనం రంగుల్లోను, రేఖల్లోను ఆరెండూ కలిసిన రూపవిన్యాసాల్లోను రకరకాల మార్పులు చెందుతూ వచ్చింది.

మార్పులు చెందుతూ వచ్చివచ్చి ఆధునిక చిత్రకళ తిరిగి ఆదిమ చిత్రకళకు సమీపమైంది. ఆదిమ చిత్రకళతోను, ఆధునిక చిత్రకళలోను కూడ రూపవాస్తవికత లోపించింది, సైరూప్య లక్షణం వికసించింది.

ఏ కళాసృష్టికైనా మూడు ప్రధానం — వస్తువు, మాధ్యమం, భావం

వస్తువు అంటే మనిషి కావచ్చు, ఏదైనా నిర్జీవ పదార్థం కావచ్చు, ఏదైనా ప్రదేశం కావచ్చు.

వీటి చిత్రణనే అంటారు చిత్రకళాభాషలో, మానవరూప చిత్రణ **(Figure study)**, అచలచిత్రణ **(Still life study)**, ప్రకృతి చిత్రణ **(Landscape study)** అని.

"మూర్తికల్పన" అనికూడ అంటారు మానవరూప చిత్రణను. ఏ మానవమూర్తినైనా చిత్రించటాన్ని మూర్తికల్పన (Figure study) అంటే ఫలాని మనిషిని మాత్రమే చిత్రించటం అనేదాన్ని అంటారు స్వరూప చిత్రణ (Portraiture study) అని.

కొందరు చిత్రకారులు కొన్ని విధాలైన చిత్రణలో అభిరుచి కలిగి ఉంటారు. తమకు అభిరుచివున్న విషయాన్ని చిత్రించటంలో అధిక కౌశలాన్ని కలిగి ఉంటారు.

ఎక్కడైనా అరుదుగా అన్నివిధాల చిత్రణలనూ చేయగల అతి ప్రజ్ఞాశాలురైన చిత్రకారులూ ఉంటారు నూటి కొకడు కాకపోయినా, కోటి కొకడైనా.

సాధారణంగా చెప్పాలంటే భారతదేశంలో మూర్తికల్పన, పాశ్చాత్య దేశాల్లో అచలచిత్రణ, చైనాలో ప్రకృతి చిత్రణ ఎక్కువగా వికసించటం జరిగింది. అసలు ఒక అభిప్రాయం ఏమంటే ప్రకృతి చిత్రణ అనేది చైనా తోనే జన్మించింది అనేది.

విచిత్రం ఏమంటే, భారతీయుల మతంలోను, సాహిత్యంలోను, భావనలోను హిమాలయాలు గొప్ప స్థానాన్ని కలిగివున్నవి. అటువం టప్పుడు భారతీయ చిత్రకళలో ప్రకృతి చిత్రణ ప్రాధాన్యం వహించి ఉండాల్సింది.

అయితే, వాస్తవం అందుకు భిన్నంగా ఉన్నది. భారతీయ చిత్రకళలో శుద్ధమైన ప్రకృతి చిత్రణ గోచరించదు. మానవమూర్తుల లేక దేవమూర్తుల రూపకల్పనకు పృష్ఠ భూమిగా మాత్రమే ప్రకృతి చిత్రణ గోచరిస్తుంది.

ప్రకృతి చిత్రణ నిమిత్తమే ప్రకృతి చిత్రణ భారతీయ చిత్రకళలో గోచరించదు.

అందుకు ప్రధాన కారణం, భారతీయులు ప్రతిమకుకాక ప్రతీకకు ప్రాధాన్యం ఇస్తూవచ్చారు. హిమాలయ పర్వతాన్ని చిత్రించాలంటే పర్వతరూపాన్ని చిత్రించక పర్వతాన్ని మానవరూపంలో ప్రతీకగా చిత్రిస్తారు.

హిమాలయ పర్వతరూపాన్ని హిమవంతుడు అనే మానవరూపంగా చిత్రించారు.

అదేమాదిరి నదిని చిత్రించాలంటే నదీరూపంలో నదిని చిత్రించక ఒక స్త్రీ రూపంలో నదిని చిత్రించారు. గంగా, యమునా నదులను స్త్రీల రూపాల్లో చిత్రించారు భారతీయ చిత్రకారులు.

ఈ వైఖరివల్ల ప్రాచీన భారతీయ చిత్రకళలో ప్రకృతి చిత్రాలు గోచరించవు.

చిత్రనిర్మాణం చేయాలంటే చిత్రకారునిలోని భావాలు మాత్రమే చేయజాలవు. భావాన్ని ప్రత్యక్షపరచటానికి రూపకల్పన చేయాలి.

రూపకల్పనకు అవసరం ఒక భౌతికమైన మాధ్యమం (medium) చిత్రలేఖనకు మాధ్యమం రంగులు, సాహితీ లేఖనకు మాధ్యమం మాటలైనట్లు.

చిత్రలేఖన మాధ్యమాలు కొన్ని విధాలైనవి ఉన్నాయి. నీటి రంగులు, తైలవర్ణాలు, పేస్టల్సు ప్రధానమైనవి. నీటి రంగుల్లో వాష్ పద్ధతి, టెంపరా పద్ధతి అని తిరిగి రెండు విధాలున్నాయి.

ఒకో మాధ్యమం కొన్ని విశేష లక్షణాలను కలిగి ఉంటుంది.

నీటి రంగులు మార్దవాన్ని కలిగి, కవిత్వమయినా తావరణాన్ని సృష్టిస్తాయి చిత్రంలో. నీటి రంగుల చిత్రాలు అతిసున్నితంగా, రసమయంగా ఉంటాయి భావగీతాలవలె. పూర్వంనుంచి ప్రాచ్యదేశాల్లో, దూర ప్రాచ్యదేశాల్లో వీటి వాడుక ప్రాధాన్యం వహించి ఉన్నది.

తైల వర్ణాల చిత్రాల్లో ఒక విధమైన గాంభీర్యం, బలీయత, స్పర్శ నీయత (Texture) మొదలైన లక్షణాలు గోచరిస్తాయి. చాలా పెద్ద సైజు చిత్రాలను రచించటానికి ఈ తైలవర్ణ మాధ్యమం సులభంగా ఉంటుంది. ఇది ఎక్కువగా పాశ్చాత్య దేశాల్లో వాడుకలో ఉండి ఉంది.

మూడవ మాధ్యమం అయిన పేస్టల్సు అనేది నీటితోకాని, నూనెతో కాని అవసరంలేని పొడి రంగులు. వీటితో నిర్మించిన వాటిని ధూళి చిత్రాలు అనవచ్చు.

పేస్టల్ చిత్రంలోని ప్రధాన లక్షణం ఏమంటే అది ఉన్నిలాంటి ఒక విచిత్ర స్పర్శనీయతను కలిగి పై భాగం ఆకర్షణంగా ఉంటుంది. ఇందు లోని రంగులు నీటిరంగులకంటేకూడ ఎక్కువ తేటగా, తేలికగా వుంటాయి.

పేస్టల్సుతో ఎక్కువగా స్వరూప చిత్రణను, ప్రకృత చిత్రణను చేస్తారు.

సాహిత్యకళ ఏదో ఒక భాషలో రచించబడటంవల్ల ఒక భాషలో రచించినదాన్ని మరొక భాషవారు చదివి ఆనందించలేరు. అందువల్ల సాహితీ రచన కొన్ని హద్దులకు లోబడి ఉంటుంది.

చిత్రకళా విషయం అందుకు భిన్నమైంది. దీని మాధ్యమం విశ్వజనీనమైంది. ఏ దేశవాసి చిత్రించిన చిత్రాన్నయినా మరొక దేశ వాసి చూచి ఆనందించగలడు సులభంగా, కారణం దేశభాషలు దాని కడ్డంరావు.

భాషా ఆటంకాలున్నాకూడ భావాభివ్యక్తికి సాహిత్యానికున్న సూక్ష్మావకాశాలు చిత్రకళకు తక్కువ ఉంటాయి.

ఒక కళలో ఉండే కొన్ని విశిష్టతలు ఇంకో కళలో ఉండవు. కొన్ని కొన్ని ప్రత్యేకతలను కలిగిఉంటే మరికొన్ని, మరికొన్నిటిని.

అన్ని కళల్లోవలెనే చిత్రకళలోకూడ మూడు ప్రధానమైన విధాన విభాగా లున్నాయి, - వాస్తవవాదం, ఆదర్శవాదం, కల్పనావాదం.

దృశ్య జగత్తులోని రూపాలను కనిపించేవి కనిపించినట్లుగా చిత్రించటం వాస్తవవాదం. ఉన్నది ఉన్నట్లుగాకాక ఏ విధంగా ఉంటే బాగుంటుందో ఆ విధంగా చిత్రించటం ఆదర్శవాదం. ఈ వాస్తవానికి కాని, ఆదర్శానికికాని చెందని కేవలం ఊహారూపాలను మాత్రమే చిత్రించటాన్ని అంటారు కల్పనావాదం అని.

వాస్తవవాద చిత్రంలో దృష్టిక్రమం చాలా ప్రధానమైంది. దృష్టిక్రమం (Perspective) అంటే దగ్గరలోని, మధ్యలోని వస్తువులు ఎక్కువ తక్కువలుగా కనిపించే క్రమ పద్ధతి.

రైలుపట్టాల మధ్య నిల్చొని ముందుకు చూస్తే, పోనుపోను పట్టాలు రెండూ ఒకటానిలో ఒకటి కలిసిపోయినట్లు కనిపిస్తాయి. సమాంతరాళ రేఖలు దూరాన ఏకమైనట్లు కనిపిస్తాయి. దీన్నే అంటారు Convergence of Parallels అని.

కాని అది కంటి భ్రమేకాని వాస్తవం కాదు.

దూరాన ఉన్న ఎత్తయిన గోపురం దగ్గర ఉన్న ఎత్తు లేని స్తంభానికంటే పొట్టిగా గోచరిస్తుంది, దగ్గర దూరాలలోని దృష్ట క్రమ భేదంవల్ల,

అది కంటి భ్రమేకాని వాస్తవంకాదు.

ఇటువంటి కంటి భ్రమలనే కలిపి అంటారు దృష్టిక్రమం అని. ఇది కంటి భ్రమ అయినా, దృష్టికి సంబంధించినంతవరకు వాస్తవం, మనసుకు సంబంధించినంతవరకు కాదు.

పాశ్చాత్య దేశాల్లోని ప్రాచీన చిత్రకళలోను, ఆధునిక చిత్రకళలోను తప్ప మిగతాకాలాల పాశ్చాత్య చిత్రకళలో ఈ దృష్టిక్రమం గోచరిస్తుంది.

ఈ పాశ్చాత్య దృష్టిక్రమాన్ని "రేఖామూలక దృష్టిక్రమం" (Linear Perspective) అంటారు. ప్రాచ్య చిత్రకళలోనిదాన్ని "వాయవీయ దృష్టిక్రమం" (Aerial Perspective) అంటారు.

మొదటిదానిలో దూరాన్ని చూపటానికి దగ్గరి చిన్నవస్తువులకంటే దూరపు పెద్ద వస్తువులను చిన్నవి చేసి చూపుతారు.

రెండవదానిలో అవే ఫలితాలను చూపటానికి దగ్గరలోనివాటిని కాంతి మంతంగాను, దూరపువాటిని కొంత నిస్తేజంగాను చూపుతారు.

అసలు కళల్లోకల్లా చిత్రకళ కంటిభ్రమ ప్రధానమైంది. కారణం, దాని సృష్టి రెండు ఆయతనాల సమతల ప్రదేశంమీద మూడు ఆయతనాలుగా భ్రమ గొల్పే రీతిలో జరుగుతుంది.

చిత్రంలో కంటికి కనిపించే ఎత్తులు పల్లాలుమీద చేయి ఆనించి చూస్తే కనిపించే ఎత్తులు పల్లాలు చేతికి తగలక సమతలం మాత్రమే తగులుతుంది.

ఇటువంటిది ప్రాచ్య చిత్రాల్లో గోచరించదు. పాశ్చాత్య చిత్రం లోని చేయి గుండ్రంగా ఉన్నట్లు కనిపిస్తే ప్రాచ్య చిత్రాల్లో కనిపిస్తుంది సమతలంగా ఉన్నట్లు.

కొన్ని దేశాల్లో, ప్రత్యేకించి బానిస దేశాల్లో, విదేశీ పాలకులమీద వున్న ద్వేషం వారి సంస్కృతిమీద కూడ వుంటుంది.

అదే పని క్రిందటి శతాబ్దపు అంతిమ భాగంలోన, ఈ శతాబ్దపు ప్రథమ భాగంలోను జరిగింది భారతదేశంతో.

బ్రిటిష్ పాలకులపై ద్వేషం బ్రిటిష్ సంస్కృమీద కూడ ఏర్పడింది. ఇంగ్లిషువారి చిత్రకళ మీదకుకూడ ఈ విద్వేష తరంగం మరలింది.

దాంతో భారతీయ కళాకారుల, కళాప్రేమికుల దృష్టి భారతీయ చిత్ర కళ మీదకుకూడ ప్రసరించింది.

బెంగాల్లో ఆనాడు జరిగిన "స్వదేశీ" ఉద్యమాల్లో భారతీయ చిత్రకళా పునర్వికాసంకూడ ఒకటి. ఇది ప్రత్యేకించి బెంగాల్‌లో జరిగింది.

ఇందుకు ప్రధాన నాయకులు అప్పటి కలకత్తా కళా విద్యాలయపు

ప్రిన్సిపాల్ హావెల్ మహాశయుడు, డా. అవనీంద్రనాథ ఠాగూర్, గగనేంద్రనాథ ఠాగూర్ మొదలైనవారు.

వీరంతా పాశ్చాత్య చిత్రకళను విసర్జించి భారతీయ చిత్రకళను పోషించ నిశ్చయించారు. **Indian Society of Oriental Art** కలకత్తాలో స్థాపించబడి ఆ రంగంలో శతంపరగా పనిచేయసాగింది. కవి రవీంద్రుడు, వైజ్ఞానికుడు జగదీశ చంద్రబోసు, మొదలైన వారంతా తమ చేయూత నివ్వసాగేరు. రామకృష్ణ మిషన్‌కు చెందిన ఆంగ్ల వనిత సిస్టర్ నివేదిత కూడ.

నవరంగ చిత్రకళా సాంప్రదాయిక రీతి ఒకటి సృజించబడింది. భారతదేశపు నలుమూలలనుండి భారతీయ యువచిత్రకారులంతా వచ్చి ఈ నూతన భారతీయ చిత్రకళలో శిక్షణ పొందసాగారు.

ఈ నవభారత చిత్రకళలో ఎక్కువగా ఉన్నవారు బెంగాలీలు, డా. అవనీంద్రనాథ ఠాగూరు శిష్యుల్లో నందలాల్ బోసు, అసిత్‌కుమార్ హాల్దార్ మొదలైనవారు సుప్రసిద్ధ భారతీయ చిత్రకారులుగా పేరు గాంచారు. చాలాకాలం మద్రాసులో ప్రిన్సిపాల్‌గా పనిచేసిన దేవీ ప్రసాద రాయ చౌదరి ప్రత్యక్షంగా అవనీంద్రుని శిష్యుడు కాకపోయినా ఈ నవ భారత చిత్రకళను మరో రూపంలో ప్రోత్సహించిన వారిలో ఒకరు. ఆయన అటు పాశ్చాత్య రీతిలోను, ఇటు భారతీయ రీతుల్లోనుకూడ సమాన ప్రావీణ్యంతో చిత్రించగల చిత్రాచార్యుడు.

ఈ నవభారత చిత్రకళకు ప్రేరణ అజంతా గుహల్లోని బౌద్ధచిత్రాలు, రాజస్థానీ, ముగల్ చిత్రాలూ, హిమాలయ ప్రాంతాల కాంగ్రా, బసోలీ, చంబా మొదలైన చిత్రాలు. అంతేకాకుండా ఈ చిత్రకళమీద దూర ప్రాచ్యకళా ప్రభావాలుకూడ పరోక్షంగా ప్రసరించినాయి. ఆ రోజుల్లో సుప్రసిద్ధ జాపానీ కళాకారుడూ, సమీక్షకుడూ అయిన ఒకాకురాకకూజో అనే ప్రతిభాశాలి భారతదేశం వచ్చి అవనీంద్రుని సమక్షంలో భారతీయ కళా సంప్రదాయాలను అనుశీలిస్తూ కలకత్తాలో ఉండిపోయినాడు.

ఆయన సాహచర్యంవల్ల నవభారత చిత్ర కళోద్యమంలో నూతన ప్రాణస్పందన ప్రవేశించింది. ఈ నూతనోద్యమంలో రవీంద్రుని పాత్ర ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కూడ ఎంతో ఉన్నది. తన శాంతి నికేతనంలో ఈ నవభారత చిత్రకళను ఎంతో పోషించాడు.

నేడు ప్రపంచమంతా వ్యాపించివున్న ఒక విధమైన విశ్వజనీన అంతర్జాతీయ చిత్రకళ ఆధునిక చిత్రకళ అనే పేర ప్రసిద్ధిచెందివున్నది. ఏ దేశపు చిత్రకారుడు రచించినాకూడ ఇది ఒకే విధంగా ఉన్నట్లు గోచరిస్తుంది. ఇందులో దేశ, జాతి విభేదాలు గోచరించవు. ఇదొక విశ్వజనీన కళ.

చిత్రకళలో ఈ ఆధునిక ఉద్యమానికి పరోక్ష పితామహుడు నిపుణ ఫ్రెంచ్ చిత్రకారుడైన పాల్‌సజాన్ ఈ ఆధునిక చిత్రకళలో ఎన్నో విధాలైన "ఇజం"లు ప్రవేశించాయి.

వీటిలో ప్రతిదాని ఆశయంకూడ వాస్తవవాదంపై తిరుగుబాటు జరపటమే. కళాసృష్టిలో ఇతివృత్తపు ప్రాధాన్యాన్ని సాధ్యమైనంత వరకు తగ్గిస్తూ తీసుకరావడమే. ఇతివృత్తాన్ని విసర్జించినాకూడ కళాకృతులు తమ స్వీయ అస్తిత్వాలతో రసఖండాలుగా మనగలవని.

చిత్ర రచనలో ఇతి వృత్తానికి అప్రాధాన్యం ఇస్తూ ఇస్తూ వచ్చి క్రమేణ తమ కళాకృతుల్లో నుండి అసలు ఇతివృత్తాన్నే తొలగించటం జరిగించి నైరూప్య చిత్రరచనా విధానంలో. ఇతివృత్తాన్ని తొలగిస్తే ఇక చిత్రంలో మిగిలేది ఏమిటి అంటే కేవలం రంగులు, రేఖలు వీటి కలయికతో నిర్మించబడే రూపాలకు ఏ పరిచిత వస్తురూపంలోనూ పోలిక ఉండదు.

అందుకే ఈ నైరూప్య చిత్రకళను సారూప్యం కాని చిత్రణ అన్నారు. అంటే non-representational art అని.

ఈ ఆధునిక చిత్రకళలో ఇంప్రెషనిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, సర్రియలిజం, ఎక్స్‌ప్రెషనిజం మొదలైె నవెన్నో ప్రవేశించినాయి. వీటిలో

ఫ్యూచరిజం, సర్రియలిజం లాంటివి కొన్ని కవితా కళలోకూడ కని పిస్తాయి,

ఈ ఆధునిక చిత్రకారుల్లో క్యూబిజానికి ప్రధాని అయిన పాబ్లో పికాసో, సైరూప్య చిత్రణకు ప్రధాని అయిన వాస్లీకాండిన్ స్కే ఎక్కువ ప్రఖ్యాతులు.

వీటిలో క్యూబిజం అనేది ఒక చిత్రాన్ని క్యూబులు లేక ఘనాకృతులు అనే రూపాల్లో చిత్రించటం. ఆ చిత్రాన్ని చూడగానే ముందుగా కనిపించేవి క్యూబులు. ఆ క్యూబులగుండా నిదానంగా గోచరిస్తాయి అసలు రూపాలు.

సర్రియలిజం, లేక అధివాస్తవికతకు చెందిన చిత్రాలు అవచేతన లోని స్వాప్నికరూపాలను చూపుతాయి. దానిలో హేతువాదం నశించి సహజమైన కాలానికి, స్థలానికి చెందని విడ్డూరపు ఆకృతులను, సంఘటన లను చూపుతాయి.

ఫ్యూచరిజం అనేది వేగాన్ని చూపుతుంది. కుక్కకు మామూలు పరి స్థితిలో నాలుగు కాళ్ళు ఉంటాయి. కాని అది వేగంగా పరుగెత్తుతున్నపుడు నలభై కాళ్ళున్నట్లు గోచరిస్తుంది.

ఒక విషయాన్ని అభివ్యక్తపరిచే చిత్రరచన ఉన్నట్లే ఏ విష యాన్నీ అభివ్యక్తపరచని చిత్రకళకూడ ఉన్నది. రెండూ సమానమైన విలువలు కలిగినవే. దేనిస్థానంలో అదే గొప్పది. అదీ ఇదీకూడ రూప మాధురియే !

# తెలుగు సాహిత్యంలో స్త్రీల పనిభావనా ప్రతిఫలనాలు

—డా॥ కాత్యాయనీవిద్మహే
(కాకతీయ విశ్వవిద్యాలయం)
(తెలుగు విభాగం)

## I

ప్రకృతితో నిత్యసంబంధంలో వుంటూ పరిశీలన, అవగాహన ప్రాతిపదికలుగా పనిచెయ్యటం నేర్చుకొని నైపుణ్యాన్ని పెంచుకొనే క్రమంలో మానవజాతి జంతుస్థితినుండి ఎదుగుతూ విశిష్టంగా పరిణమించింది. మానవజాతి సాధించిన ఈ అభివృద్ధి అంతా స్త్రీ పురుషులిద్దరి సహజీవన శ్రమజీవన సౌభాగ్యమే. ఆదిమ దశలలో అంటే పాత కొత్త రాతి యుగాలలో అందరూ కలిసి గుంపులు గుంపులుగా తిరుగుతూ కష్టసుఖాలను పంచుకొంటూ ఆహారాన్ని సేకరించుకొని తిని బ్రతికారు. జీవనానికి సంబంధించిన పనులు పెరిగినకొద్దీ స్త్రీ పురుషుల మధ్య పని విభజన అవసరమైంది. అందువల్ల తరువాతి దశలో పురుషులు వేటకుపోతే స్త్రీలు ఆహార పదార్థాలను సేకరిస్తూ, దానితోపాటు ప్రకృతిలో పెరుగుతున్న గడ్డిజాతుల (గోధుమ, బార్లీ) విత్తనాలను సేకరించి వాటిని మళ్ళీ సరైన నేలలో నాటి పెంచి పోషించి పెరుగుతున్న జనాభాకు ఆహారాన్ని సమకూర్చటం నేర్చుకొన్నారు. వ్యవసాయాన్ని కనుక్కోవటంలో, అభివృద్ధి చేయటంలో స్త్రీలు పురుషులకంటే ప్రముఖపాత్ర వహించటం చరిత్రలో సహజంగా వచ్చిన పరిణామం[1]. వ్యవసాయానికి అవసరమైన పనిముట్లను కనుక్కోవటంలోనూ, పండిన పంటను ఆహారంగా మార్చుకోవటంలోనూ; మానవ నాగరికతకు స్త్రీ శ్రమ చేసిన దోహదం విప్లవాత్మకమైంది.[2]

మానవ నాగరికత రాతియుగ దశను దాటి లోహయుగంలోకి పురోగ మించిన క్రమంలో నాగలి, సారె మొదలైన కొత్త వస్తువులు కనుక్కో బడ్డాయి. నాగలిరాక చిన్న కయ్యలకు పరిమితంగా వున్న వ్యవసాయాన్ని పెద్ద పొలాలకు వ్యాపింపచేసింది. అంతేకాదు, వ్యవసాయాన్ని స్త్రీల నుంచి పురుషుల చేతుల్లోకి మార్చింది. అట్లాగే సారె సృష్టి పాత్రలను కుటుంబావసరాలకు మించి ఉత్పత్తి చేయగలిగిన శక్తికలది కావటంవల్ల. ఆ పాత్రలు భారీ ఎత్తున తయారయ్యే క్రమంలో ఆ పరిశ్రమకూడా స్త్రీల నుండి పురుషులకు మారింది. ఫలితంగా ఆర్థికవ్యవస్థలో పురుషులకు ప్రాధాన్యత పెరిగింది. సమాజానికంతటికీ పనికివచ్చే పనినుండి దూరం చేయబడ్డ స్త్రీలు అంతవరకూ వ్యవసాయానికీ నూతన వస్తూత్పత్తులకు బాధ్యులుగా పొందుతూ వస్తున్న గౌరవాన్ని కోల్పోయారు. ఆర్థిక పరమైన తల్లిహక్కు, మాతృస్వామ్య వ్యవస్థ అంతరించాయి. ఈ దశలో అంటే క్రీ॥పూ॥ 3000 సంవత్సరాల తరువాత పితృస్వామ్య సమాజం నిర్ణీత మైన "కుటుంబం" రూపంలో తనను తాను ఆవిష్కరించుకుంది.[3]

ఇక్కడనుండి చరిత్రలో స్త్రీ పనికి సంబంధించిన భావనలో విచిత్ర మైన మార్పు చోటుచేసుకొని ఆచరణలో స్థిరపడసాగింది. పితృస్వామ్య వ్యవస్థ ఏర్పడేవరకూ స్త్రీ పురుషులు ఏ పనిచేసినా అది పని సౌలభ్యాన్ని, వీలును దృష్టిలో పెట్టుకొని మాత్రమే చేశారు. సామాజిక ఉత్పత్తిరంగం నుండి స్త్రీ తన భాగస్వామ్యాన్ని కోల్పోతూ "పురుషుడిదైన" కుటుం బానికి బాధ్యత వహిస్తూ "గృహిణినిస"గా పిల్లల్ని కనటానికి ఇంటి చాకిరికి పరిమితమయ్యే క్రమంలో పనికి ఆడపని, మగపని అన్న భేద స్వభావం ఏర్పడుతూ స్థిరపడుతూ వచ్చింది. పిల్లల్ని కనటం స్త్రీకి ప్రకృతి సహజమైన పని. అదెంత సహజమైందో పిల్లల్ని పెంచటం, వంట చెయ్యటం, ఇల్లు శుభ్రం చెయ్యటం, భర్తకు సేవచేయటం అనేవి కూడా అంత సహజమైన స్త్రీ పనులుగా ముందుకు వచ్చాయి. ఈ భేదం క్రమక్రమంగా రూపు కట్టుకొంటూ అత్యంత ఘనీభూతరూపంతో నేటి సమాజాలలో అస్తిత్వంలో వుండటాన్ని గమనించవచ్చు. దీనిని సాహిత్యం ద్వారా అవగాహన చేసుకొని అంచనాకట్టే ప్రయత్నం చేయటం — ఈ వ్యాసం ఉద్దేశ్యం.

## II

క్రీ॥పూ॥ 1200 నుండి క్రీ॥పూ॥ 1000 సంవత్సరాల వరకూ వున్న సమాజ చరిత్రను చిత్రించే ప్రామాణిక వాఙ్మయాధారం ఋగ్వేదం. ఋగ్వేదంలోనే వైదిక వాఙ్మయం ప్రారంభమవుతుంది. తరువాత వచ్చిన సామవేదానికి, యజుర్వేదానికి, అధర్వణ వేదానికి ఋగ్వేదానికున్న చారిత్రక ప్రాధాన్యం లేదు.[4] అప్పటికి 1500 సంవత్సరాల క్రితమే బీజరూపంగా ప్రారంభమైన పితృస్వామ్య వ్యవస్థ ఋగ్వేదకాలం నాటికి పరిణామరూపాన్ని తీసుకొంటున్నది.[5] స్త్రీలు పితృనామంలోనో, భర్తృ నామంలోనో గుర్తించబడి వ్యవహరించబడే స్థితి వచ్చింది. స్వంత ఆస్థి వ్యవస్థ, దానిని మగ సంతానానికి వారసత్వంగా సక్రమింపచేయటం, ఆ వారసత్వాన్ని ఖచ్చితంగా తెలుసుకోవటంకోసం దాంపత్య వ్యవస్థ స్థిరపడటం మొదలైంది.[6] ఇటువంటి సామాజికార్థిక వ్యవస్థలో స్త్రీని గురించి, స్త్రీల పని గురించి తక్కువ భావనలు రూపుకట్టు కున్నాయి. ఋగ్వేదకాలంనాటికి స్త్రీలు యుద్ధాలలో పాల్గొన్న సంఘటనలు, స్త్రీలు విద్యావంతులై ఋగ్వేదంలోని కొన్ని ఋక్కులను చెప్పిన సన్ని వేశాలూ వున్నా మొత్తంమీద స్త్రీ అబలాస్థాయికి దిగజార్చబడింది. దాసుడు స్త్రీలను సాయుధులను చేసి యుద్ధంలో వాడుకొంటున్నాడని బభ్రుఋషి చెప్పినప్పుడు ఇంద్రుడు "అబలాసైన్యం నన్నేమిచేస్తుంది" అని అన్నాడట. దీనినిబట్టి ఆనాటికి స్త్రీని గురించి ఆమె పనులకు సంబం ధించి ఎంత తేలిక భావాలు వ్యాపించిందీ, స్త్రీ కుటుంబ సంబంధమైన పనులకు ఎంతగా పరిమితం చేయబడ్డదీ, ఆ హద్దులు దాటి సామాజిక కార్యకలాపాలల్లో పాల్గొన్న స్త్రీ ఎట్లా హేళనకు గురయిందీ – మనకు స్పష్టంగా అర్థమవుతుంది. ఈ విధంగా స్త్రీ "అబల"గా వ్యవహరింప బడడం ఋగ్వేదకాలం నుండి ప్రారంభమైంది[7].

మొత్తంమీద ఋగ్వేదకాలంనాటికి స్త్రీలకు ఆరోగ్యవంతుడైన ప్రియ మైన భర్తను పొందటం జీవితలక్ష్యంగా[8], భర్తకు తానుకాక మరెంత మంది స్త్రీలున్నా తాను మాత్రం అతని అనుగ్రహానికై తపిస్తూ వుండటం ధర్మంగా[9], భర్త యింటి పెత్తనం నిర్వహించటమే పనిగా[10], స్థిరపడటం

కనబడుతుంది. మిగిలిన వేదాలు, ఉపనిషత్తులు, గృహసూత్రాలు-ఇవన్నీ క్రమంగా స్త్రీల జీవితాన్ని కుటుంబాలకు మరింత పకడ్బందీగా పరిమితం చేస్తూ గృహ కృత్యాలు మాత్రమే స్త్రీలకు సంబంధించిన పనులుగా నిర్దేశించాయి. ఋగ్వేదకాలం నాటికి ఋక్కులను రచించగలిగిన స్థితిలో వున్న స్త్రీలు క్రమంగా వేదం చదవకూడని, వినకూడని స్థితికి నెట్టివేయబడ్డారు.

## III

పురాణేతిహాసాలు, తరువాత తరువాత వచ్చిన కావ్య ప్రబంధాలు-యివన్నీ లౌకిక వాఙ్మయంకింద లెక్క. ఈ లౌకిక వాఙ్మయం స్త్రీల పని గురించి ఎటువంటి భావాలను ప్రోదిచేసి ప్రచారం చేసింది ? - భర్తకు స్నానాదికాలకు ఏర్పాట్లు చేయటం, మంచి భోజనాన్ని తయారుచేసిపెట్టటం, కాళ్ళు పిసకటం వంటి సేవలు చేయటం (అరణ్యపర్వం, పంచమాశ్వాసం, పద్యసంఖ్య 10, 11) భర్తవైపు బంధువులకు మిత్రులకు "భోజనాది సత్కృతములు" చేస్తూ ఆదరించటం (అరణ్య, పంచమ 319) స్త్రీలు చెయ్యాల్సిన పనులుగా భారతం ప్రచారం చేసింది. ఈ పనులను అత్యంత ఆసక్తితో చేసే స్త్రీకి భర్త ఆదరం దొరుకుతుంది. పతివ్రతగా గౌరవం దక్కుతుంది. ఈ ఆశలుచూపి స్త్రీలను-ఇంటిపనులకే పరిమితం అయి వాటి "సక్రమ నిర్వహణ"కే తమ శక్తియుక్తుల నన్నింటినీ వినియోగించుకోవటం గురించి నిత్యం ఆలోచిస్తూ ప్రవర్తిస్తూ వుండేట్లు చేయటంలో భారతం తనవంతు పాత్రను నిర్వహించింది. కాస్తో కూస్తో వ్యక్తిత్వం కలిగి పురుషుడితో దీటుగా ప్రవర్తించటం తన హక్కు అన్న స్పృహలో భర్తతోపాటు యుద్ధాలలో పాల్గొనటానికి సైతం ఉత్సాహాన్ని చూపే సత్యభామవంటి స్త్రీలుకూడా ద్రౌపది బోధద్వారా యింటి పనులు, వంట పనులు మొదలైన వాటి గురించి గొప్పగా భావించినట్లు, భర్త అనుగ్రహం కోసం, సమాజంలో గౌరవంకోసం ద్రౌపదిలాంటి పతివ్రతల అడుగుజాడల్లో నడవడానికి సిద్ధపడ్డట్లు చెప్పటంద్వారా భారతం పురుష స్వామ్య సమాజ ప్రయోజనాల కనుగుణంగా తన కర్తవ్యాన్ని "అమోఘం"గా నిర్వహించింది.

రామాయణానికి భారతానికున్నంత విస్తృత సామాజిక భూమిక లేదు. అందువలన అది స్త్రీ శీలానికి సంబంధించిన పాతివ్రత్య భావనను ప్రచారం చెయ్యటానికి ప్రాధాన్యమిచ్చినంతగా స్త్రీ పనికి సంబంధించిన భావాలను ప్రచారం చెయ్యటానికి ప్రాధాన్య మివ్వలేదు.

ఈ రెండు ఇతిహాసాలూ కాక మనకు పద్దెనిమిది (18) పురాణాలున్నాయి. ఇవన్నీ ఏదో ఒక దైవాన్ని ఆశ్రయించుకొని సాగినవి. అందువల్ల వాటిలో సామాజిక జీవిత చిత్రణకు అవకాశం దాదాపు లేదవే చెప్పాలి. ఫలితంగా పురాణాలనుండి కూడా స్త్రీ పనికి సంబంధించిన భావనలు మన కంతగా అందిరావటం లేదు.

ఇక కావ్యప్రబంధాల దగ్గరకు వస్తే వాటితో కవి ప్రతిభా పాండిత్య ప్రదర్శనానికి అవకాశ మెక్కువ. అందుకోసం కవి తనకు తెలిసిన సర్వ విజ్ఞానాన్ని రచనలో ఉపయోగించుకొనే ప్రయత్నం చేస్తాడు. ఫలితంగా కావ్యప్రబంధాలలో అక్కడక్కడా కవుల కాలం నాటి సామాజికాంశాలు, అందులో భాగంగా స్త్రీ పనికి సంబంధించిన భావనలు కనబడతాయి. ఎఱ్ఱప్రెగ్గడ వ్రాసిన హరివంశం కావ్యాన్ని పరిశీలిస్తే మన కీ విషయం స్పష్టమవుతుంది. హరివంశం పూర్వభాగంలోని అయిదవ ఆశ్వాసంలో "వ్రేపల్లె" వర్ణన వుంది. అందులో వ్రేపల్లెలోని గొల్లస్త్రీలు ఏమేమి పనులు చేస్తున్నారో చెప్పబడింది. ఆ వర్ణనద్వారా ఎఱ్ఱన స్త్రీల శ్రమైక జీవన సౌందర్యాన్ని మన కళ్ళముందు చిత్రించిన మాట నిజమే. కానీ, స్త్రీలు చేసిన ఆశ్రమఅంతా ఏటినుండి నీళ్ళు తీసుకురావటానికి, మజ్జిగ చిలకటానికి, ఇళ్ళు ఊడ్చుకోవటానికి, పిల్లల్ని సముదాయించటానికి, పిల్లలకు, కూలివాళ్ళకు అన్నాలు పెట్టటానికి సంబంధించినదన్న విషయం గమనించాలి. అట్లా గమనించినప్పుడు స్త్రీల పని కుటుంబానికి, పిల్లల పెంపకానికి ఎంతగా పరిమితమయిందీ మనకు అర్థమవుతుంది.

మనుచరిత్ర దగ్గరకువస్తే ఈ కథకు మూలపురుషుడు ప్రవరుడు. అతనెంత అందగాడో, ఎంత నైష్ఠికుడో వర్ణించటంగా ఈ ప్రబంధం మొదలవుతుంది. "అతిథి అభ్యాగత సేవా పరతంత్రుడైన" ఆ ప్రవరుడి భార్య

గురించి ఒకే ఒక్క తేటగీతి పద్యంలో చెప్తాడు అల్లసాని పెద్దన. ఆమె "ప్రవరుడి భార్య" అంతకుమించి వేరే పేరు లేదామెకు. ప్రవరుడు యజ్ఞ యాగాదులు చేస్తుంటే, శిష్యులకు పాఠాలు చెప్తుంటే ఆయన భార్య చేసే పనేమిటయ్యా అంటే వంట. ఆ వంట చెయ్యటానికి తగిన ఉత్సాహాన్నివ్వ టానికి ఆమెను "అన్నపూర్ణ" (పార్వతీదేవి)గా కీర్తించటం. వెయ్యిమంది వచ్చినా వంట చెయ్యటానికి అలిసిపోదని, అర్ధరాత్రి అయినా లేదనకుండా పెడుతుందనీ మెచ్చుకోవటం[11].

అట్లాగే ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుడనే భక్తుడి కథ వుంది. ఆ భక్తుడు (ప్రవరుడిలాగానే) వైష్ణవ భక్తులకు ఆతిథ్యమిచ్చి అన్నం పెడు తుంటాడు. ఆ వచ్చిన భక్తులు ఏమేమికోరితే అవన్నీ పెట్టి వాళ్ళను సంతోషపరుస్తుంటాడట. ఇంతకూ ఆ భక్తులు కోరేవన్నీ చేసిపెట్టేవని ఎవరిదంటే తనకంటూ ఒక పేరుకూడాలేని విష్ణుచిత్తుడి భార్యది. ముసురు పట్టివున్న వర్షాకాలంలో కళ్ళలోకి పొగపోకుండా (పొగపోతే ఆ బాధతో వంట ఎక్కడ పాడుచేస్తానో అన్న భయంతో) ఎండిన కొబ్బరిమట్టలు, చిప్పలు మొదలైన వంటచెరుకును తగిలించి అన్నం, పప్పు రకరకాల కూరలు వండి వడియాలు, వరుగులు సిద్ధంచేసి నేతితో, మంచి పెరుగుతో వాళ్ళకు భోజనాలు పెడుతుంది ఆవిడ[12]. ఇంతపనీ ఆవిడచేస్తే, ఎవ్వరేమి అడిగితే వాళ్ళకది పెట్టి సంతోషపెట్టిన ఘనత, గొప్ప వైష్ణవ భక్తుడన్న పేరు దొరికేది విష్ణుచిత్తుడికి. సామాజిక ఉత్పత్తిరంగాలనుండి స్త్రీ దూరం చేయబడటం సంగతి అట్లావుంచినా భక్తిమార్గంలోకూడా ఆమెకు పురు షుడితో సమానమైన అవకాశం, ప్రతిపత్తి లేకపోవటం యిక్కడ కనబడు తుంది.

ప్రవరుడుగానీ, విష్ణుచిత్తుడుగానీ మంచి గృహస్థులుగా పేరు తెచ్చు కోవటానికి వెనక అసలుపని చేసింది వాళ్ళ భార్యలు. వాళ్ళు చేసింది వంట యింటిపనే అయినా, ఆ పని చేసినందుకుకూడా వాళ్ళకేమీ గుర్తింపు, గౌరవం దొరకలేదు. వాళ్ళు చేసిన ఆ పని ఫలితం పురుష ప్రయోజనాల కనుకూలంగా వాడుకోబడింది. స్త్రీ చేసిన ఏ పని ఫలితమూ ఆ స్త్రీకి చెందకపోవటాన్ని గుర్తించినవాళ్ళు ఏ ఒకరిద్దరో లేకపోలేదు.

అయితే పురుషస్వామ్య ప్రయోజనాల కనుగుణమైన భావాలు ప్రధాన ప్రవంతిగా పరివ్యాపితమై సాగుతున్న సమాజాలలో వాళ్ళ భావాలు రికార్డు చేయబడలేదు. అవి చెదురుమదురుగా అనోటా ఈనోటా పాకి మౌఖికంగా మనవరకూ వచ్చిన సందర్భాలున్నాయి. అటువంటి సందర్భంలోదే "కోటసింగరాజు మాటవాసియెగాని/గంగమాంబ వలన ఘనతకెక్కె/గంగమాంబ తాను గయ్యాళి అయితేను/సింగరాజు ఏమి చేయగలడు" - అనే చాటుపద్యం. కోట సింగరాజు అనే ఒకాయన వుండే వాడు. ఆయన గొప్ప అన్నదాత అని పేరు పొందాడు. అందరూ ఆయనను ప్రశంసించటమే. ఇదంతా వినీవినీ ఒక కవి ఎవరో సింగరాజు గారి అన్నదాన కీర్తి వెనుక వున్న ఆయన భార్య చేసిన పనిని ఎవరూ గుర్తించలేదే అని బాధపడ్డాడు. ఆమె కనుక అతనికి సహకరించకపోతే, ఇంట్లో వండి వడ్డించకపోతే ఈయనకి కీర్తి ఎక్కడ్నించి వచ్చేది అని ఆలోచించాడు. ఆ ఆలోచననే పద్యరూపంలో ఆవిష్కరించాడు. ఈ పద్యంలో స్త్రీ చేసిన పనిని గుర్తించటం, గౌరవించటం, ఆ స్త్రీని పెద్దన, కృష్ణదేవరాయలవలె గృహిణిగానో, భార్యగానో కాక "గంగమ్మ" అనే ఒక పేరులో స్వతంత్ర వ్యక్తిగా పేర్కొనటం-అనేవి-ఆ అజ్ఞాతకవి హృదయంలో స్త్రీ పట్ల వున్న సానుభూతిని, స్త్రీ పనిని గురించి వున్న అనుకూల దృక్పథాన్ని స్పష్టం చేసేవిగా వున్నాయి.

పాండురంగ మాహాత్మ్యము అనే ప్రబంధంలో నిగమశర్మ కథ వుంది. ఆ కథలో నిగమశర్మ అక్క పాత్ర ప్రవర్తనలో స్త్రీ పనికి సంబంధించి ఒక భిన్నమైన దృక్పథం కనబడుతుంది. ప్రవరుడి, విష్ణుచిత్తుడి భార్యలకు లాగానే ఈమెకు కూడా ప్రత్యేకమైన పేరులేదు. అయితే ఈమె ఫలానా పురుషుడి భార్యగాకాక మరో పురుషుడి అక్కగా గుర్తించబడి వ్యవహరించబడింది. ఆమె ప్రసిద్ధి అంతా నిగమశర్మ అక్క అనే. ఈమె మంచి వ్యవహారజ్ఞానం కల స్త్రీ. తమ్ముడి దుర్వ్యసనాలవల్ల చెడిపోతున్న పుట్టింటి సంసారాన్ని చక్కదిద్దటానికి భర్తనూ, పిల్లల్నీ తీసుకొని వస్తుంది. బాధ్యత అంతా చేతుల్లోకి తీసుకొని కొన్ని పనులు తాను చేస్తూ, కొన్ని భర్తచేత చేయిస్తూ ఆ ఇంటిని ఒక పద్ధతికి తెస్తుంది. ఈమె గృహనిర్వహణా చేస్తుంది - అంతకంటే ఎక్కువగా బయటి పనులూ నిర్వ

హిస్తుంది. అగ్రహారం వ్యవహారాలు చక్కబెట్టటం, పొలమూ పుట్రా చూసుకోవటం – మొదలైన ఆర్థిక వ్యవహారాలను గొప్ప నేర్పుతో నిర్వహిస్తుంది.[13] అంటే అవకాశం దొరికితే స్త్రీ అన్ని పనులూ చేయటానికి సమర్థురాలే నన్నమాట. పనులు చెయ్యాలన్న ఉత్సాహం స్త్రీలోకూడా వుంటుంది. అయితే పురుషస్వామ్య సమాజం అడుగడుగునా ఆమె సమర్థతను, ఉత్సాహ శక్తిని అణచివేస్తూ ఆమె శక్తియుక్తులన్నీ అనుత్పాదకమైన గృహకృత్యాలమీద వెచ్చించేట్లు ఒత్తిడి చేస్తుంది. తద్వారా ఆర్థికరంగంలో పురుషుణ్ణి "ఏకచ్ఛత్రాధిపతి"గా చేసి స్త్రీని శోషణకు, పీడనకు గురిచేస్తుంది.

ఈ విధంగా క్రీ॥పూ॥ 1200 సంవత్సరాలనుండి క్రీ॥శ॥ 1800 సంవత్సరాల వరకూ దాదాపు మూడువేల సంవత్సరాలు స్త్రీ జీవితం కుటుంబానికి, దాని మంచిచెడ్డలకు, వంటావార్పులకు, భర్త అత్తమామల సేవలకు, పురుషుడి భోగానికి, సంతానానికి పరిమితం చేయబడి తత్సంబంధమైన భావనలే సాహిత్యమంతటా పరుచుకొని ప్రచారం చేయబడ్డాయి.

## IV

బ్రిటిషువాళ్ళు భారతదేశంలోకి వ్యాపారం నిమిత్తంగా ప్రవేశించి క్రమంగా రాజ్యాధికారాన్ని స్థిరం చేసుకోవటంతో 18వ శతాబ్దం ఉత్తరార్థంనుండి భారతీయ సమాజంలో విప్లవాత్మకమైన పరిణామాలు చోటు చేసుకోసాగాయి. సర్వమానవ స్వేచ్ఛకు, సమానత్వానికి సంబంధించిన ఉదారభావాలు ప్రచారంలోకి వచ్చాయి. ఇంగ్లీషు చదువులు భారతీయులకు కొత్త ఆలోచనాలోచనాల నిచ్చాయి. మారుతున్న పరిస్థితులకు అనుకూలంగా సమాజాలను మార్చుకోవాలన్న సంకల్పాన్ని కలిగించాయి. ఫలితంగా వివిధ రంగాలలో సంస్కరణోద్యమాలు నిర్మించబడి నిర్వహించబడ్డాయి. ఈ క్రమంలోనే భారతీయ సమాజంలో తరతరాలుగా ఎన్నోరకాల అణచివేతలకు, పీడనలకు గురి అవుతూ వెనుకబడి వున్న స్త్రీల స్థితిగతులను మెరుగుపరచటం లక్ష్యంగా సంస్కరణోద్యమాలు రూపుదిద్దుకొన్నాయి. ప్రారంభదశలో సతీ సహగమనానికి, బాల్య

వివాహాలకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమం తరువాతి దశలో స్త్రీ విద్యకై పాటుపడింది. భారతీయ స్త్రీ విమోచనోద్యమంలో స్త్రీ విద్యకు సంబంధించిన అంశం-1850 సంవత్సరాలనుండి 1940 ల వరకూ, ఇంకా చెప్పాలో వలసివస్తే స్వాతంత్ర్యం వచ్చేవరకు, వచ్చిన తరువాతకూడా-ప్రధానమైనదిగా కొనసాగుతూ వచ్చింది. రాజారామ్మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, డి.కె. కార్వే, వీరేశలింగంపంతులు మొదలైనవారు స్త్రీల చదువుకు సంబంధించిన అనుకూల భావాలను ప్రచారం చేయటంలో చేసిన కృషి చెప్పుకోతగ్గది.

అయితే స్త్రీ విద్యకు సంబంధించిన ఉద్యమాలు స్త్రీ విద్య ప్రధానంగా ఆమెను మంచి భార్యగా, గృహిణిగా, తల్లిగా తీర్చిదిద్దటం గురించి సిద్ధాంతపరమైన సూత్రీకరణలు చేసాయి.[14] ఈ సందర్భంగా స్త్రీ విద్యను గురించి ఉపన్యసిస్తూ (1880) వీరేశలింగం పంతులుగారు చెప్పిన-"స్త్రీలు చదివినవారగుదురేని యింటిపనులనువారు మిక్కిలిపొదుపుగానూ, జాగ్రత్తగానూ నిర్వహింతురు...స్త్రీలు చదివినవారైన పూర్వపు పుణ్యసతుల చరిత్రలను చదివి తామును వారివలెనగుటకు ప్రయత్న పడుదురు...తమ బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పి సత్ప్రవర్తనను గల వారినిగా జేయుటయేకాక వారు పాఠశాలయందు చదువుకొన్న, వానిని పరీక్షించి శిక్షించుచుందురు..."[15] మొదలైన విషయాలు గమనించదగ్గవి. వీరేశలింగం గారికంటే యాభై సంవత్సరాలు ముందుకు వచ్చిన తరువాతకూడా స్త్రీ విద్యను గురించిన ఈ భావానికి సంబంధించిన మార్పు స్త్రీలలో సైతం రాలేదు. స్త్రీల గృహిణీత్వ పరిరక్షణ కనుకూలంగానే స్త్రీల చదువు వుండాలని భావించి అందు నుగుణంగా ఢిల్లీలో హోమ్‌సైన్స్ కాలేజిని ప్రారంభించాలని మహిళోద్యమ మహిళా నాయకులే నిర్ణయించారు[16]. కాబోయే గృహిణులను, అయి సిద్ధంగావున్న గృహిణులను కూడా ఆధునిక నాగరికతా సంస్కృతులలో మెరుగెక్కించటానికి 1932లో ఢిల్లీలో ఏర్పడ్డ ఈ కాలేజిని "ఫినిషింగ్ స్కూలు" అనే పేరుతో దాని వర్గ స్వభావాన్ని విమర్శకు పెడుతూ 1940 లలో "రాజధాని" అనే నవల ఒకటి బెంగాలీ భాషలో వచ్చింది. బెంగాలీలో సుబోధవసు వ్రాసిన ఆ నవలకు "సన్నపనేని సుబ్బారావు"

చేసిన తెలుగు అనువాదాన్ని 1950 లో ప్రజా సాహిత్య పరిషత్తు (తెనాలి) వారు ప్రచురించారు.

స్త్రీల సామాజిక ప్రతిపత్తిలో ఏ మార్పునూ తీసుకురావటానికి సిద్ధంగాలేని ఈ చదువుకూడా స్త్రీల విషయంలో వ్యతిరేకించటం చరిత్ర లోనూ, సాహిత్యంలోనూ కనబడే ఆశ్చర్యకరమైన వాస్తవం[17].

ఇటువంటి పరిస్థితులలో స్త్రీ స్వతంత్రమైన వృత్తి ఉద్యోగాలను నిర్వహించే స్థితికి ఎదగాలని, లేకపోతే స్త్రీ విద్య ఏ లక్ష్యమూలేని ప్రణాళికే అవుతుందన్న భావాన్ని పాశ్చాత్య మహిళోద్యమ నాయకులు వ్యక్తం చేశారు. అయితే అప్పుడు స్త్రీల గృహ నిర్వహణా బాధ్యతలకు, కర్తవ్యాలకు ఏమాత్రం అడ్డంకి రాకుండా వాళ్ళు సామాజిక కార్యకలాపాలలోకి, వృత్తి ఉద్యోగాలలోకి ప్రవేశించటం ఎట్లాగా అన్నది ఒక సమస్యగా ముందుకు వచ్చింది. వంటయింటి పనిని స్త్రీకి సులభం చెయ్యాల్సిన అవసరాన్ని అది గుర్తించింది.[18] అంతేకానీ ఇంటిపని తనది మాత్రమే ఎందుకైందో, దాని సాంస్కృతిక మూలాల గురించి ఆలోచించే చైతన్యాన్ని ఈ చదువులు స్త్రీలకివ్వలేదు. ఫలితంగా ఇన్నాళ్ళనుండి గుర్తింపులేని, ప్రతిఫలంలేని "ఇంటి చాకిరి" మాత్రమే పనిగా చేసుకొంటూ వస్తున్న స్త్రీలు-సామాజికమైన గుర్తింపువున్న వృత్తి ఉద్యోగాలలోకి ప్రవేశించి ఆర్థికమైన ప్రతిఫలాన్ని పొందే స్థితి వచ్చినప్పటికీ-ఇంటిపని, వంటపని, పిల్లల పెంపకం మొదలైనవి తమ పనులనే నేటికి భావిస్తున్నారు. అట్లాగే ప్రవర్తిస్తున్నారు. బయటి పనిచేస్తూ ఇంటిపనినికూడా చక్కబెడుతున్నారు. తమ ప్రయోజనాల కనుకూలమైన ఈ వైఖరిని పురుషులు ఇతోధికంగా ప్రోత్సహిస్తున్నారు. భర్తతోపాటు ఏదో ఒకపనిచేసి సంపాదించే స్త్రీ ఎవరైనా ఇంటిపనిలో భర్తను తనతోపాటు బాధ్యత పంచుకోమని డిమాండ్‌చేస్తే స్త్రీ పురుష లిద్దరూ కలిసి ఆమెను అహంకారిగానో, పొగరుమోతుగానో ప్రచారం చేస్తారు. గాస్‌స్టవ్‌లు, కుక్కర్లు, గ్రైండర్లు, వచ్చిన తరువాత స్త్రీకి ఇంటిపని కష్టమేమిటని అంటారు.

ప్రపంచానికి మార్క్సిజమ్ అనే నూతన ఆర్థిక సామాజిక తాత్విక

సిద్ధాంతం తెలిసిన తరువాత ఆ వెలుగులో "పనులు" అనేవి కేవలం పురుషులకో, కేవలం స్త్రీలకో సంబంధించినవిగా వుండవని అందరికీ అన్ని పనులు చేయటానికి అవకాశం వుందని, కొన్ని పన్లకు కొందర్ని నిర్దేశించటం, జీవితాంతం వాళ్ళాపన్లకే కట్టుబడి వుండాలనటం దోపిడి సమాజ స్వభావమనే విషయం[19] అవగాహనకు రాసాగింది. ఈ అవగాహనతో ఈనాడు తెలుగు సాహిత్యంలో అక్కడక్కడా "ఇంటిపని"కి సంబంధించిన పాతభావనలమీద చర్చలు లేవదీసి, ఆ భావనలను తొలగిస్తూ స్త్రీ పురుషుల చైతన్యపరిధిని విస్తృతం చేసే ప్రయత్నం జరుగుతున్నది. ఇటీవలికాలంలో "జానకి విముక్తి" నవలలో ఈ ప్రయత్నం ఉద్యమ స్థాయిలో విజయవంతంగా చేయబడ్డది.

ఐ.వి.యస్. అచ్యుతవల్లి "సీతకలు" అనే నవలలో (మార్చి 1978) పనులకు ఆడామగా తేడాలేమిటి? అన్న ప్రశ్నను లేవదీశారు - ఆ తేడా ఏమీలేదన్న నిశ్చితాభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ (పు: 121) ఈ నవలలో కాలేజీలో చదువుకొంటున్న ఒక అమ్మాయి ఉప్మా చెయ్యటానికి అల్లం పచ్చిమిరపకాయలు తరగమని అన్నగారికి పని పురమాయించి నప్పుడు వాళ్ళమధ్య సంభాషణలో "ఆడపిల్లలతో సమానంగా మగపిల్లలు కూడా వంటపని చెయ్యాలా" అన్న ప్రశ్న వస్తుంది. దానికి ఆ అమ్మాయి యిచ్చిన సమాధానం : "మీరు మగపిల్లలు. మీతో సమానంగా నేను చదువుకోపటంలేదూ. తినేతిండి మీరూ నేను ఒకలాగే తింటున్నాము. ఆడ, మగా అని తిళ్ళు వేరే వున్నాయా? కాస్త పనిలో సాయంచేస్తే ముగ్గురం బైటపడచ్చుగా" ఆ సందర్భంగా తల్లి కూతుర్ని సమర్థిస్తూ, కొడుకులను మందలిస్తుంది-పనులకు ఆడ, మగా తేడా లేదంటుంది.

జానకి విముక్తి నవలలో సత్యం అధ్యయనం, ఆలోచన, అనుభవాలద్వారా పనులకు ఆడా మగా తేడాలేదని గ్రహించి యిప్పటి సమాజాలలో పనులకు మధ్య పాటింపబడుతున్న ఆ తేడాని ఆచరణలో తాను అధిగమించటానికి ప్రయత్నిస్తాడు. వంటచెయ్యటం దగ్గరనుండి బియ్యం చెరగటం, ఇల్లు చిమ్మటంవరకూ అన్ని పన్లూ అందరూ నేర్చుకొంటే వచ్చేవేనని తాను వాటిని నేర్చుకోవటానికి సంసిద్ధుడవుతాడు. తల్లుల

దగ్గర, అక్కచెల్లెళ్ళ దగ్గర వాళ్ళకు సాయంగా వుండేందుకు ఇంటి పనులు చక్కబెట్టే పురుషులు కూడా పెళ్ళయ్యాక ఆ పన్లు చేసుకోవటానికి భార్యవుందికదా అని అసలా వైపుకే వెళ్ళరు. సత్యం శాంతదగ్గర కూడా ఆ తేడా ఏదీలేకుండా అదేదో తానామెకు చేస్తున్న మహోపకారంగా కాక చాలా సహజంగా "ఇంటిపన్లు" నిర్వహించినట్లు చూపటంద్వారా రంగ నాయకమ్మ పనులకున్న భేద స్వభావాన్ని విస్మరించేట్లు చెయ్యటమే కాకుండా స్త్రీ పురుషుల సహజీవనం ఎట్లా వుండాలో కూడా చూపించారు.

స్త్రీకి ఇంటిపని భారం తగ్గకపోతే ఆమె సామాజిక రంగాలలోకి అడుగుపెట్టినా తాను చేస్తున్న వృత్తి ఉద్యోగాలకు పూర్తి న్యాయం చేకూర్చలేదు. ఎందుకంటే అది అతి క్రూరంగా, ఆటవికంగా స్త్రీల కాలాన్ని శక్తిని మింగేస్తుంది. స్త్రీల సృజనాత్మకతని చంపేస్తుంది. స్త్రీల ఆత్మలనూ మెదళ్ళనూ మొద్దుబారుస్తుంది. సాంఘికంగా స్త్రీల స్థాయిని నీచ పరుస్తుంది.[20] – కనుక. అందువల్లనే ఉద్యోగాలు చేసే స్త్రీలు తరచుగా సరిగా పనిచెయ్యరని, ఎప్పుడూ వాళ్ళ ధ్యాస ఇంటిమీదా, పిల్లలమీదానే వుంటుందని వాళ్ళు వూరికనే జీతాలు తీసుకొంటున్నారని సహోద్యోగులైన పురుషుల విమర్శలకు గురికావల్సి వస్తూవుంటుంది. ఈ పరిస్థితిని అధిగమించి స్త్రీ సామాజిక ఉత్పత్తిరంగాలలో తన శక్తిసామర్థ్యాలను సంపూర్ణంగా నిరూపించుకోవటానికి ఇంటిపనులన్నీ సమాజపరం అయినప్పుడుమాత్రమే సాధ్యమవుతుంది.

స్త్రీలు బైటకు వచ్చి సామాజిక కార్యకలాపాలలో తమ శక్తిసామర్థ్యాలను నిరూపించుకొనే అవకాశాలు పూర్వంకంటే యిప్పుడు కొంత మెరుగైనమాట నిజమే. కానీ స్త్రీని తక్కువగానూ, భోగవస్తువుగానూ తప్ప చూడలేని పితృస్వామిక సామాజిక పునాది తత్సంబంధమైన సాంస్కృతిక భావజాలం ఏమీ మారలేదు. ఫలితంగా ఇల్లుదాటి బైటకు వచ్చిన స్త్రీ అనేకరకాల అవమానాలకు, హేళనలకూ గురికావలసివస్తున్నది. వివిధ వృత్తి ఉద్యోగాలలోకి ప్రవేశించి పనిచేసుకొనే స్త్రీలకు రక్షణ లేకుండా పోతున్నది. ఈ పరిస్థితి స్త్రీల ఉత్సాహాన్ని, శక్తియుక్తులను నీరుకార్చి

మళ్ళీ వాళ్ళను 'ఇంటి నాలుగు గోడలకే పరిమితం' అయ్యేందుకు ఒత్తిడి తెచ్చేదిగా వుంది. ఈ రకమైన సామాజిక స్థితిని – వృత్తి ఉద్యోగాలలో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి చంపకం – చదపురుగులు (మాలతీ చందూర్), రాబందులు – రామచిలుకలు (వాసిరెడ్డి సీతాదేవి) మొదలైన నవలలు వచ్చాయి.

ఇంటిపని ఎట్లాగూ తప్పదు–బైటపనికి కూడా వస్తే స్త్రీకి పనిభారం ఎక్కువవుతున్నది. పైగా యింకా అనేక సమస్యలను ఎదుర్కోవలసి వస్తున్నది. అటువంటప్పుడు స్త్రీ ఇట్లా సామాజిక కార్యకలాపాలలోకి "తగుదునమ్మా" అని చొరబడుట యెందుకు ? – అని అతి తెలివిగా ప్రశ్నించే వాళ్ళుంటారు. వాళ్ళకు ఒకటే సమాధానం. పని చెయ్యటం బాధ్యతతోటి, కష్టంతోటి కూడుకొన్నదే కావచ్చు. కానీ అది స్త్రీలను తర తరాల అణచివేతనుండి విముక్తి చెయ్యగల సాధనం. విముక్తివల్ల దొరికే భవిష్యత్సుఖంకోసం గౌరవంకోసం ఈనాటి ఈ కష్టాలను ఎదుర్కోవ టానికి, పరిష్కారాలను వెతుక్కోవటానికి స్త్రీలు సంసిద్ధులవుతున్నారు. సంఘాలుగా తమను తాము సమీకరించుకొంటున్నారు. పనిచేయటాని కున్న హక్కు తమ జీవన్మరణ సమస్యకాగా పని పరిస్థితులను మెరుగు పరుచుకోవటానికి, పనికి తగిన ప్రతిఫలాన్ని పొందటానికి ఉద్య మిస్తున్నారు.[21] ఈ రకమైన ఉద్యమ ప్రతిఫలన రూపమైన సాహిత్యం వివిధ రంగాలలో పనిచేసే స్త్రీలకు ధైర్యాన్ని, ఉత్సాహాన్ని యివ్వగలిగి వుంది.

పొలంలో పనిచెయ్యటం తెలిసిన పాలకుర్తి అయిలమ్మ తాము కష్టించి పండించిన ఆ పంటను విసునూరి రామచంద్రారెడ్డి కొల్లగొట్టబోతే ఆ పంటమీద తనకున్న హక్కును నిలబెట్టుకోవటానికి చేసిన సాహస యుతమైన పోరాటం స్మరించుకోతగ్గది. "ఆడది ఏంచేస్తుందిలే" అన్న ధీమాతోవున్న దొరకు–ఆడదైనా పనిచెయ్యటం తెలిసిన వ్యక్తి, ఆ పని ఫలితాన్ని దక్కించుకోవటం కోసంకూడా అంత శ్రమపడుతుందన్న విష యాన్ని తన ప్రవర్తనద్వారా అర్థమయ్యేట్లు చేసింది అయిలమ్మ.[22] అయిలమ్మవంటి స్త్రీలకు ప్రతీకగా వట్టికోట ఆళ్వారుస్వామి నవల "ప్రజల

మనిషి"తో అన్నమ్మ కనబడుతుంది. రాళ్ళు రప్పలతో నిండివున్న భూమిని సాగుకు తీసుకురావటంలో భర్తతోపాటు కష్టపడి పనిచేసిన అన్నమ్మ కొడుకు హయాంలో ఆ పొలాన్ని దొర మనుషులు ఆక్రమించుకోబోతే, అరకల కడ్డంపడి తన పొలాన్ని రక్షించుకొనే యత్నం చేసింది. బీడీలుచేసి బ్రతుకులు గడిపే స్త్రీలు తమ పని పరిస్థితులు మెరుగుపరుచుకోవటంకోసం, పనికి తగిన కూలీలకోసం-సాగించిన సాగిస్తున్న పోరాటాన్ని "బ్రతుకుపోరు" (బి.యస్. రాములు) నవల చిత్రిస్తుంది.

పని చెయ్యటం - ఇంటిపనికాదు - సమాజాని కంతటికీ పనికొచ్చేది పురుషుడితో సమానంగా పాల్గొని చెయ్యటానికి అవకాశమున్నదీ - అయిన పని చెయ్యటం స్త్రీకి జీవితావసరం కావాలి. ఇటువంటి పనిలోకి వచ్చిన స్త్రీ తాను చైతన్యాన్ని పెంచుకొంటూ, తన యింట్లో పురుషుల చైతన్యాన్ని పెంచుతూ-పురుషుడిలో కలసి సమాజం కల్పించే అవకాశాలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని వాడుకొంటూ క్రమంగా "ఇంటి చాకిరి" అనే బానిస సంకెళ్ళనుండి విముక్తి చెందుతుంది. తన సృజన శక్తులను సంపూర్ణంగా సామాజికోపయోగ కార్యకలాపాలలో వినియోగించే దశకు చేరుకొంటుంది. పురుషుడితో కలిసి పనిచెయ్యటం అనే ఈ దశలో స్త్రీ పురుష ప్రయోజనాల మధ్య వైరుధ్యం నశిస్తుంది.[23] ఇక్కడ పురుషుడు "పని" అనే అంశం కేవలం తనదే అనుకోడు. స్త్రీ తాను పురుషుడి కోసమే వున్నాననీ అనుకోదు. ఇద్దరూ కలిసి జీవితాన్ని ఎదుర్కొంటారు. పనిచేసి బ్రతికే స్త్రీ పురుషు లిద్దరిమీద జరుగుతున్న పీడనకు, దోపిడీకి వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్మించుకొంటూ విముక్తిపథంలో ముందుకు సాగుతారు.[24] ఈ విధమైన ఉద్యమాలు, ఈ ఉద్యమ ప్రయోజనాలను నెరవేర్చే సాహిత్యమూ ఈనాడు మరింత అభివృద్ధి చెందాల్సివుంది.

## పాద సూచికలు :-

1. "తన కడుపులో నుండి తన్ను బోలిన రూపాల్ని వుత్పత్తి చేయగలిగిన స్త్రీలు భూమినుండి జరిగే వుత్పత్తిని పురుషులకంటే

ముందే గ్రహించారు" అనటం గమనించతగ్గది. చూడు : కె. ఐలయ్య - భారతదేశంలో స్త్రీలు - ఒక చారిత్రక పరిశీలన (వ్యాసం), ప్రజాసాహితి, ఫిబ్రవరి 1984, పు:72.

2. గార్డన్ చైల్డ్ - చరిత్రలో ఏం జరిగింది (అను: వల్లంపాటి వెంకటసుబ్బయ్య, హైదరాబాదు బుక్ ట్రస్టు ప్రచురణ, జనవరి 1985) పు: 27, 32, 34.

3. పైదే, పు: 49.

4. విజ్ఞాన సర్వస్వం (6వ భాగం) తెలుగు భాషాసమితి (1961) పు: 177.

5. మానవజాతి పరిణామక్రమంలో ఆదిమదశలలో అభివృద్ధికి పట్టిన కాలం సుదీర్ఘమయింది. చూడు: కంభంపాటి సత్యనారాయణ - ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1 (అను: మహీధర రామమోహన రావు) హైదరాబాదు బుక్ ట్రస్టు ప్రచురణ, జులై 1981) పు: 2

5. పాపినేని శివశంకర్-ఋగ్వేదకాలంలో స్త్రీ, ప్రజాసాహితి, ఏప్రిల్ 1984, పు: 60, 61.

7. రాహుల్ సాంకృత్యాయన్-ఋగ్వేద ఆర్యులు (అను: మిక్కిలినేని సుబ్బారావు (జులై 1974) పు: 102)

8. పైదే, పు: 230

9. పైదే, పు: 237

10. పైదే, పు: 241

11. "వంటనలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథులేతేర నడికిరేయైనఁ బెట్టు
వలయు భోజ్యంబులింట నవ్వారిగాఁగ"

(మనుచరిత్ర, ప్రథమాశ్వాసం 56)

12. "గగనము నీరుబుగ్గ కెనగా జడివట్టిన నాళ్ళు భార్య క
నొవ్వగ సొరకుండ నారికెడపుం బొటియల్దగిలించి వండ న
య్యగపల ముంచి పెట్టుఁ గలమాన్నము నొల్చిన ప్రప్పు నాలుగే
నొవ్వగపిన కూరలు న్వడియముల్వరుగు ల్పెరుగు న్ఘృత ప్లుతిన్"
(ఆముక్తమాల్యద, ప్రథమాశ్వాసము 70)

13. ".... మందిర ముకుందారాధనా తిధి తర్పణంబులు, నేర్పునం బచ రింపుచు, జనయిత్రీ దర్శితంబకు మూలవిత్తంబు నష్టావశిష్టం బగునది గుప్తంబు సేయుచుఁ బశు శిశు దాసీ దాస జనంబులఁ దన వారింగా మెలంగి దలంకువలకుం దొలంగించుచుఁ, బుస్తక భండాగారంబు నిజ భర్తృ హస్తాంతరంబున నాశుశుక్షణి శిధిల బంధన యాచక ప్రముఖోప ద్రవంబుల వలనం గాచి ప్రోచుచు, విగళిత సన్నాహంబగు గేహంబు యథాపూర్వ నిర్వహణ మనోహరంబుగా నను సంధించి, చదువు సంధ్య సాగించి నడపించుచు నిజానుజు దుర్వ్యసనంబు వలన గాసింబొందని రాజానుగ్రహ లబ్ధంబులగు నేక భోగగ్రామంబుల నాత్మాధీనంబులుగా నొనరించుచుఁ దప్పిదారిన మడిమడ్రి చేను చెట్లున్న పట్లరసి తన పట్టులం గాపువెట్టుచు...."
(పాండురంగ మాహత్మ్యము, తృతీయాశ్వాసం 24 వచనం)

14. Kalpana Shah-Women's liberation & voluntary action (1984) P: 39, 40.
నవంబరు 1888 "వివేక వర్ధని"లో ఈ వ్యాసం ప్రచురించబడింది.

15. తెలుగు వచన రచనా పరిచయం (సంపాదకుడు: కేతు విశ్వనాధ రెడ్డి) (ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ప్రచురణ 1984) పు: 43.

16. Kalpana Shah - Women's liberation & voluntary action (1984) P: 48, 49.

17. కొక్కొండ వెంకటరత్నం పంతులు స్త్రీ విద్యను వ్యతిరేకిస్తూ పని చేయటం, విశ్వనాధ సత్యనారాయణ తన సాహిత్యంలో స్త్రీ విద్యకు వ్యతిరేకంగా భావాలను ప్రచారం చేయటం (చూడు

వేయివడగలు [1963] పు: 581, 582) ఈ సందర్భంగా గమనించవచ్చు.

18. Kalpana Shah - Women's liberation & voluntary action, P : 47, 48, 49.

19. "స్త్రీలు ఇంటి పనులు చెయ్యడమూ, పురుషులు బైట పనులు చేయడమూ - అనే శ్రమవిభజనకూడా దోపిడీ సమాజాల శ్రమ విభజనే-"రంగనాయకమ్మ. "చైనాలో ఏం జరుగుతోంది." (చార్లెస్ బెతల్‌హామ్) కి వ్రాసిన ముందుమాట నుండి (1983 అక్టోబరు, జార్జిరెడ్డి పబ్లికేషన్ ట్రస్ట్) పు. 30.

20. స్త్రీల ఇంటి చాకిరి - లెనిన్ (అను : రంగనాయకమ్మ) సృజన, నవంబరు 1979, పు. 35.

21. న్యాయమైన వేతనాలకై పోరాడుతున్న మహిళలు (వార్త) - ఆంధ్రప్రభ (దినపత్రిక) 11 మార్చి 1985. పు. 2. ఈ వార్త నుండి గమనించదగ్గ అంశాలు : "వారు ఫ్యాక్టరీలలో పనిచేస్తారు. తమ చెమటతో పొలాల్ని తడిపి పంటలు పండిస్తారు. ఆస్పత్రులలో అతి కష్టమైన పనులు సైతం చేస్తారు. గృహాల్లో చాకిరి చేస్తారు. విద్యారంగంలో ఉన్నత శిఖరాలను అధిగమించికూడా ఇంటిపట్టునే పడివుంటారు. చిన్నచిన్న కొలువులలో జీతంరాళ్ళు సంపాదిస్తారు. అయినప్పటికీ వృత్తిపరమైన రంగాలలో సమాన జీతం, సమానత కోసం ప్రపంచవ్యాప్తంగా లక్షలాది మహిళా కార్మికులు పోరాటం చేస్తూనే వున్నారు.

అంతర్జాతీయ కార్మికసంస్థ (ఐ.ఎల్.ఓ.) ఇటీవల విడుదల చేసిన వార్షిక నివేదికలో మహిళా కార్మికులు ఎదుర్కొంటున్న ఇటువంటి అనేక సమస్యలను పేర్కొంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉన్న మహిళా కార్మికుల పరిస్థితి మరీ దారుణంగా వుందని ఐ.ఎల్.ఓ. అభిప్రాయపడ్డది."

22. పుచ్చలపల్లి సుందరయ్య - వీరతెలంగాణా విప్లవపోరాటం - గుణపాఠాలు (మే, 1975) పు. 402.

23. పాపినేని శివశంకర్ - స్త్రీ పురుష వైరుధ్యం, అరుణతార, ఏప్రిల్-మే, 1983, పు. 47-55.

24. ఈ అవగాహనతో బొలీవియా దేశంలో మహిళోద్యమాన్ని నడుపుతున్న "దొమితిల బారియోస్‌ది చుంగార" వ్రాసిన 'స్త్రీ సమస్యలు-పరిచయం' (అను. : ఓల్గా, హైదరాబాదు బుక్ ట్రస్టు ప్రచురణ, ఆగస్టు 1984) అనే పుస్తకంలో ఆమె వెలిబుచ్చిన భావాలు ఈ సందర్భంగా గమనించదగ్గవి.

"స్త్రీ పురుషు లిద్దరూ కలిసి ప్రయాణం చెయ్యాలి. దానికి ఒకేరకమైన శిక్షణ కావాలి." (పు. 5, 6)

"మనం పురుషులతో కలిసి పోరాడాలి" (పు. 18) - మొదలైనవి.

(హైదరాబాద్ విశ్వవిద్యాలయ మహిళా సమస్యా పరిశోధనాశాఖ సెమినారు (1985)లో వ్యాసం.)

---

# నవలా సాహిత్యం : వాస్తవ జీవిత దర్పణం

—సి. సుజాత

సమాజం యొక్క చైతన్యరూపం సాహిత్యం. సామాజిక జీవితానికి, వ్యక్తి జీవితానికి మధ్య పరస్పర సంబంధం వుంది. జీవితాన్ని సమాజమూ, సమాజాన్ని జీవితమూ, పరస్పరం ప్రభావితం చేస్తుంటాయి. పరిస్థితులుగానీ, మనిషిగానీ, నిత్యం మార్పులకు గురి అవుతూ వుంటారు. రచయిత్రి కూడా సమాజంలో వ్యక్తి కనుక, ఆమె దృష్టి, విమర్శ అంతా సామాజిక జీవితంలో ఒక భాగం అవుతుంది. తెలుగు నవల పుట్టిన కాలానుగుణంగా ఎన్నో మార్పులు వచ్చాయి. సామాజిక సంబంధాలలో, మనుషుల వ్యవహారాల్లో ముఖ్యంగా స్త్రీల జీవన సరళిలో ఎన్నో పరిణా

మాలు క్రొత్త సమస్యలు వచ్చాయి. వీటిని తెలుగు నవల చక్కగా ప్రతిబింబించింది.

క్లిష్టమయిన జీవిత సమస్యలను విడమరచి చెప్పటంలోనూ, సమాజంలో బాధలకు గురిఅయిన అసహాయుల గాధలు చిత్రించటంలోనూ మన స్తత్వాలు విశ్లేషించటంలోనూ, జీవిత సత్యాలు పొందుపరచటంలోనూ రచయిత్రులు ఎన్నో రకాలయిన ప్రయోగాలు తమ రచనలలో సాధించ లేదు. ఈ సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను, వారిపై జరుగుతున్న అత్యాచారాలను ప్రతిఘటించి నిలబడేలా రచయిత్రులు తమ చైతన్యవంతములైన రచనలద్వారా నడుంకట్టేరు.

మాలతీ చందూర్, వాసిరెడ్డి సీతాదేవి, మాదిరెడ్డి సులోచన, ముప్పాళ రంగనాయకమ్మ, ద్వివేదుల విశాలాక్షి, సి. ఆనందరామం, యద్దనపూడి సులోచనారాణి, పరిమళా సోమేశ్వరర్, కె. రామలక్ష్మి మొదలయిన రచయిత్రులు, వాస్తవ జీవితాన్ని వివిధ స్వభావాలనూ, అస్తవ్యస్తాలనూ తమ రచనలలో ప్రతిబింబింపజేశారు.

స్త్రీలు చదువుకొని, వుద్యోగాలు చేస్తూ సమాజంలో స్వతంత్రంగా జీవించేప్పుడు వచ్చే సమస్యల్ని వుదాహరిస్తూ, మాలతీచందూర్‌గారు ఎన్నో పుస్తకాలు వ్రాశారు. సద్యోగం, అకం, అనురాగం చంపకం చదపురుగులు ఇవన్నీ ఆ సమస్యల ప్రతిబింబాలే. ఒక న్యాయవాది, ఒక వుద్యోగిని, ఒక కళాకారిణి, ఒక నాట్య విశారద, మరొక వుపాధ్యాయిని ఆమె నవలల్లో ప్రాణంపోసుకొన్న పాత్రలు. "రేణుకాదేవి ఆత్మకథ"లో ఆత్మీయతకోసం తలమటించిపోయిన, నటి రేణుకాదేవి. 'ఎన్ని మెట్లెక్కినా' తో, వ్యక్తిగత జీవితంలో, సుఖంలేని, ఒక సుప్రసిద్ధ పత్రికా రచయిత "జీవితం అంటే చదువు, సంపదలు, వున్నత పదవులేకాదు, ప్రేమా-పరస్పర విశ్వాసంలాటి లోతైన భావాలు, వున్నాయని" నిరూపించిన "స్టేట్ బేంక్ సీనియర్ ఆఫీసర్, "మహి" "ఏమిటీ జీవితాల్లో" నాట్యమే ప్రాణంగా బ్రతికిన సురేఖ, ఆ కళాకారిణి జీవితంతో జరిగే అతి మామూలు సంఘటనలు,

ఆమె ఆలోచనలు, భావోద్రేకాలు ఇవన్నీ మన కళ్ళముందు సజీవంగా సాక్షాత్కరిస్తాయి.

లత సాహిత్యం పేరిట ఒక ప్రత్యేకత సంతరించుకొన్నవారు శ్రీమతి తెన్నేటి హేమలత, తమ చుట్టు అల్లుకొన్న ఛాందస భావాల చిక్కు ముడులు, సాంప్రదాయాలు ఛేధించుకొనేందుకు నేటి స్త్రీలు సాగిస్తున్న నిరంతర సమరాన్ని తమ నవలలలో ప్రతిబింబింపజేశారు. ఎడారి పువ్వులు, మహానగరంలో స్త్రీ, ప్రేమ రాహిత్యంలో స్త్రీ, ఇవన్నీ స్త్రీల సమస్యల గురించిన పుస్తకాలే. ఆమె అంతరంగ చిత్రం, ఒక అందమైన స్వప్నం. ఆమె వూహించే సమాజమూ ఒక స్వప్నం మాత్రమే. వివాహం పేరిట స్త్రీకి జరుగుతున్న అన్యాయాలకు అసంతృప్తి ప్రకటించేరు. లత కాన్నీ, ఏ నవలలోనైనా, స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాన్ని అనుసరించిన వ్యక్తులకు ఆత్మహత్యే శరణ్యం అయింది.

"స్త్రీల సమస్యలు, స్త్రీల జీవితాలకు పరిమితంకాదు, అవి పురుష జీవితాలకు సంబంధంలేని విషయాలు కావు. స్త్రీల సమస్యలమీద స్త్రీకి సరి అయిన విజ్ఞానం ఎంత అవసరమో, పురుషులకుకూడా అంతే అవసరం".

సంఘం ఎప్పుడూ సణిగే ముసలమ్మ లాటిది యవ్వనము, సౌందర్యము, వుత్సాహము వున్నదశ, సమాజానికి ఎప్పుడూ లేదు. అది పుట్టినప్పుడే ముసలమ్మగా పుట్టింది".

అంటు రంగనాయకమ్మగారు తమ రచనల్లో ఒక కొత్త విప్లవం సాధించేరు. ఆమె వ్రాసిన బలిపీఠం, చదువుకొన్న కమల పేకమేడలు, అంధకారంలో ఉన్న స్త్రీల దౌర్భాగ్యాలకు మచ్చుతునకలు. "ఆడది వంటరిగా జీవించే తాహతుకి మన సమాజం ఎదగలేదు. మనం అంత పురోగమించలేదు అంటూ వాపోయారు పేకమేడలు నవలలో. మనుష్యులు వూరికే ఆలోచించి, మానవతుల కథలు చదివి, పశ్చాత్తాపాలు పొంది, వెంటనే మారతారని, ఎదుగుతారని అనుకోవటం శాస్త్రీయ దృక్పథం కాదు. మనిషి నవ్వుకి, నిట్టూర్పుకి బాధ్యత సంఘానిదే అన్నారు రచయిత్రి

"అంధకారంలో" అనే నవలలో స్త్రీలలో రావలసినంత చైతన్యం రాలేదనీ, దుఃఖపడుతూ, తన అపూర్వమయిన వూహతో కొన్ని వూహిస్తూ, అలాటి చైతన్యం రావాలని కోరుకొంటూ మనసారా తపించి వ్రాసిన నవల దానికి విముక్తి.

సమాజంలో స్త్రీ స్థానం బానిసకన్నా అధమం. భార్య భర్త సంబంధం కుటుంబ జీవితం వేరు. గృహ నిర్వహణ, పిల్లల పెంపకం సామాజిక శ్రమగా పరిగణించలేకపోవటం వలన వచ్చిన కష్టం మొదటిది.

స్త్రీలకు స్వతంత్ర జీవితం ఒకటి వుందని ప్రపంచం ఎరుగదు. ఇప్పుడు అట్టి జ్ఞానం సిద్ధంగా వుంది. దానిని తెలుసుకోకపోతే ఆడవాళ్ళకు ఎప్పటికి విముక్తి వుండదు. వాళ్ళ సమస్యల కారణాలు వాళ్ళే అర్థంచేసుకోలేకపోతే వాళ్ళని వాళ్ళు ఎలా విముక్తి చెసుకోగలుగుతారు" అంటారు రంగనాయకమ్మగారు జానకి విముక్తిలో ఒకచోట.

ఆడవాళ్ళ సమస్యలు ప్రధానంగా మూడు. ఆడవాళ్ళు స్వతంత్రంగా తమని తాము పోషించుకొనే స్థితిలో లేరు. మొగవాళ్ళ సంపాదనమీదే బ్రతుకుతున్నారు. ఆడవాళ్ళ శ్రమ ఇంటిపనులకే పరిమితం. మూడవది పిల్లల పెంపకం ఒక బాధ్యత. ఒక శ్రమ. దీనికి ఆమె ఒక కమ్యూనిష్టు పరిష్కారం ఒకటి చెప్పేరు. ఆడవాళ్ళకు స్వతంత్ర సంపాదన ఉండటం, పిల్లల పెంపకంలో తండ్రికి సమాన బాధ్యత వుండటం.

కానీ గృహ జీవితంలో, శ్రమ విభజన సమస్య కుటుంబంలోనిది. అందువల్ల ఇంటిపనులలో భర్త సాయంచేయటం అన్నది, నేడు ఎన్ని కుటుంబాలలో వున్నది? అందువల్ల స్త్రీకి స్వాతంత్ర్యం రాదు.

నవల మూడవభాగంలో రంగనాయకమ్మగారు, తన దృష్టిలో, ఆదర్శ దాంపత్యం ఎలావుండాలో చిత్రించే ప్రయత్నం చేశారు. మూడవ భాగంలోనూ ఆ నవల పూర్తి కాలేదన్నారు. స్త్రీని విముక్తి చేయగల సమాజం మనకు ఏర్పడినప్పుడు స్త్రీ విముక్తి కథా వస్తువుగా తీసుకొని

ఆ కథ పూర్తి అయిందని చెప్పటం సాధ్యంకాదు. విముక్తి ఇచ్చే గమ్యం వేపు మొదటి అడుగువేయటం విముక్తితో సమానమే నన్నాడు.

కానీ, మన సిద్ధాంతాలు అమలుజరుపవలసినది మనం వుంటున్న సమాజంలో అది మరువకూడదు. ప్రేమ ప్రాతిపదికనే అంగీకరించని ఈ సమాజంలో, ఆడదాన్ని కనబడని శృంఖలాలతో బానిసగా బంధించిన, ఈ సమాజంలో మనం వున్నపాటున, మన సిద్ధాంతాలకు అమలుజరుప పూనుకొంటె ఫలితం ఎలా వుంటుంది. ఇప్పుడు వున్న సంసారాలలో నూటికి తొంభై విచ్ఛిన్నం అవుతాయి. కొన్ని కొన్ని సందర్భాలలో స్త్రీతే తను అర్థంలేని అహంతో, సంసార జీవితాల్ని, చికాకు పరుచుకొని, చివరకు పశ్చాత్తాపం జరుగుతుంది. వ్యక్తి సుఖజీవి—నికి, సాంఘిక సంక్షేమానికి, కుటుంబమే మూలాధారం.

సమాజంలో వ్యక్తులు పొందుతున్న బాధలకు, చికాకులకు కారణం, మన చుట్టువున్న వ్యక్తులలో వున్న దుర్మార్గం దురలవాట్లు కానేకాదు. సమాజంలో వున్న అవ్యవస్థ దానికి మూలం సమాజం మారితేతప్ప వ్యక్తులలో వున్న మంచితనం మానవుని జీవితాల్ని సుఖవంతం చేయ లేవు.

యువతీ యువకుల మనస్తత్వాలను వారి జీవన సరళిలో వున్న వికృత కోణాలను చూపే వాసిరెడ్డి సీతాదేవి గారి రచనల్లో మరీ ఒక చక్కని నవల యవ్వనంలో వున్న ఆడపిల్ల, సరి అయిన పెంపకం లేక పోతే నాగరికతా ప్రభావానికి లోనై ఎలాటి దుస్థితికి దిగజారిపోతుందో చక్కగా వర్ణించేరు. మమతానురాగాలకు నేటి సమాజంలో నున్న స్థానాన్ని ఎత్తిచూపిస్తు, మట్టిమనిషి నవల వ్రాశారు. మనుష్యుల స్థాయి పెరిగిన కొద్దీ అంటే మనుష్యుల ఆస్థి, ఆ పునాదిమీద ఏర్పడ్డ సామాజిక హోదా అని అర్థం చెప్పేరంటే వాళ్ళ మధ్య వుండవలసిన నిజమైన సంబంధాలు తెగి పోయి, వ్యాపారదృష్టి పనిచేస్తూ వుంటుంది. తల్లి, తండ్రి, అన్నె ఎవరైనాసరే వ్యాపారానికే వాడుకుందామనిపిస్తుంది. మట్టిమనిషి నవల ఒక సజీవ వాస్తవ జీవిత ప్రతిబింబం. ఆమె వ్రాసిన, విషకన్య ఒక

మహావైజ్ఞానిక నవల. రాజకీయాల గురించి నవలలు వ్రాసినా, రాజకీయాల గురించికాక, రాజకీయ నాయకుల పూర్తి గత జీవితాల గురించి వ్రాశారామె.

శ్రీమతి మాదిరెడ్డి సులోచన దాదాపు అన్ని సమస్యలమీద నవలలు వ్రాశారు. తరంమారింది, మనిషి-మతము, మిస్టర్ సంపత్, అధికారులు ఆశ్రితజనులు ఇవన్నీ వివిధ సామాజిక సమస్యలకు ఇతివృత్తాలుగా చేసుకొని వ్రాసిన నవలలే. తన ప్రత్యేకమైన శైలిలో, సామాజిక శ్రేయస్సే ధ్యేయంగా రచనలు చేసిన, మాదిరెడ్డి సులోచనగారి, ప్రతి రచన, నేటి సమాజాన్ని పట్టిపీడిస్తున్న రుగ్మతలకు ఒక్కొక్క చురక. సమాజానికి ఒక మేలుకొలుపు. ఒక హెచ్చరిక.

తెలుగుదేశంలో ఆర్థిక స్థితిగతులు, మధ్యతరగతి జీవితాలు గురించి, వారి విద్యా గౌరవాలను గురించి వ్రాసిన, నవలా రచయిత్రులలో, ద్వివేదుల విశాలాక్షి, కె. రామలక్ష్మి సుప్రసిద్ధులు.

మధ్యతరగతి జీవితానందాల్ని వారి ప్రేమానురాగాలకు తమ రచనలలో అందంగా చిత్రించేరు శ్రీమతి విశాలాక్షి. గ్రహణం విడిచింది, వారధి, జారుడుమెట్లు, రేపటి వెలుగు ఇవన్నీ ఆమె ప్రసిద్ధ నవలలే.

కడుపుతీపి, రాముడు, కోటిగాడు, వరుణ కథ, ప్రేమించు ప్రేమకై మొదలయినవన్నీ రామలక్ష్మిగారి నవలలు. జీవితాన్ని అంటిపెట్టుకొని వుంటుంది సాహిత్యం. అందువల్లే, జీవితం ఎన్ని మలుపులు తిరిగితే, దాన్ని అంటిపెట్టుకొనివుండే సాహిత్యం అన్ని మలుపులూ తిరుగుతుందని తమ నవలలో ఆ మలుపుల మెరుపుల్ని చిత్రించేరు కె. రామలక్ష్మిగారు.

ఇదే సమయంలో యద్దనపూడి సులోచనారాణిగారు ప్రేమ కథల్లో అందానికి ప్రాముఖ్యం ఇస్తూ, అందమైన ఆరడుగుల కథానాయకుడు, సున్నితమైన మనస్తత్వం కలిగిన, చక్కని కథానాయిక, వారి ప్రేమానురాగాలు, కోపతాపాలు, అపార్థాలు, కలతలు వీటన్నిటితో యువతను వుర్రూతలూగించే ప్రేమ సాహిత్యానికి పునాదులు వేశారు. ప్రేమ కథల్లో

అందానికే ఎందుకు ప్రాముఖ్యత వుండాలి అంటే అందాన్ని చూచి ప్రేమించటం సహజం. అది జీవిత వాస్తవం. పాఠకులులేని సాహిత్యం అంటూ వుండదు. ఏ రచయిత అయినా, పాఠకులను నమ్మించటానికి ప్రయత్నం చేస్తారు. ప్రేమ కథల్లో అందం అనేది ఒక శిల్పం. ఇది స్పష్టంగా కనిపించే విషయం. అందమంటే అందరికీ అభిమానమే కదా. అందువల్ల అందమైన పాత్రలపట్ల పాఠకుడికి సులభంగా సానుభూతి ఏర్పడుతుంది. అలాటి సానుభూతి వున్నప్పుడు, పాఠకుడు పాత్రలలో లీనమై వాటి కష్టసుఖాలను, రాగద్వేషాలను స్వయంగా అనుభవించినట్లు అనుభూతి చెందుతాడు. సాహిత్యాన్ని హృదయంతో చదవటం అంటే అదే. సులోచనారాణిగారి పాత్రలు అందరు అందమైనవాళ్ళే. సెక్రటరీ, జీవనతరంగాలు, విజేత, ప్రేమసింహాసనం, హృదయగానం, మధురస్వప్నం, ఒకటేమిటి అన్ని నవలలోనూ ఆడపిల్ల మనసుని, అత్యుత్తమంగా, అత్యంత సంస్కారంగా, అతి సున్నితంగా చిత్రించటంలోనూ తనకు తానే సాటి అనిపించుకున్నారు. ఆ వరవడిలో, ఆమెను అనుసరిస్తూ అనుకరిస్తూ, చాలమంది రచయిత్రులు ప్రేమ నవలలకు శ్రీకారం చుట్టేరు.

అవినీతి అంతటా పరుచుకొని వుంది. తాము చేస్తున్నది అవినీతి అనే ఆలోచనకూడా రాకుండ, అవినీతి కార్యాలకు అలవాటుపడిపోయారు. కానీ, ఈ అవినీతికి బలయిపోతున్న దెవరు ? అంటూ సమాజాన్ని గురించిన ఆవేదనతో చక్కని రచనలు చేశారు సి. ఆనందారాయలగారు ఆమె, ఆత్మబలి, మనసు చూపిన బాట, దోషులెవరు? ఇవన్నీ మరేకాలంతోపాటు, మారలేని మనుష్యులు, సంసారాల్లో వచ్చిన ఒడిదుడుకుల గురించిన గాధలే. నేటి సమాజంలో నాగరికత పేరిట జరుగుతున్న ఘోరాలను కళ్ళకు కట్టినట్లు చిత్రించిన మరో నవల "వురిమే మబ్బులు".

ఆధునిక యువతరం, ఆలోచనలు, వారి పరిస్థితులకు అద్దంచూపుతూ వచ్చిన మొట్టమొదటి నవల డాక్టర్ పి. శ్రీదేవిగారి కాలాతీతవ్యక్తులు. ఆమె వ్రాసినది ఒక్క నవలే అయినా, రెండు దశాబ్దాల క్రితమే ఈనాటి జీవన వేగాన్ని తమ నవలతో చూపేరు శ్రీదేవి. కలతలు, కుళ్ళువున్నా, ఎప్పుడు నవ్విస్తూ, నవ్వుతు తిరిగే, గలగలపారే గోదావరిలాటి ఇందిరా,

అనురాగభరితంగా జీవితాన్ని గడపాలనుకొనే కల్యాణి, వారిద్దరి మధ్య, దారి తప్పిన ప్రకాశం. ఇలా ప్రతి పాత్ర ఒక సజీవ జీవిత చిత్రం. కాలతీత వ్యక్తులు నవలా సాంప్రదాయ భీరుత్వాన్ని ఎదిరించిన, చిన్ని ఓ కొత్త ప్రపంచం. ఆ నవలోకంలో ప్రేమ, బాధ, సంతోషం, అన్నిటి కంటే ఎక్కువగా నిజమైన జీవితం ఏమిటో తెలిపే భావన వుంది. "తెల్లా రేక మన సమస్యలు ప్రారంభం అవుతాయన్నమాట" అంటాడు కృష్ణ మూర్తి నవల చివరలో. దానికి జవాబుగా ఇందిర, బ్రతికున్న ప్రతి మనిషికి సమస్యలు వుంటాయి. సమస్యలు తేలక చనిపోయిన వాళ్ళకు మాత్రమే నీ ఆయుర్దాయం ఎన్నేళ్ళు?.... నీ జీవితకాలంలో సుఖంగా బ్రతుకు, నిండుగా బ్రతుకు రోజుకు పదిసార్లు చావకు.... మనచుట్టు స్వార్థం, రోషం, కక్ష భయం,... ఇవి మనలోనూ వున్నాయి. కాబట్టి వాటికి భయ పడకు. సర్వత్రా వ్యాపించివున్న వాటిని గురించి, భయమెందుకు? ఆశలు, స్వప్నాలు, అనురాగాలు, అభిమానాలు అన్నీ పెంచుకో. మనస్సు తేలిగ్గా వుంటుంది..." అంటుంది స్వేచ్ఛగా ఉదయాకాశంలో ఎగిరే పావురంలాటి ఇందిర.

మనుష్యులలో నేడున్నంత స్వార్థం గతంలో ఏనాడూలేదు. ప్రతి మనిషి ఎదుటి మనిషిని ఎరగానే వాడుకోవాలనుకొంటాడు. ఈ స్వార్థం మంటల్లో స్నేహం, బాంధవ్యం, బంధుత్వం అన్నీ సమిధులుగానే వుపయోగపడతాయి. ఇది నేటి జీవన నగ్నసత్యం. ఆ ఆలోచనలే, తన రచనలలో ఇమిడ్చేరు బీనాదేవి, హరిశ్చంద్రమతి, ఇల్లుకట్టి చూడు, హెంగ్‌మిక్వెక్, ఇలాటి ఎన్నో రచనలు జీవితంలోని కష్టసుఖాల సంగమం. కానీ, కష్టాలు, సుఖం ముసుగువేసుకొని వుంటాయి, అందుకే, సామాన్యుడికి సుఖాలు ఎండమావుల్లాగా, కష్టాలు ఒయాసిస్సుల్లాగా కన బడుతాయి. అదే మధ్య తరగతి జీవితంలోని విశేషం. అలాటి బ్రతు కుల గురించి వ్రాశారు బీనాదేవి.

మధ్యతరగతి జీవితాల గురించి వ్రాసినవారిలో ఏవని నిర్మల ప్రభావతిగారు ఒకరు. జబ్బు మనిషిని బాధిస్తే డబ్బు జబ్బు ఎదుటి మనిషిని బాధిస్తుందంటూ, డబ్బు తెచ్చిన జబ్బులు, వయసు వేడి, కోరికల

వాడే కాదు జీవితానికి, ప్రతి బ్రతుక్కి మరోవేపు, మరో ఛాయ వున్నాయి, అదే వృద్ధాప్యం. ఆ దశలో, మనిషి జీవితాన్ని, మారే జీవిత విలువల్ని, ఆమలపొద్దుల్లోకి మసక చీకట్లోని కాంతిరేఖలను గురించి, ఈ జీవితసంధ్యా సమయంలో... నవలా నాయకుడిలాటి నాయకుడు కావాలని పడుగులు తీస్తే, జీవితం ఏదరికి చేరుతుందో చెపుతూ, జరుగుతున్న కథ, ఇలా ఎన్నో నవలలు వ్రాశారు.

ప్రతి ఒక్కరూ, పసిపాపలా హాయిగా, స్వేచ్ఛగా, నిష్కపటంగా నవ్వగలగాలి, ఆ నవ్వు మానవుని మానసికంగా శారీరకంగా, ఆరోగ్యవంతుణ్ణి చేస్తుందనీ, కేవలం హాస్యానికే ప్రాముఖ్యం ఇస్తూ, రచనలు చేసినవారు శ్రీమతి భానుమతి రామకృష్ణ.

మన సమాజంలో, జీవనోపాదికోసం, మామూలు ఉద్యోగాలు చేసేవారు కవులు, గాయకులు, ఎంతమంది వున్నారు. మనిషి బ్రతికేందుకు చేసే పోరాటాలు, చక్కగా చిత్రించేరు, వున్నవ విజయలక్ష్మి.

కన్నడ రచయిత్రులు త్రివేణి, శివశంకరి, కల్యాణి మొదలైనవారి రచనలు, శ్రీమతి మాలతీచందూర్, చక్కని తెలుగులో అనువాదాలు చేశారు. త్రివేణి రచనలలో చెప్పుకోదగినవి కీలుబొమ్మ, శరపంజర, పునకంగారి ఓ మనిషి కథ, (మాలతీచందూర్ అనువాదం) ప్రసిద్ధికెక్కిన నవలలు ఓ మనిషి కథలో, త్రాగుడు మనిషిని ఎలా దిగజారుస్తుందో, అతని ఎలా మార్చవచ్చో చక్కగా వ్రాసేరు. అడ్డదిడ్డమయిన తమ కుటుంబ పరిస్థితులు దిద్దుకోవాలనుకొనే గృహిణులు ముఖ్యంగా ఈ అలవాటున్న స్త్రీ పురుషులు తప్పక చదివితీరవలసిన నవల ఇది.

ఏ మానవుడి జీవితమూ, సకల సౌభాగ్యాలతో వర్ధిల్లదు. ఏదో ఒక లోపం వుండే వుంటుంది. సామాన్యుడు ఆ లోపాన్ని దృష్టిలో వుంచుకొని జీవితాన్ని తల్లక్రిందులు చేసుకొంటాడు. అందువల్లే, మానవుని జీవితం ప్రతిబింబించే ఏ నవల అయినా అందరూ ఆనందించగలుగుతారు.

కాని, అవాస్తవిక జీవిత చిత్రణ, అర్థంలేని త్యాగాలు, అను

మానాలు, అపార్థాలు, ఎంతమంది రచయిత్రులు తమ రచనలలో ప్రయోగాలు చేస్తున్నారు?

మానవాళి, పరిణామక్రమంలో, ప్రకృతినుంచి, ఎన్నో కష్టనష్టాలకు గురి అవుతూ తమతమ జీవన పోరాటాల్లో ఆరితేరుతూ, ప్రకృతిని తమకు అనుకూలంగా మలుచుకొంటూ ఈనాటివరకు సాగివచ్చింది. ఈనాడు మనకు భౌతిక, రసాయనిక, సాంకేతిక శాస్త్రాలు అనేకం వున్నాయి. విజ్ఞానం మానవుణ్ణి మహోన్నత వీధుల్లో విహరింపజేస్తుంటే మత మౌఢ్యం అతన్ని పాతాళానికి దిగలాగుతుంది. మన పల్లెల్లో ఈనాటికి ఎన్ని సనాతన ఆచారాలు, మొక్కుబడులు నమ్మకాలు వున్నాయి? ఈనాడు మూఢాచారాలు అనుకొనేవాటినే, అమానుషమనుకొనే వర్గ, వర్గ కులాది హెచ్చుతగ్గుతే, జీవనగతిలో, అవసరానుగుణంగా తెచ్చుకొన్నాం, ఆయాకాలాల్లో, ఆ సామాజికమైన హెచ్చుతగ్గులే మానవజాతి పురోభివృద్ధికి సాయపడ్డాయి. దానిమీద నిలబడి మనిషి ముందడుగు వేశాడు. ఇప్పుడే మనం, ఆ మెట్టును అధిగమించాలి. విజ్ఞానశాస్త్ర సహాయంతో ముందడుగువేసే అవకాశం అతనికి ఇప్పుడు లభించింది. కానీ, సమకాలీన నవలలు కొన్నిట్లో మనకు, పాత ఆచారాలు, అలవాట్లు, నమ్మకాలు, క్షుద్రదేవతలు, నరబలులు, ప్రేతాత్మలు, ఇలాటివి చోటుచేసుకొంటున్నాయి.

స్త్రీని చైతన్యవంతం చేయవలసిన రచయిత్రులు, బాధ్యతారహితంగా, అర్థంలేని త్యాగాలు, వాటిని గొప్పగా కీర్తించటం, వాటికోసం ఆత్మార్పణ చేసుకోవటం వీటిని, ఒకభర్త, ఇరువురు భార్యలు, ఒక భార్య, ఇరువురు భర్తలు పైమన్రాతిపదిక మీద మొదలై, సాగె విపరీత సస్పెన్సు, థ్రిల్, భీభత్సం, రక్తపాతం, ఇలాటివాటితో పాఠకులను, వుక్కిరిబిక్కిరి చేసే నవలలు వస్తున్నాయి. వాటిని పాఠకులు ఆదరిస్తున్నారు. పత్రికాలోకం నీరాజనాలు పలుకుతోంది. ఇది నిజంగా విచారించవలసిన విషయం. రచయిత తను చెప్పదలుచుకున్న విషయం కాక, పాఠకులకు ఏం కావాలో వ్రాసే దుర్దశలోకి దిగిపోయాడు. భయానకం, భీభత్సం అలాంటి దారుణమైన జబ్బులతో మన సాహిత్య సరస్వతి

రోగభూషిష్టమయిపోయె ప్రమాదం వస్తోంది. దీనికి పరిష్కారం ఆలోచించవలసింది రచయిత్రులు. ప్రచురణ కర్తలు పత్రిక సంపాదకులే.

ప్రతి రచయితా, ఏదో చెప్పదలచుకొనే, కలం చేపడతారు. ఏ పాఠకుడినయిన మెప్పించటం, సులభమే కావచ్చునేమో గాని మనసుకి సంతృప్తి నివ్వదలచి, హృదయంమీద గాఢమైన ముద్ర వేయగల రచన చేయటం చాలా కష్టమైన పని. ఒక కుటుంబ రచన చదివి పాఠకుడికి ఆనందరసానుభూతి కలగాలి. అటువంటి రచనలే రచయిత్రులు వ్రాసేందుకు ప్రయత్నించాలి.

---

## నివేదిక :

# మహిళాభ్యుదయ సంస్థ

# (Institute for Advancement of Women)

స్త్రీ జనాభ్యుదయానికి దోహదం చేస్తున్న ఈ సంస్థ 28-6-80 న స్థాపింపబడినది; రిజిష్టరు కాబడింది. దీని ప్రధాన కార్యాలయం హైదరాబాద్‌లో వుంటున్నది. దీని కార్యరంగం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రాంతము. ఈ సంస్థ స్త్రీల అభ్యుదయానికి కృషి చేసే కార్యక్రమాలను; స్త్రీల విముక్తిని, వారి సమస్యలను పరిష్కరించే పథకాల నిర్వహిస్తోంది.

ఈ సంస్థ ఆదర్శాలు, లక్ష్యాలు :—

అనేక వృత్తులలో జీవనోపాధి సాగించే స్త్రీల సామాజిక, ఆర్థిక పరిస్థితులను సర్వేచేయుట; చర్చలు, అభిప్రాయ వేదికలు, అధ్యయన శిబిరాలు, ఉపన్యాసాలద్వారా మహిళా ప్రబోధం చేయుట; స్త్రీలను సంఘ సేవికలనుగా తీర్చిదిద్దుట; స్త్రీల స్థితి మెరుగుపరచుట, అభివృద్ధి చేయుట, సంఘంలో స్త్రీయొక్క స్థానాన్ని, హోదాను పెంపొందించుట; స్త్రీల

సమస్యలపై పరిశీలన చేయుట ; నివేదికలను సమర్పించుట ; హక్కుల సాధనలో కష్టనష్టాలకు గురి అయిన స్త్రీలను ఆదుకొనుట ; వారికి ఆశ్రయం కల్పించుట ; స్త్రీల శ్రేయస్సుకోసం, సంక్షేమంకోసం చేయ దగు సర్వతోముఖ కృషిచేయుట ఈ సంస్థ ముఖ్యోద్దేశాలు.

## సంస్థ నిర్మాణం :—

ప్రస్తుతం ఈ సంస్థకు 5గురు పోషకులు, 29 మంది జీవిత సభ్యులు, 90 మంది సాధారణ సభ్యులు ఉన్నారు. మహిళాభ్యుదయాన్ని కాంక్షించి, కృషిచేయ పూనిన స్త్రీ పురుషులు దీనిలో సభ్యులు కాగల అర్హత కలవారు.

## సంస్థ కార్యక్రమాలు :—

సంస్థ పెక్కుతెఱగుల కార్యక్రమాలను చేపట్టింది. స్త్రీ జాతిలో చైతన్యం కల్గించటం సంస్థ ప్రప్రథమ ధ్యేయం. మహిళలపట్ల జరిగే అన్యాయాలను, అక్రమాలను ఎదిరించటం, వారిపై జరుగుతున్న అత్యాచారాలను ఖండించి నిరశించటం, మహిళల పరిస్థితి మెరుగుపడటానికై ప్రభుత్వాలు తీసుకునే చర్యలపై తెచ్చే బిల్లులపై అభిప్రాయాలు వెలువరించటం, మహిళల సమస్యలపై పరిశోధనలు చేసేవారు పాల్గొనే సెమినార్లను నిర్వహించడం, ఉపన్యాసాలను ఏర్పరచడం ఇలా ఎన్నో కార్యక్రమాలను సంస్థ నిర్వహించింది.

భారత సామాజిక శాస్త్రపరిశోధనా సంస్థ దక్షిణప్రాంత కేంద్రం, ఉస్మానియా విశ్వవిద్యాలయ రాజకీయ, సామాజిక శాస్త్ర, మానసిక శాస్త్ర విభాగాలు, వయోజన విద్యాకేంద్రం మొదలగు సంస్థల సహకారంతో 1981 ఏప్రిల్‌లో మహిళాభ్యుదయ సంస్థ "స్త్రీల హోదా" అనే అంశంపై సెమినారును నిర్వహించింది. ఉస్మానియా, కాకతీయ విశ్వవిద్యాలయాల అధ్యాపకులు, పరిశోధన చేసే విద్యార్థులు, న్యాయవాదులు, న్యాయమూర్తులు, సంఘసేవికలు, మహిళోద్యమ కార్యకర్తలు ఆసక్తితో పాల్గొన్నారు. సెమినారులో సమర్పింపబడిన వ్యాసాలను సంస్థ పుస్తకరూపంలో ప్రకటించింది. "మహిళలు : ఉద్యోగాలు" అనే

పేరుతో 1985 మార్చిలో మరొక సెమినారు నిర్వహణ జరిగింది. ఇందులో 45 మంది స్త్రీ పురుషులు పాల్గొన్నారు. అధ్యాపకులు, సంఘ సేవకులు, పత్రికా రచయితలు, మహిళా సంక్షేమ కార్యకర్తలు, పండితులు, న్యాయవాదులు పాల్గొన్నారు. స్త్రీల ఉద్యోగాలకు సంబంధించిన అనేక అంశాలపై వ్యాసాలు నివేదించబడినాయి. చర్చలు నిశితంగా, గాఢంగా సాగాయి. ఆ వ్యాసాలను ఈ సంస్థ పుస్తకరూపంగా ప్రచురించింది. "స్త్రీలకు భద్రతలేని సమాజం"పై 1980 ఆగస్టులో, "మహాత్మా గాంధీ"పై 1980 సెప్టెంబరులో, "పార్లమెంటు ప్రజలు"పై 1984 ఏప్రిల్‌లో అభిప్రాయ వేదికలను నిర్వహించింది.

హైదరాబాద్‌లో 1981 లో మతకల్లోలాలు సంభవించిన సందర్భంగా ఇంగ్లీషు, హిందీ, తెలుగు, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ భాషల రచయితల సమావేశాన్ని జరిపింది. మతకలహాల నివారణకు చేపట్టదగు చర్యలను వారు చర్చించారు.

1981 లో మతకలహాల సందర్భంగా పాతనగరపు ప్రజల మనోభావాలు, అభిప్రాయాలు, ఆలోచనారీతులు ఎలాగున్నాయో తెలిసికునే నిమిత్తం సంస్థ స్త్రీ పురుషులతోకూడి, బృందంద్వారా సర్వే చేసింది. ఆ సర్వే నివేదిక 16 పేజీలను పత్రికలకు, ప్రజలకు ప్రెస్సు కాన్ఫరెన్సులో అందజేసింది.

హిందూ వారసత్వ శాసనానికి ఆం. ప్ర. రాష్ట్ర ప్రభుత్వం తెచ్చిన సవరణ బిల్లు సందర్భంగా నియమింపబడిన జాయింటు సెలక్టు ముందు సంస్థ సాక్ష్యం ఇచ్చింది. హిందూ వివాహ శాసనానికి సవరణ పార్లమెంటులో ప్రతిపాదింపబడితే జాయింటు సెలెక్టు కమిటీని నియమించారు. ఆ కమిటీ హైదరాబాద్ వచ్చినప్పుడు సంస్థ తరఫున అధ్యక్షులు, మల్లాది సుబ్బమ్మ సాక్ష్యం చెప్పారు. వివాహ రథం కుంటుపడిందనే నిర్ణయానికి కోర్టు వస్తే విడాకులు ఇవ్వాలని ఆమె సూచించడం జరిగింది.

1985 ఏప్రిల్‌లో జరిగిన ప్రముఖ సంఘసేవికల సన్మానంలో సంస్థ

ప్రధానపాత్ర వహించింది. "భారతనారి ఆదర్శం" అనే గ్రంథాన్ని రచించిన ఎం. ఎన్. రాయ్ జన్మదినోత్సవం జరుపుకుంది.

సరోజినీనాయుడు, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, వి. ఆర్. నార్ల, ఎ.బి.షా. మహిళోద్యమానికి ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని, బలాన్ని చేకూర్చిన పెద్దలు. వారి స్మృతిని పదిలపరుచుకోవటం ఉద్యమ కార్యకర్తల అవశ్య కర్తవ్యం. వారి స్మారక సభలను సంస్థ నిర్వహించింది.

జర్మనీ, అమెరికా, భారత మహిళోద్యమాలపైన ప్రపంచ మహిళోద్యమంపైన ప్రసంగాలను సంస్థ ఏర్పాటుచేసింది. స్త్రీల సమస్యలపై చర్చావేదికలను నడిపింది. స్త్రీలకు ముప్పై శాతం ఉద్యోగాలు రిజర్వు చేయబడాలనే ఆందోళనలో గొంతు కలిపింది. సంస్థ వార్షికోత్సవాలను, మహిళా దశాబ్ద సభలను నిర్వహించింది.

సంస్థ నిర్మాణ కార్యక్రమాలకు, ప్రబోధ కార్యక్రమాలకు మాత్రమే పరిమితం కాదలచుకున్నది. అందువలన ఇంతవరకు కాస్తో కూస్తో విద్యాగంధం అంటిన మధ్యతరగతి మహిళలనే సంస్థ ఆకర్షించకలిగింది. వారి అభిమానాన్ని చూరగొన్నది. ఇకముందు కార్మిక స్త్రీలను, గ్రామ స్త్రీలను ఉద్బోధపరిచే కార్యరంగాన్ని చేపట్టాలని నిశ్చయించింది. సంస్థ కార్యనిర్వాహకులు తమ అభిప్రాయాలను ప్రకటించటానికి రేడియో, దూరదర్శన్‌లు అవకాశాలు విరివిగా ఇస్తున్నాయి. నగరంలోని న్యాయమూర్తులు న్యాయవాదులు, రచయితలు, అధ్యాపకులు, పండితులు, పత్రికా రచయితలు తోటి మహిళోద్యమ కార్యకర్తలు, ఉద్యోగినులు ఒకరేమిటి అన్ని వృత్తులవారు సంస్థయెడ అభిమానం చూపుతున్నారు. అండదండలు అందిస్తున్నారు. అదే సంస్థ జలం, పట్టణ ప్రముఖులతో, విద్యావంతులతో సంస్థ 1985 సంవత్సరంలో "మహిళా వికాసం"పై సెమినారు నిర్వహించింది.

సోదర సంస్థలు :—

i) మహిళాభ్యుదయ సంస్థ 1981లో మహిళాభ్యుదయ గ్రంథాలయ

స్థాపనకు తోడ్పడింది. ప్రస్తుతం అందులో 1520 తెలుగు పుస్తకాలు, 427 ఇంగ్లీషు పుస్తకాలు ఉన్నాయి. అవి మహిళలలో భావ పునర్ వికాసాన్ని, విజ్ఞానాన్ని కలిగించటానికి చేయూత నిస్తున్నాయి.

ii) కులాతీత, మతాతీత వివాహాలను, వరకట్నమూ, మత ప్రసక్తి లేని వివాహాలను ప్రోత్సహించే నిమిత్తం, వాటిని జరిపించే నిమిత్తం, అలాంటి అభిప్రాయాలను మన్నించి ఆచరించపూనే యువతీ యువకులను పరస్పరం పరిచయం చేసేటందుకు 1981 లో "అభ్యుదయ వివాహ వేదిక" అనే పేరుగల సంస్థ స్థాపనకు మహిళాభ్యుదయ సంస్థ దోహదం చేసింది. ఆ సంస్థ ఆధ్వర్యాన అనేక వివాహాలు జరుగుతున్నాయి. "వివాహం : నేడు రేపు" అనే పేరుగల సెమినారును రెండు రోజులు 1983లో నిర్వహించింది వేదిక. ఆ సెమినారులో వచ్చిన వ్యాసాలను అచ్చువేసింది గ్రంథరూపంగా. వేదికకు నిధిని సమకూర్చుకుంది. వేదికకు బహుళ ప్రచారం వచ్చింది.



iii) ఆలుమగల మధ్య కలతలు వచ్చి కలహాలుగామారి వైవాహిక జీవితానికి విఘాతం సంభవించే సందర్భంగా వారికి సలహా లివ్వడానికి "వైవాహిక కుటుంబ సలహా కేంద్రం" 1984 లో నెలకొల్పబడింది. అందుకు మహిళాభ్యుదయ సంస్థ సాయంచెసింది. కేంద్రంద్వారా ఒక సంఘసేవిక, ఒక న్యాయవాది, వైద్యులు, మానసిక శాస్త్రవేత్త, సామాజిక శాస్త్రవేత్తలచే సలహా లిప్పించటం కార్యక్రమంగా చాలా పట్టుదలతో పనిచేస్తుంది ఈ సలహా కేంద్రం. అనేకమంది స్త్రీలు ఈ కేంద్రంయొక్క సహాయాన్ని అర్థిస్తున్నారు. సలహాకేంద్రం సర్వతోముఖంగా పనిచేస్తోంది.



అలా వైవిధ్యంతో కూడిన ఈ మూడు సంస్థలను స్థాపించి తద్వారా స్త్రీ విముక్తి కార్యరంగ పరిధిని పెంచి మహిళాభ్యుదయానికి బాటలు వేస్తోంది మహిళాభ్యుదయ సంస్థ.



స్త్రీల ఉజ్వల భవిష్యత్తుకు బాటలు వేయాలనే ధ్యేయంతో సంస్థ తన కార్యరంగ పరిధిని విస్తృతం చేయాలని నిశ్చయించి కొన్ని పథ

కాలకు "ప్లాన్లు" వేసింది. స్త్రీలలో స్ఫూర్తిని కలిగించే విద్యకు, వయోజన విద్యకు ప్రాముఖ్యత నిచ్చింది. సంఘ సేవకులకు శిక్షణా తరగతులని నిర్వహించాలని నిశ్చయించింది. స్త్రీల పరిస్థితులను అధ్యయనం చేసి, మెరుగుపర్చటానికి వారితో ధైర్యస్థయిర్యాలను నెలకొల్పుట, పోరాటాలకు సమాయత్తపరుచుట ముమ్మందుగా జరపాలని సంస్థ నిర్దేశించింది. అందుకవసరమైన సెమినార్లను, శిక్షణా తరగతులను, వర్క్ షాపులను, స్టడీ సర్కిల్సును, చర్చావేదికలను, ఉపన్యాసాలను హెచ్చుస్థాయిలో నిర్వహించబోతున్నది. మహిళా సమస్యలను సాహిత్య రూపంలో పరిష్కరించుటకు అన్ని స్థాయిలవారికి అర్థమయ్యే రీతిలో సాహిత్యాన్ని విరివిగా ప్రచురించబోతున్నది.

పై లక్ష్యాలు, సిద్ధాంతాలకు విలువనిచ్చే స్త్రీ పురుషులను సంస్థ ఆహ్వానిస్తోంది. వారి అండదండలను అధిక గౌరవంతో స్వీకరించాలని ఉవ్విళ్ళూరుతోంది. కనుక స్త్రీ విముక్తిని కాంక్షించే ప్రముఖులంతా సంస్థలో చేరి, భాగస్వాములై తమ చేయూత నిచ్చి సేవాకార్యక్రమాలకు సాయపడాలని సంస్థ కోరుతున్నది; అభ్యర్థిస్తున్నది.

—మల్లాది సుబ్బమ్మ
సంస్థ వ్యవస్థాపకులు

---

## మహిళా వికాసానికి, మహిళా సంక్షేమానికి
## మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

| | | | |
|---|---|---|---|
| 1. | హైందవం : స్త్రీలు | (విమర్శనాత్మక గ్రంథం) | రు. 20 |
| 2. | ఇస్లాం : స్త్రీలు | ,, | 15 |
| 3. | క్రైస్తవం : స్త్రీలు | ,, | 12 |
| 4. | Women Tradition & Culture | (Essays) | 70 |
| 5. | Saga of Women's Struggle | ,, | 10 |
| 6. | Women's Movement in A.P. | (History) | 150 |
| 7. | బంగారు సంకెళ్ళు | (వ్యాసావళి) | 10 |
| 8. | స్త్రీ విమోచన | ,, | 7-50 |
| 9. | ఓ మహిళా! ముందుకు సాగిపో | ,, | 7 |
| 10. | మారుతున్న సమాజం : మహిళలు | ,, | 7 |
| 11. | వ్యభిచారం ఎవరి నేరం? | ,, | 10 |
| 12. | ఏది అశ్లీలం? | ,, | 10 |
| 13. | మహిళా దశాబ్దం | ,, | 7-50 |
| 14. | భావవాహిని | ,, | 5-50 |
| 15. | తల్లె పిల్లను చంపితే | ,, | 5 |
| 16. | విముక్తి ఉద్యమాలు:మహనీయులు | ,, | 5 |
| 17. | ఆం.ప్ర. మహిళోద్యమం (1860-1983) చరిత్ర | | 25 |
| 18. | భారత నారి ఆదర్శం (ఎం.ఎన్. రాయ్) అనువాదం | | 10 |
| 19. | మహిళా వికాసం | (వ్యాస సంకలనం) | 15 |
| 20. | వివాహం : నేడు, రేపు | ,, | 20 |
| 21. | ప్రేమ + సెక్స్ = నీతి | (నవల) | 17 |
| 22. | కాంతి కిరణాలు | ,, | 12 |
| 23. | వెలిగిన జ్యోతి | ,, | 12 |
| 24. | చీకటి వెలుగులు | ,, | 10 |
| 25. | ఈ దేశం నాదేనా? | ,, | 5 |
| 26. | మాతృత్వానికి మరోముడి | (కథా సంపుటి) | 20 |
| 27. | మత సమాజాలు : మహిళలు | ,, | 50 |
| 28. | ఆధునిక స్త్రీ | ,, | 15 |
| 29. | మహిళాభ్యుదయం | ,, | 15 |
| 30. | సమస్యలు : సంస్కరణలు | ,, | 20 |
| 31. | సీరియస్ సీరియల్ | (నవల) అచ్చులో | 16 |
| 32. | సామ్రాజ్ఞి రుద్రమదేవి | (బాలల నవల) అచ్చులో | 10 |
| 33. | ఆం.ప్ర. హేతువాద ఉద్యమం | (చరిత్ర) | 2 |